అపరాధ పరిశోధన అనుబంధం—10

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)



## తేనె పూసిన కత్తులు

రచన: సుజనశ్రీ



## అక్రమ వ్యాపారస్తులు, ఖబడ్దార్!

రచన: టెంపోరావ్



## ఆపదలు కాచుకొని వుంటాయ్!

రచన: ఏ. వీ. మోహన్రావ్



## అగ్ని గుండాలు

రచన: కంచర్ల రమణ



"ఖైదీ" సీరియల్ - ఐదవ భాగము

# అపరాధ పరిశోధన సప్లిమెంట్—10

అక్టోబరు, 1974
వెల: రు. 3-00
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామ దామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. ఏ. మోహన్రావ్**
**కంచర్ల రమణ**
**సుజనశ్రీ**
**మిస్. మధుబాల**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాద్-29
ఫోన్—36959

ముద్రణ:
**క్రాంతి ప్రెస్**
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

శ్రీ

[illegible]

# తేనె పూసిన కత్తులు

## సుజనశ్రీ

జలజ విసుగ్గా చేతిలోని ఫ్లాస్క్‌ని బల్లమీదకు గిరాటు వేసింది. ఆమెకు నిన్నటినుంచి ఒకటే చికాకుగా ఉంది.

నిన్న ఉదయం తానుంటున్న ఇంటికి ఎదురింట్లోని నరసింహులు తనని చూసి వెకిలిగా నవ్వుతాడా? వాడికేం పోయ్యేకాలం? అసలు వాడికి పెళ్లాం, ముగ్గురు ఆడపిల్లలూ ఉన్నారు, ఈసడించుకుంది.

జలజ ఏదో దినపత్రిక ఆఫీసులో స్టెనోగా పనిచేస్తున్నది. ఆమె అప్పుడప్పుడు కొన్ని వ్యాసాలు గూడ రాస్తుంటుంది, అదే పత్రికలో. ఆమెకు ఇంకా వివాహం కాలేదు.

ముందూ వెనుక తల్లీ తండ్రీ ఎవరూ లేరు. ఒక్క ముసలి అమ్మమ్మ తప్ప. ఆమే, తనూ ఈ ఇంట్లో చాలకాలం నుంచీ అద్దెకుంటున్నారు. అమ్మమ్మ మూడు రోజుల క్రితమే ఊరికి వెళ్ళింది, తెలిసినవాళ్ళ పెళ్ళికి వెళ్ళి రావాలని.

తను ఒంటరిగా ఉన్నానని పసిగట్టి ఆ నరసింహులు ఇంతకు తెగిస్తాడా? ఇది వాడి భార్యకు చెబితే! ఆవిడో మహాంకాళి లాంటిది. మొగుడ్ని నాలుగు మొట్టి మూల కూర్చోబెట్టినా పెట్టగలదు.

ఆ రోజు చికాకుగానే ఆఫీసుకు వెళ్ళింది. తన పక్క సీటులోని రామారావ్ కూడ, ఎందుకో, ఆనాడు తనని "టీజ్" చేస్తున్నట్టుగా అనిపించింది.

ఆ రిపోర్టు చూపించండి, ఈ రిపోర్టు ఎలా రాస్తు న్నారు అని ఏదో సాకుతో తనవద్దకు వస్తున్నాడు. రిపోర్టు కాగితాలు ఇచ్చేటప్పుడూ, తీసుకునేటప్పుడూ అతని వ్రేళ్ళను తన చేతి వ్రేళ్ళకు తాకిస్తున్నాడు కావా లనే. జలజకు కోపం వచ్చేసింది. రామారావు గూబమీద చెంప దెబ్బ కొడదామనిపించింది ఆమెకు.

అయినా తమాయించుకుంది. తను స్త్రీ, అతడు మగ వాడు. ముల్లువచ్చి ఆకుమీద పడినా, ఆకువచ్చి ముల్లుమీద పడినా ఆకుకే ప్రమాదం. అందుకే తనను తాను శాంత పరచుకుంది.

గాంధీగారిమీద వ్యాసం తయారుచేయవలసి ఉంది. ఇంటిదగ్గర రాసుకుని వస్తానని ఎడిటర్‌తో చెప్పి, ఆఫీసు నుంచి వచ్చేసింది. అయితే ఆమెకు ఇంటికి పో బుద్ధి కాలేదు.

నేరుగా తన స్నేహితురాలు రాగిణి ఇంటికి వెళ్ళింది. రాగిణికూడ ఏదో బ్రిటిష్ కంపెనీలో స్టెనోగా పనిచేస్తు

న్నది. ఆమె ఒక్కతే ఉంటున్నది ఆ పోర్షన్‌లో. మిగతా భాగాల్లో వేరే కాపురాలు నివసిస్తున్నాయ్. ఆమెకు తన అక్క చెప్పుకుంది జలజ.

"మా గ్రాండ్ మదర్ వచ్చేటప్పటికి ఇంకో నాలుగైదు రోజులు పట్టొచ్చు. అందాక నేనుగూడ నీతో పాటే ఉంటాను రాగిణీ!"

"నిరభ్యంతరంగా ఉండు. అయితే నేనీపూట క్యాంప్‌కు వెళుతున్నాను జనరల్ మేనేజర్ వెంట. ఇక్కడా నీవు ఒంటరిగానే ఉండాల్సి వస్తుందేమో! కాకపోతే నీకిక్కడ నరసింహులులాంటి రావణాసురుళ్ళు ఉండరులే!" రాగిణి హామీ ఇచ్చింది.

"అయితే ఇంకేం! మహారాణీలాగా ఉంటాను."

రాగిణి తన బ్రీఫ్ కేస్ తీసుకుని వెళ్ళిపోయింది కంపెనీ కారు రాంగానే.

ఇంట్లో జలజ మిగిలిపోయింది. వ్యాసం రాద్దామని కాగితాలూ, కలం, ప్యాడ్ తీసుకుంది. ఎంతసేపటికీ ఆమె కళ్ళల్లో నరసింహులూ, రామారావే మెదలడంతో ఆమెకు "మూడ్" కుదరలేదు.

విసుగ్గా కాగితాల్ని టేబుల్ మీద పారేసింది. టాయిలెట్‌లోకి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చింది. ఫ్లాస్కు వంచుకుని కాఫీ త్రాగింది.

ఆ తర్వాత ఆమె ఇంటిని సోదా చేయసాగింది. ఆ పోర్షన్‌లో రెండు గదులు, బాత్‌రూమ్ ఉన్నాయ్. మొదటి గది డ్రాయింగ్ రూమ్, రెండో గది వంటగది క్రింద వాడుకుంటోంది రాగిణి.

ఆ పోర్షన్ మూడో అంతస్తులో ఉంది. ఇంతటి మహానగరంలో, ఇళ్ళు దొరకటం చాలా కష్టం. ఈ బిల్డింగ్‌లో దాదాపు యాభై అరవై కాపురాలుంటున్నాయ్.

మొదటి అంతస్తువరకు వ్యాపార సంస్థలు ఉన్నాయ్. మూడో అంతస్తులోనూ, నాలుగో అంతస్తులోనూ కాపురాలుంటున్నాయ్.

రాగిణి షోరూమ్ ముందు వాటాలోదే. కిటికీ దగ్గర కూర్చుంటే రోడ్డుమీది జనం కనబడుతూనే ఉంటారు.

ఆమె షోరూమ్ ఎదురుగానే, రోడ్డుకు అటు ప్రక్కగా మరో మూడంతస్తుల బిల్డింగ్ ఉన్నది. అందులో ఎక్కువగా సినిమా డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు ఉన్నాయ్. మూడో అంతస్తులో మాత్రం మూర్తి ఫోటో స్టుడియో ఉంది. అతనికి పెద్దగా బిజినెస్ జరుగుతుందో లేదో అనుకుంది జలజ.

ఫోటో స్టుడియో క్రింద షోరూమ్‌లో ఉంటే ఎవరన్నా ఫోటో తీయించుకునే వాళ్ళు త్వరగా రావటానికి వీలవుతుంది. మూడో అంతస్తులోని ఫోటో స్టుడియోకి ఎవరొస్తారు అంత ఓపిక చేసుకుని!

వెనక్కి వచ్చి కుర్చీలో కూర్చుంది జలజ. కిటికీలోంచి మూర్తి స్టుడియో కనుపిస్తున్నది. ఏదో ఆలోచనగా స్టుడియోకేసి చూసింది.

కిటికీలోంచి చూస్తున్న జలజకు స్టుడియో తలుపు తెరుచుకుని ఎవరో వచ్చినట్లుగా అనిపించింది. మూర్తి డెవలెపింగ్ స్టాండుదగ్గర నిలబడి ఏదో ఫోటోని "టచ్" చేస్తున్నాడు.

తెరుచుకున్న వాకిలిగుండా వెలుతురు లోపల పడుతున్నది. హ్యాట్ పెట్టుకున్న వ్యక్తి లోపలకు వచ్చినట్లుగా వెలుతురుమీద నీడ పడింది. అయితే ఆ వ్యక్తి జలజకు కనుపించలేదు. కేవలం వెలుతురుగా ఉన్నచోట ఒక వ్యక్తి నీడ పడడంవల్ల ఆమె అలా ఊహించుకుంది.

అయిదు నిముషాలు గడిచినయ్. మూర్తి దేన్నో

చూడటానికి కాబోలు కిటికీ వద్దకు వచ్చి క్రిందకు చూశాడు. ఆ తర్వాత అతడు ఇంకా వంగి క్రిందకు చూచాడు.

అతడి వెనుకే ఆ ఆకారం కదిలినట్టుగా లీలగా కను పించింది జలజకు.

మరుక్షణంలో అతడు పెద్దగా అరుస్తూ కిటికీలోంచి క్రింద పడిపోతున్నాడు మూడో అంతస్తులోంచి. సెకం డ్లలో అతడు క్రింద పడడం, తల పగిలిపోవటం జరిగింది.

జలజ గాభరాగా కిటికీవద్దకు వెళ్ళి రోడ్డువంక చూడా లని వంగి చూస్తూ మూర్తి స్టుడియోలోకి చూసింది. ఇందాకటివరకు తెరచివున్న తలుపు మూసేసి ఉన్నట్టు న్నారు, ఇందాక తను చూసిన వెలుగు, బయటినుంచి లోపలకు పడుతున్న వెలుగులేదు. ఎవరో తలుపు మూసేసి వెళ్ళిపోయి ఉండాలి అనుకుంది.

మూర్తి శరీరం చుట్టూ జనం చేరారు. అంబులెన్స్ వచ్చింది. అప్పటికే అతడి ప్రాణం పోయింది.

పోలీసులు వచ్చారు. ఆ చుట్టుపట్ల ఉన్నవారినుంచి వివరాలు సేకరించారు సాక్ష్యం క్రింద.

మూర్తి కిటికీలోంచి క్రిందకు చూస్తూ బ్యాలెన్స్ తప్పి పోయి కిటికీలోంచి జారి క్రింద పడిపోయాడని అందరూ చెప్పిన కథనం.

జలజకు మాత్రం ఇది ప్రమాదవశాత్తు జరిగిన సంఘటన కాదనీ, కావాలని ఎవరో మూర్తిని హత్యచేసి ఉండాలని పించింది.

పోలీసులకు అదే చెప్పింది.

"నేను కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాను. మూర్తి ఉన్న గది తలుపు తెరచి ఉన్నదనటానికి ఆధారం బయట నుంచి సూర్యరశ్మి ఆ గాకిట్లోంచే లోపలకు పడుతున్నది.

అంతలో ఏదో నీడ పడింది. అంటే మరో వ్యక్తి లోపలకు వచ్చాడన్న మాటే గదా! అతడు మూర్తితో ఏమో చెప్పి ఉండాలి. మూర్తి ఆత్రంగా కిటికీవద్దకు వచ్చి చూశాడు. వెనుకనున్న వ్యక్తి అతడ్ని క్రిందకు తోసేశాడేమో అని నా అభిప్రాయం."

"మూర్తి క్రిందపడేటప్పుడు అతని వెనుకనున్న వ్యక్తి ఎవరన్నా కనుపించారా?" సార్జెంట్ అడిగాడు.

"లేదండీ!" ఎవరూ కనుపించలేదు. అదే నాకూ ఆశ్చర్యంగా ఉంది" అని చెప్పింది.

# 2

మిసెస్ మూర్తి, సరస్వతి తన పుట్టింటికి వెళ్ళింది ఈ సంఘటన జరగకముందు. ఆమెకుగూడ కబురు వెళ్ళింది.

మూర్తి మరణం కేవలం ప్రమాదవశాత్తు జరిగిందనీ, ఇది హత్యగాని, ఆత్మహత్యగాని అయేందుకు అవకాశం లేదని పోలీసుల కథనం.

మూర్తికి సలక్షణమైన ఆస్తి వుంటాయి. ఆతని మొదటిభార్య ఎవరితోనో లేచిపోయింది. సరస్వతి గూడ అప్పటికి భర్తను కోల్పోయిన విధవ. అయితేనేం? ఆమెకు లక్ష రూపాయల ఆస్తి వుంది. అందుకే మూర్తి సరస్వతిని వివాహమాడాడు.

వారిద్దరి వివాహ జీవితంలో ఎటువంటి పొరపొచ్చాలు, విభేదాలు లేవు. సరస్వతికి మూర్తిని హత్యచేసే టంతటి అవసరంలేదు. మూర్తికి గూడ ఆర్థికంగా ఇబ్బందిలేదు. కాబట్టి అతడు ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరంలేదు. పోలీసుల వాకబులో తెలిసినదేమంటే మూర్తి ఆ ఉదయమే పొరుగూరుకు వెళ్ళి వచ్చాడు. ఏ ఊరికి వెళ్ళిందీ ఎవరూ చెప్పలేకపోయారు.

మూర్తి శరీరాన్ని మార్చురీలో శవపరీక్ష చేసి అతడు

విష ప్రయోగం వల్ల కాని, బలవంతంగా కొట్టి, హింసించి గాని చంపబడలేదని నిర్ధారణ చేశారు. అసలు అదైనా జరగకుండానే పోలీసులు శవాన్ని వదిలేసేవాళ్ళే. జలజ వాఙ్మూలం మూలంగా వాళ్ళు ఆపని చెయ్యాక తప్పలేదు.

మూర్తి ఇల్లూ, స్టూడియో అన్నీ అదే పోర్షన్లో ఉన్నయ్. ముందు రెండుగదులూ స్టూడియో క్రింద, వెనుక కుడిప్రక్కన ఉన్న అయిదు గదులూ నివాసం క్రిందా ఉన్నయ్. అతడు ప్రమాదానికి గురి అయినరోజున అతడి భార్యకూడా ఇంట్లో లేదు.

అయితే అతడు చనిపోయిన రోజు రాత్రి ఆ ఇంట్లో మరో విశేషం జరిగింది.

ఆ రాత్రి అతని ఇంట్లోకి ఎవరో దొంగ జొరబడ్డాడు. ఇంటికి వెనుక ప్రక్కగా ఊచలులేని కిటికీ ఉంది. దాని తలుపులు తెరుచుకునిమరీ ఆ వ్యక్తి లోపలకు జొరబడ్డాడు. మూర్తి భార్య సరస్వతి మరో పనిమనిషిని కాపలాకోసం, తోడుకోసం అట్టే పెట్టుకుంది. వాళ్ళిద్దరూ బెడ్ రూమ్లో నిద్రపోతున్నారు.

రాత్రి 11 గం. లయి వుంటుంది. ఆ వ్యక్తి లోపలకు రావటం ఎవరూ చూడలేదు. లోపల గదుల్లో అలికిడి అయితే పనిమనిషే ముందు కళ్ళు తెరిచింది. సరస్వతిని లేపి యిద్దరూ అలికిడి వినపడిన గదిలోకి వెళ్ళారు. ఎవరో వ్యక్తి వాళ్ళను చూస్తూనే కిటికీలోంచి దూకి క్రిందకు వెళ్ళిపోయాడు.

దీన్ని పోలీసులు దొంగతనం క్రిందే జమకట్టారు. ఇల్లు తాళంవేసి ఉండటంచూసి ఏ దొంగ అయినా, ఆ ఇంట్లో ఎవరూ ఉండరని ఊహించి ఇంట్లోకి జొరబడి ఉంటాడని వాళ్ళు అనుమానించారు.

మర్నాటినుంచి ఇద్దరు పోలీసుల్ని ఆ ఇంటివద్ద కాప

లాగా వేశారు. దాంతో మరో కొంగ ఎవరూ ఆ ఇంట్లోకి దూరే అవకాశం కలగలేదు.

జలజ ఆ ప్రమాదాన్ని మరచిపోవాలని ఎంత గానో ప్రయత్నించినకొద్దీ ఆమె మనసులో అదే దృశ్యం మరీ మరీ మెదులుతోంది.

జలజకు సినిమా కెళ్ళినా, ఆఫీసులో ఉన్నా, లేదా మరో చోటికి వెళ్ళినా అతని మరణదృశ్యం ఆమెకళ్ళల్లో మెదులుతూనే ఉన్నది. తను పొరబాటు పడిందా? తెరచి వున్న వాకిలిలోంచి వెలుతురు పడుతూండగా, ఆ వెలుగుకు అంతరాయం కలిగిస్తూ నీడపడటం తను స్పష్టంగా చూసింది. వెలుగూ నీడల్నీ ఒకదాని కొకటిగా భ్రమించి పొరబడే స్థితిలో లేదు తను. అయితే మరి హంతకుడెవరు?

చనిపోయిన ఫోటోగ్రాఫర్ మూర్తి ఆమె కలలోకి కూడ రాసాగాడు. కనీసం అతగాడి పుట్టుపూర్వోత్తరాలు తనకు తెలిసివున్నా అతని మరణాన్ని తను విడమర్చగలిగి ఉండేది. ఆమె చిక్కు ప్రశ్నలన్నిటికీ సమాధానం దొరకేదాకా అది అభేద్యమైన మిస్టరీ గానే ఉండి పోయింది.

మరునాటి ఉదయం పేపర్లో ప్రకటన చూసి జలజ అయోమయంలో పడిపోయింది. ఆ ప్రకటన సరస్వతి వేయించింది.

తన భర్త మూర్తి పెద్ద కళాకారుడనీ, అతని ఆత్మకథను వ్రాయించి అచ్చు వేయిస్తుందట. ఆ పనికై జర్నలిజంలో అనుభవం కలిగిన వ్యక్తి కాంట్రాక్టు పద్ధతిపై కావాలని ఉంది. సరస్వతి ధనవంతురాలు. కీర్తిశేషుడైన తన భర్త పేరు ప్రక్కనే తన పేరుగూడ అచ్చులో చూసుకోవాలని ఆమెకు మోజేమో.

జలజకు అంతలోనే మెరుపులా ఆలోచన వచ్చింది.

అయితే సరస్వతి తన భర్త యొక్క ఆత్మకథను తయారు చేయించబోతోంది. ఆత్మకథ రాయాలంటే ఆ వ్యక్తిని గురించి అన్నీ విషయాలు తెలియాలి. మూర్తి జీవితంలోని నిగూఢ రహస్యాలు తెలుసుకోవాలంటే ఇదే మంచి అవకాశం. ఏమైనాసరే తనుకూడ ఈ పనికి దరఖాస్తు పంపించాలని అనుకుంది.

# 3

మూర్తి ఫోటోల్లో చూపినట్లు మెట్లు ఎక్కుతూ అన్ని దిక్కులా పరికిస్తున్నది జలజ.

వాకిట్లో పనిమనిషి ఎదురయింది.

“సరస్వతిగారున్నారా?” జలజ అడిగింది.

“పేపర్లో ప్రకటన చూసి వచ్చారా?”

“అవును!”

“లోపలకు వచ్చి కూర్చోండి. ఆమె ఎవరితోనో మాట్లాడుతున్నారు” అంటూ డ్రాయింగ్ రూమ్‌లో కుర్చీలు చూపించింది.

జలజ ఆ రూమ్‌ని కలయజూసింది. నేలమీద ఎర్ర రంగు తివాసీ పరిచివుంది. సోఫా సెట్లు, రోజ్‌వుడ్‌తో చేయబడి పూలూ, లతలు చెక్కబడిన కుర్చీలూ, టేబులూ, ప్రతి గోడమీద పెద్ద పెద్ద ఫోటోలు, స్టూలుమీద పెద్ద పులి బొమ్మ. మొత్తానికి కళాభిరుచులతో అలంకరింపబడి ఉంది ఆగది.

ఎవరిదో మాసిపోయిన ఈవెనింగ్ హ్యాట్ పులితల మీద తగిలించబడి ఉంది. ఆ గదిలోని ప్రతి అందమయిన వస్తువునూ వెక్కిరిస్తున్నట్టుగా ఉంది ఆ హ్యాట్. అంత అందవికారంగా ఉంది.

లోపల గదిలోంచి మాటలు అస్పష్టంగా వినిపిస్తు

న్నయ్. గోడగడియారం టిక్ టిక్ మనే శబ్దం, క్రింద రోడ్డుమీద కార్లూ, వాహనాలూ పోతూన్న ధ్వని వినబడు తున్నయ్ పెద్దగా.

పనిమనిషి మరో ఇద్దరు వ్యక్తుల్ని ప్రవేశపెట్టింది. అందులో ఒకామె సన్నగా వుంది. లోతైన కళ్ళు, లోప లకు పోయిన దవడలూ, కొంత నలుపూ, కొంత తెల్లగా ఉన్న జుట్టూ, చేతిలో చిన్న ప్లాస్టిక్ బ్యాగ్ పట్టుకుని ఉన్నది.

ఈమెను ఎక్కడో చూసినట్టున్నదే అనుకుంది జలజ. రెండోవ్యక్తి పురుషుడు. అయిదున్నరడుగు లున్నాడు. ఎర్రగా అందంగా ఉన్నాడు. టెరిలిన్ ప్యాంటూ, ఫుల్ బూట్, పొడుగు చేతుల చొక్కా టక్ చేసుకుని హుందాగా ఉన్నాడు.

సరస్వతి కూర్చున్న గదితలుపు తెరుచుకుంది. సన్నగా పీలగా ఉన్న వ్యక్తి హడావిడిగా బయటకు వచ్చాడు ఆ గదిలోంచి. పులిబొమ్మమీద తగిలించబడివున్న హ్యాట్ ని అందుకున్నాడు.

"మళ్ళీ నాకు ఏ విషయం ఎప్పుడు తెలియజేస్తా నంటారు మాడమ్!" కంగారుగా ఆమెవేపు తిరిగి అడి గాడు.

"రేపు మీకు పోస్టుద్వారా తెలియజేస్తాం!" లోప ల్నుంచి అధికారగర్వం ఉట్టిపడేలా కంఠం వినిపించింది.

అతడి కళ్ళల్లో కనుపించే ఆదుర్దానుబట్టి అతడికీ కాంట్రాక్టు రాలేదేమో అనిపిస్తున్నది.

లోపల్నుంచి పనిమనిషి వచ్చింది. "అమ్మగారు పిలు స్తున్నారు వెళ్ళండి!" జలజ వంక చూస్తూ అన్నది.

జలజ కంగారుగా తననుతాను సర్దుకుని గదిలోకి వెళ్ళింది. సరస్వతి పేరుగల వ్యక్తికి అంత పెద్దగా చదువు

అబ్బలేదనిపించింది. కాకపోతే ఆమెకు తనకు ఐశ్వర్యం ఉన్నదనే గర్వం మాత్రం మనిషిని మించిపోయి వున్నది.

జలజ తను పత్రికలో జర్నలిస్టుగా పనిచేస్తున్నట్టు, ఈ గ్రంథం వ్రాసిపెట్టినందుకు పారితోషికం రెండు వేలు కావాలని చెప్పింది.

సరస్వతి ఇంకా కొన్ని వివరాలడిగింది. "మీరు కాసేపు వెయిట్ చెయ్యండి. మిగతా వాళ్ళని కూడ ఇంటర్వ్యూ చేసి, ఏ సంగతీ మీకు ఇప్పుడే చెప్పేస్తాను."

"థ్యాంక్స్ మాడమ్!" అంటూ జలజ బయటకు వచ్చింది. డ్రాయింగ్ రూమ్‌లో ఈతడవ కూర్చోలేదు ఆమె. గోడలమీదున్న చిత్రాలన్నింటినీ నిశితంగా తరచి తరచి చూడసాగింది. మూర్తి లైఫ్-సైజ్ ఫొటోగూడ ఉంది. అందులో అతని కళ్ళల్లో చిలిపితనం గోచరిస్తున్నది.

ఫొటోవంక చూస్తూ ఆమె ప్రక్కకు మరో అడుగు వేసింది. అయితే అక్కడ కుర్చీలాంటిదేదో అడ్డంవుండి ఆమె తూలి పడబోయింది. ఎవరిదో హస్తం ఆమెను ఆపింది.

జలజ ఆ వ్యక్తివంక చూసింది. అతడు ఒక క్షణం క్రితం సరస్వతి గదిలోకి వెళ్ళివచ్చిన, మాసిపోయిన హ్యాట్ యజమాని.

అతగాడు కుర్చీలో కూర్చుని తన ముందున్న డ్రాయర్లోని కాగితాల్ని వెదకి చూస్తున్నాడు. ఇంటర్వ్యూ కని వచ్చిన వ్యక్తి డ్రాయరులోని కాగితాలు వెదకవలసిన పని ఏముంటుంది? ఇతడు నిజంగా ఉద్యోగంకోసం వచ్చాడా? లేక గూఢచారిపని చేస్తున్నాడా?

అతడు తన హ్యాట్ ఎత్తి "గుడ్ మార్నింగ్ మాడమ్!" అన్నాడు.

జలజ మెదడులో అతడి హ్యాట్ దేన్నో గుర్తుకు

తెచ్చింది. మూర్తి గదిలో నీడ పడినప్పుడు సరిగా ఇలాంటి హ్యాట్ నీడే పడింది.

"మీరు...మీరు మూర్తికి ప్రమాదం జరిగినప్పుడు రోడ్డుమీద జనంలో కనిపించారు కదూ?" తొట్రుపాటుతో జలజ అడిగింది.

ఆ వ్యక్తి ఇంకా కంగారు పడ్డాడు. "మూర్తి ఎప్పుడు పోయాడో నాకు తెలియదు. కాని నేను ఆ రోడ్డుమీదే తిరుగుతుంటాను ఎక్కువగా. ఎందుకంటే నేనూ ఈ వీధి చివరలోనే ఉండేది" అతడు చిరునవ్వుతో అన్నాడు. అంతలోనే అతడు మళ్లీ కంగారుగా కనుపించాడు. డ్రాయరు లోపలకు తోసేశాడు. జలజ భుజంమీదుగా ఆమె వెనుకవున్న వ్యక్తిని చూస్తూ.

జలజ కూడా వెనుదిరిగి చూసింది.

సరస్వతి గదిలోంచి బయటకు వచ్చాడు ఆ అందమైన యువకుడు. జలజ మళ్లీ ఇటు తిరిగేసరికి హ్యాట్ వ్యక్తి బయటకు వెళ్ళిపోయాడు, హడావిడిగా.

జలజవంక సాదరంగా, చిరునవ్వుతో చూస్తూ. అన్నాడు. "ఈ జాబ్ మనిద్దరిలో ఒకరికి రావాలి. ఎందుకంటే మిగతా ఇద్దర్నీ ఆమె పంపేసింది."

"థ్యాంక్స్!" అన్నది జలజ అతడి కళ్ళల్లోకి చూస్తూ. ఇతగాడికి ఆడవాళ్ళను సమ్మోహనపరిచే శక్తి ఉంది అనుకుంది.

"మీ పేరు తెలుసుకోవచ్చా?" అతడు ప్రశ్నించాడు.

"జలజ!"

"నా పేరు కాంతారావు! అన్నట్టు ఇందాక హ్యాట్ పెట్టుకుని ఉన్న వ్యక్తి ప్రమాదం జరిగిన రోజున మీకెలా తటస్థపడ్డాడు?"

కాంతారావు చూపులు ఆమెనే నిశితంగా చూస్తున్నయ్.

"నేను మా స్నేహితురాలు కావిడ ఇంటికి వెళ్ళి వస్తూంటే గా ఈ ప్రమాదం జరిగింది. నేను కాసేపు అక్కడే నిలబడిపోయాను. అక్కడే గోడమీద రాస్తూ ఈ నక్క కనుపించాడు."

"అంటే మీరు క్రిందనే గోడ మీద నిలబడి ఉన్నారా?" అతను ప్రత్యేకించి మళ్ళీ అడగటం ఆమెకు చిరాకనిపించింది.

ఇక్కడకు ఇంటర్వ్యూకని వచ్చిన వ్యక్తులందరూ అనుమానితులుగానే తోచారు జలజకు. వీళ్ళందరకూ మూర్తి ఆత్మకథ రాయటంకన్నా అతడి మరణంలో ఆసక్తి ఉన్నట్టుగా ఉంది. కాకపోతే ఒక వ్యక్తి వాయుగా కాగితాలు, వ్రాయడూ వెదకవలసిన పని ఏముంది? మరో వ్యక్తి ప్రమాద సంఘటనను గురించి ఆత్రంగా అడుగుతాడా?

తను మాత్రం, నిజంగా ఈ ఉద్యోగంకోసం వచ్చిందా? మూర్తి మరణం తాలూకు వివరాలేమైనా దొరుకుతాయేమో అని గదా వచ్చింది. జలజ తనలో తను నవ్వుకుంది.

"అవును. నేను ఆ ప్రాంతానికి వచ్చేసరికి జనం గుమిగా ఉన్నారు. హడావిడిగా పోలీసులు వచ్చారు. నేను అక్కడే ఎవరో వాకబుచేసి సంగతి తెలుసుకున్నాను! అన్నట్టు మీరూ ఆ ప్రదేశంలోనే ఉన్నారా?"

అతడు కంగారును కప్పిపెట్టుకుంటూ జవాబిచ్చాడు. "అవును. నేను పేవ్ మెంట్ మీద నడుస్తూండడం సంభవించింది."

జలజకు అనుమానం ఎక్కువైంది. ఒకవేళ ఇతడేనేమో

హంతకుడు! స్టుడియోలోకి ప్రవేశించి, మూర్తి కిటికీలోంచి చూస్తున్నప్పుడు కాళ్ళు పైకెత్తి బయటకు తోసివేశాడేమో! ఇతడు అంతపని చేయగల సమర్థుడులానే ఉన్నాడు.

అంతలో సరస్వతి గదిలోంచి బయటకు వచ్చింది.

“మిస్టర్ కాంతారావ్! మీకు నా భర్తగారి ఆత్మకథను వ్రాసే బాధ్యత అప్పజెప్పుతున్నాను. వెరీసారీ మిస్ జలజా! మీరుగూడ ఈ పనికి అర్హులే! కానీ మీ ఇద్దరిలో ఈ కాంతారావే ఆ పనికితగ్గ వ్యక్తిలా తోచాడు నాకు” అంది సానుభూతి ప్రకటిస్తూ.

జలజ ఉక్రోషంగా అతడి వంక చూసింది. ముసలి ముండకు అప్పుడే సమ్మోహనాస్త్రం వేశాడల్లే ఉంది అనుకుంది కసిగా.

“థ్యాంక్యూ మేడమ్!” అంటూ మేడ మెట్లు చరచరా దిగి రోడ్డుమీదకు వచ్చేసింది జలజ.

వచ్చేటప్పుడున్న ఉత్సాహం, ఆవేశం ఇప్పుడు చప్పగా చల్లారిపోయినయ్. స్టుడియోని పరీక్షించి తన ఊహ, అదే పోలీసులకు తనిచ్చిన సాక్ష్య వాఙ్మూలం ఎంతవరకు కరెక్టో తెలిసికోవాలని వచ్చింది. కాని తనకు ఆ పని సానుకూలం కాలేదు. ఎందువలన? తనకంటె ఆతృతగల మరో ఇద్దరు తన పనికి ఆటంకం కలిగించారు.

చకచక నడిచిపోతున్న జలజకు వెనుకనుంచి ఎవరో పిలుస్తున్నట్టుగా తోచి ఆగింది. వెనుకకు తిరిగి చూసింది.

కాంతారావు పిలుస్తున్నాడు. అతడూ తనవెనుకే వస్తున్నట్టున్నాడు. తను తొందరలో గమనించనే లేదు.

“చూడండి జలజగారూ! మీకే ఈ అవకాశం వస్తే బాగుండుననిపించింది! కాని రాలేదు! పోనీ మీకు మూర్తి గారి జీవిత విశేషాలేమైనా కావాలంటే తర్వాత ఇవ్వ

గలను. ఎటూ అతడి జీవిత చరిత్ర అంతా నా చేతుల్లోనే ఉంటుంది గదా?"

జలజ నాకేం అక్కర్లేదులే అని అందామనుకుంది.

అంతలోనే ఆమె గేటు కావలి ప్రక్కనున్న రాగిణిని చూస్తూ "హల్లో!" అని నవ్వింది. గేటు దాటి ఆమె దగ్గరకు పోయింది.

"ఏమే రాగిణీ! నాలుగు రోజులదాకా రానన్నావే!" అంది.

"క్యాంప్ అయిపోయింది! వచ్చేశాను! అదిసరేగాని ఎవరా వ్యక్తి. చూడ్డానికి మంచి అందగాడ్నే పట్టావ్!" రాగిణి ఊరిస్తూ పలికింది.

"చాల్లేవే! అతనెవరో నాకు తెలియదు. ఇంతకుముందే పరిచయం కలిగింది!"

"అలాగా! సరేలే! చేజిక్కిన మగాడ్ని కొంగున ముడేసుకుని పెళ్లాడేయ్! నేను ఆఫీసుదాకా వెళ్లొస్తాను!" అంటూ లేడీస్ సైకిల్ మీద తుర్రుమంది రాగిణి.

ఇంతసేపూ కాంతారావు కళ్ళు తననీ, రాగిణినీ కనిపెట్టి ఉండటం తను చూడలేకపోలేదు. మూర్తి స్టుడియోలోని కిటికీకి ఎదురుగా ఉన్న పోర్షన్ వంకా, రాగిణివంకా కూడ ఒకటి రెండుసార్లు చూశాడు. ఆ కిటికీలోనుంచి కనబడే దృశ్యాన్ని తాములేక, తమిద్దరిలో ఒకరుగాని చూసి ఉండచ్చని అతడు పసిగట్టాడా?

జలజ మళ్ళీ వెనక్కి వచ్చేసరికి కాంతారావు అక్కడ లేడు. అప్పటికే వెళ్ళిపోయాడు.

ఆమె పేవ్‌మెంట్ మీద నడుచుకుంటూ ముందుకు వెళ్ళింది. వీధిచివర మందుల షాపులో స్టూలుమీద కూర్చుని సిగరెట్ పొగని రింగులు రింగులుగా వదులుతున్నాడు

మాసిన హ్యాట్ వ్యక్తి.

హోటల్లో ఫోంచేసుకుని ఇంటికి వచ్చిన జలజకు మరో ఘోరవార్త తెలిసింది. రాగిణి లారీ యాక్సిడెంట్ లో మరణించిందని.

## 4

టాక్సీ కేకేసింది జలజ. అందులో ఎక్కి గవర్నమెంటు హాస్పిటల్ చేరుకుంది.

శవాల గదిదగ్గర రాగిణి మేనమామ రాజారావు పోలీసులు అడిగే ప్రశ్నలకు విసుగ్గా జవాబు చెబుతున్నాడు.

“ఆమెకు ఆత్మహత్య చేసుకోవాలని కోరిక ఉంటే ఉండుగాక. అదీ నాతో ఉన్నప్పుడే చావాలా? ఇప్పుడిది నా చావుకు వచ్చింది!” అంటున్నాడు రాజారావు.

“ఇప్పుడు ఆ చనిపోయిన అమ్మాయిమీద చిందులు త్రొక్కితే ఉపయోగం ఏమిటి? కాస్త నిదానించి జరిగిన విషయం చెప్పు!” అని అడిగాడు సార్జెంట్.

“చెప్పేందుకేముంది. ఈ ఊళ్ళో నా టేప్ రికార్డర్ రిపేరుకు ఇచ్చాను. అది తీసుకు వెడదామనే ఇవాళే మా ఊరునుంచి వచ్చాను. మా మేనకోడల్ని కూడ చూసిపోదామని వచ్చి ఆమెతో మాట్లాడాను. ఇద్దరం హోటల్ లో కాఫీ త్రాగి వస్తున్నాం. రోడ్డు దాటాల్సి ఉంది. ట్రాఫిక్ సిగ్నల్ ఎరుపురంగు వెలుగుతోంది. అందుకని పేవ్ మెంట్ మీదే ఆగాం. మావెంట ఇంకా జనంకూడ ఉన్నారు. అంతలోనే రాగిణి రోడ్డుకడ్డంగా పడిపోయింది. స్పీడ్ గా వస్తున్న ట్రక్ క్రింద పడిపోయింది.”

“ట్రక్ డ్రయివర్ కథనం ప్రకారం ఆమెను ఎవరో బలవంతంగా తోసివుండాలట!”

వెంటనే జలజ కలుగజేసుకుంది. క్లుప్తంగా మూర్తి

మరణం గురించి, తను సాక్ష్యమిచ్చిన రీతి చెప్పింది.

"ఎవరో మూర్తిని హత్య చేశారనే నా అనుమానం. అప్పుడు నేను రాగిణి ఉండే హోటల్‌లో ఆ రోజు నే నున్నాను. రాగిణి ఆ ఉదయమే తన బాస్‌తో క్యాంప్ వెళ్ళింది. హంతకుడు నన్నే రాగిణి క్రింద పొరబడి ఉంటాడు. అదను చూసుకుని ఆమె నీ యాక్సిడెంట్‌కి గురిచేశాడు" ఆవేశంగా అంది జలజ.

రాజారావు ఆమె మాటలు వింటూనే కొయ్యబారి పోయాడు.

సార్జెంట్ జలజవంక ఆశ్చర్యంగా చూశాడు. "మూర్తి మరణం తాలూకు సాక్ష్యమిచ్చిన అమ్మాయివి కదూ?" అంటూ ఆమెను నఖశిఖపర్యంతం చూశాడు.

జలజ హాస్పిటల్ నుంచి ఇంటిదోవ పట్టింది. సైకిల్ రిక్షాగాని, ఆటోరిక్షాగాని పిలిచి అందులో ఎక్కిపోవాలన్న ఆలోచనే రాలేదు ఆమెకు. ఆమె మనసు మనసులో లేదు. ఆమెను భయం ఆవరించింది. మూర్తిని హత్య చేసిన వ్యక్తే రాగిణినిగూడ చంపాడు. రేపు అతడు తన పొరబాటుని గ్రహిస్తాడు. అతడు హత్య చేస్తుండగా చూసింది రాగిణి కాదు జలజ అని. ఆ తర్వాత తనుగూడ ఏ పైఅంతస్తులోని కిటికీలోంచి జారిపడడమో లేక, స్పీడుగా వచ్చే ట్రక్కు క్రిందనో పడి రాగిణిని చేరుకుంటుంది.

"చూడండి! మీ మనసు ఏం బాగోలేదు. ఇలాంటి పరిస్థితిలో మీరు ఒంటరిగా వెళ్ళటం మంచిదికాదు. నేనుగూడ మీ ఇంటిదాకా వస్తాను" అన్నాడు కాంతారావు.

జలజ ఇంకా భయపడింది. ఇతడు తనను నీడలా వెంటాడుతున్నాడు. కొంపదీసి ఇతడే తననూ రైలెక్కించే వ్యక్తి కాదుగదా!

"వీరు బాగా అలిసిపోయినట్టున్నారు. హోటల్లో కెళ్ళి కాస్త డ్రింక్ పుచ్చుకుందురుగాని! రండి!"

అచేతనంగా ఆమె కాంతారావు వెనకే వెళ్ళింది. అతడ్ని తను అనుమానిస్తూనే ఉన్నది. కాని అతగాడ్ని కాదనలేకపోతున్నది. ఇతడి మాటల్లో, చూపుల్లో ఏదో సమ్మోహనశక్తి ఉన్నది అనుకుంది మళ్ళీ జలజ.

సరస్వతి తనను ఇంటర్వ్యూలో అడిగిన ప్రశ్నలు గురించి ఏవో కథలు చెప్పాడు కాంతారావు. జలజ కొంత సిమితపడింది.

"చూడండి! వీరు మనసులో లేనిపోని అనుమానాలు పెట్టుకుని బాధపడకండి!" అని ఓదార్చాడు.

"ఇంకా అనుమానం ఏముందండీ! రాగిణి హత్య చేయబడిందని ఖచ్చితంగా చెప్పగలను. ఆ తర్వాత నామీద గూడ హత్యాప్రయత్నం చేయబడవచ్చు."

"నా అభిప్రాయం రాగిణి ఏక్సిడెంట్‌కి గురి అయిందనే. ఆమె మేనమామగూడ ఆమె వెంటనే ఉన్నాడు గదా. ఆమెపై ఎవరన్నా హత్యాప్రయత్నం చేసివుంటే అతడూ గమనించి ఉండేవాడేగదా? అదిగాక మూర్తిని ఎవరో హత్యచేశారే అనుకుందాం. హంతకుడు తన ఆచూకీ దొరక్కుండా తప్పించుకున్నాడు. ఇక అతడికి రాగిణిని చంపాల్సిన పనేముంది?"

"అంతేనంటారా?"

"అంతేకాదు. వీరు కేవలం ఎవరిదో నీడమాత్రమే చూడగలిగారు. అతడిముఖం చూడలేదుగదా?"

"లేదు! నీడమాత్రమే ఛాయా మాత్రంగా కనుపించింది!"

"అతడు పొడుగో, పొట్టివాడో గూడ చెప్పలేరు?"

లేదన్నట్టు తల ఊపింది జలజ. ఇదేమిటి? ఇతగాడు

ఎక్కడ మొదలెట్టినా మూర్తి మరణం దగ్గరకు లాక్కొడు తున్నాడు. ఆ వివరాలే అడుగుతున్నాను! కాంతారావు మీద చెప్పలేనంత కోపం వచ్చింది ఆమెకు. మళ్ళీ అతన్ని గురించిన అనుమానాలు ఆమెలో బలపడసాగినై.

తను ఇంటికి వెళ్ళి చేతులు ముడుచుకుని కూర్చుంటే లాభంలేదు. తన ప్రాణాల మీదకూ ప్రమాదం వస్తుంది. వెంటనే తను ఏదో ఒకటి చెయ్యాలి. కాలం గడిచిపోతే సాక్ష్యాలూ, ఆధారాలు మాయమవుతై. అయితే తను ఏం చెయ్యాలి? ఎక్కడ మొదలెట్టాలి.

ఇంతవరకూ తన దృష్టిలో ఇద్దరు వ్యక్తులు కనబడు తున్నారు, అనుమానితులుగా. ఒకడు మాసిపోయిన హ్యాట్ వ్యక్తి! అతడి పేరు సూర్యం అని విన్నట్టుగా గుర్తు. రెండో వ్యక్తి కాంతారావు.

తను మూర్తి మరణం గురించి ఏమైనా ఆరాలు తీసి ఏవైనా ఆధారాలు పట్టుకుంటానేమో అని ఈ కాంతా రావు తన వెంట నీడలాపడి తిరుగుతున్నాడా?

"ఇంటిదాకా దిగ బెడతాను! పదండి!" అన్నాడు కాంతారావు.

మరో అరగంట గడిచేసరికి ఇద్దరూ రాగిణి ఇల్లు చేరు కున్నారు. లిఫ్టులో ఎక్కి మూడో అంతస్తు చేరుకున్నారు.

జలజ తలుపు తెరిచి లోపలకు అడుగుపెట్టి ఆగిపో యింది. కాంతారావుకేసి చూసింది.

"గుడ్ నైట్!" అన్నాడు కాంతారావు.

ఆమె గుడ్ నైట్ అనబోయింది. ఆమె పెదిమలు విడీవడేలోగా అతను ఆమె పెదవులపై గాఢంగా ముద్దు పెట్టుకున్నాడు.

జలజ తేరుకునేసరికి అతడు లిఫ్టులో ఎక్కి క్రిందకు వెళ్ళిపోయాడు.

తలుపు లోపల గడియవేసుకుని అలాగే తలుపుకానుకుని నిలబడింది జలజ. ఆమె పెదవులమీద తీయదనం ఇంకా మాసిపోలేదు. ఆమెకు కోపం, ఆశ్చర్యం కలిగినయ్. కాంతారావ్ చిలిపితనానికి ఆమె మెచ్చుకోలేకుండా ఉండలేకపోయింది. మగవాడిలో ఆమాత్రం తెగింపు లేకపోతే "థ్రిల్" ఏముంది? అనుకుంది.

అప్పటిదాకా చీకట్లోనే వున్న జలజ స్విచ్ వేసింది. లైటు వెలిగింది. నేలమీద కవరు కనబడింది. దానిమీద తన పేరే వుంది. పంపినవారి చిరునామా లేదు.

ఆత్రంగా కవరు విప్పి చదివింది. అది స్నేహలత అనే ఆమె వ్రాసింది. ఆమె చాలాకాలం తను ఉండే ఇంటికి ప్రక్క-యింట్లో అద్దెకు ఉండేవాళ్ళు. ఈ మధ్యనే ఆమె భర్త ఇండస్ట్రియల్ ఎస్టేట్ లో కలాలు తయారుచేసే ఫ్యాక్టరీని పెట్టాడు. ఆ దగ్గరలోనే ఇల్లుగూడ కట్టుకుని అందులోకి మారిపోయారు. ఈ ఊరు వచ్చినప్పుడల్లా తనను చూడకుండా వెళ్ళరు ఆమె, ఆమె భర్త.

ప్రస్తుతం తను మకాం మార్చటం వలన వాళ్ళు ఈ ఊరు వచ్చినప్పుడు తనను కలుసుకోలేకపోయామని స్నేహలత రాసింది. సెలవు దొరికితే తమ ఇంటికివచ్చి రెండు రోజులుండి వెళ్ళమని కోరింది.

అంతలోనే ఆమెకు మూర్తి గుర్తుకు వచ్చాడు. రెండు సంవత్సరాల క్రితం స్నేహలత కొడుకు బర్త్ డే పార్టీలో అతన్ని చూసింది తను. అంటే స్నేహలత భర్త సాధక మూర్తిని గురించి బాగా తెలిసి వుండచ్చు. రేపే తను వాళ్ళ ఊరికి వెళ్ళాలి అనుకుంది. ఈ దెబ్బతో తను హంతకుడ్ని ఆచూకీని ఇట్టే పట్టేయగలదు అనుకొంది.

# 5

ప్రక్కవాటాలోని కుర్రవాడిచేత ఆఫీసుకు రెండు రోజులు సెలవు చీటీ పంపించి జలజ.

తన చీరెలూ, మరోజత అండర్ వేర్ లూ బ్రీఫ్ కేసులో సర్దుకుని సిటీబస్ ఎక్కి బస్ స్టాండ్ చేరుకుంది. రోడ్డు రవాణాసంస్థవారి బస్సులో అరగంట ప్రయాణంచేసి స్నేహలత వాళ్ళ గ్రామం చేరుకుంది.

అసలు ఆ గ్రామంకూడ సిటీ లిమిట్స్ లోదే. అయితే ఊరికి దూరంగా అంతకంతకూ పెరిగిపోతున్న ఇండస్ట్రియల్ ఎస్టేట్ కి పెద్ద జాగా ఉండాలని దూరంగా కట్టారు. అక్కడికి పోవాలంటే దాదాపు పాతుగూరు పోయినట్టే ఉంటుంది.

ఆ కుగ్రామం పేరు కార్మికనగర్. ఇండస్ట్రియల్ ఎస్టేట్ లో పనిచేసేవారి కాలనీ అది.

రిక్షాలోంచి దిగుతూండగానే లోపల్నుంచి స్నేహలత బయటకు వచ్చింది తనను గుర్తించి.

"ఏమిటిలా హఠాత్తుగా ఊడిపడ్డావ్! వస్తున్నట్టు ఉత్తరమన్నా రాయకపోయావా? కారు పంపేవాళ్ళం గదా?" స్నేహలత ఆప్యాయంగా అంది.

"మరేం కంగారు లేదులే! మనం కలుసుకొని చాలా రోజులయింది. నీ ఉత్తరం చదవంగానే ఎందుకో నిన్ను చూడాలనిపించింది. అంతే! ఉన్నపళంగా వచ్చేశాను."

"మంచిపని చేశావ్!" అంటూ ఆమె చెయ్యి పుచ్చుకుని జలజను లోపలకు తీసుకుపోయింది స్నేహలత.

ఆ ఇల్లు అధునాతనంగా కట్టబడింది. ఇంటిచుట్టూ బోలెడంత పెరడువుంది. రకరకాల వృక్షాలుఉన్నాయ్. చెట్లమీద పక్షులు అరుస్తుంటే ఆ పల్లె వాతావరణానికి జలజ మురిసిపోయింది. పట్టణాల్లో వుండే రద్దీ, రణగొణ

ధ్వనులూ లేని పల్లె వాతావరణం అంటే జలజకు చాలా ఇష్టం. అందుకే ఆమె అప్పుడప్పుడు ఇక్కడకు వచ్చి నాలుగైదు రోజులు ఉండిపోతూ ఉంటుంది.

స్నేహలత స్టౌ వెలిగించి కాఫీ పెట్టింది. వంటశాలలో డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని కాఫీ సిప్ చేస్తూన్నారు.

జలజ నిదానంగా అడిగింది. "సిటీలో మూర్తి ఫొటో స్టుడియో యజమాని మూర్తి తెలుసా మీకు?"

"తెలియకేం? అతడీ మధ్య ప్రమాదవశాత్తు చనిపోయాడట! మాకు ఆ వార్త చాలా విచారం కలిగించింది. అతడు యీ ఊరు వచ్చినప్పుడల్లా మన ఇంటికి రాకుండా వెళ్లే వాడుకాదు! మంచి ఫొటోగ్రాఫర్! అతడి మొదటి భార్యకూడా ఈ ఊళ్లోనే ఉంటోంది!" అన్నది స్నేహలత.

స్నేహలత ఇంటి ఆవరణలోనే మరో ఇల్లువుంది. అందులో ప్రస్తుతం ఎవరూ వుండటంలేదనీ, దాన్ని తన భర్త సారథ లేబరటరీ క్రింద లైబ్రరీ మరియు రీడింగ్ రూమ్ క్రింద వాడుతున్నాడని చెప్పింది.

జలజ తన దుస్తులు మార్చుకుంది. స్నేహలత వంట పనిలో నిమగ్నురాలైంది. పిల్లలు బడికి వెళ్లారు. సారథి ఫ్యాక్టరీకి నిన్న అనంగా వెళ్ళి ఇంకా రాలేదట. అది అతనికి అలవాటే అంది స్నేహలత.

ఎదురుగా కొండరాళ్ళతో కట్టబడివున్న పాత ఇంట్లోకి వెళ్ళింది జలజ.

ఒక గదినిండా లైబ్రరీ పుస్తకాలు, న్యూస్ పేపర్లూ ఉన్నయ్. పుస్తకాల షెల్ఫ్‌లోకి చూస్తున్న జలజ ఆ ప్రక్కనే ఉన్న కిటికీలోంచి బయటకు చూసింది. ఆమె కెదురుగా మల్లెతీగలు, ఇంకా ఏవేవో చెట్లు పొదలుగా ఉన్నయ్. అయితే ఇంతకుముందే ఆ పొదల్ని చీల్చి

కుంటూ అందులో ఎవరో దూరినట్టుగా చిందర వందర అయిన లతలే చెబుతున్నాయ్.

చేతిలోని పుస్తకం అక్కడే పడేసి ఆ పొదవైపుగా వెళ్ళింది.

ఆమె అనుమానం నిజమయింది. ఆ పొదలకు అవలి వైపున ఎవరో వ్యక్తి నిలబడి వున్నాడు. అతడు దొంగే కావచ్చు! లేకపోతే అలా చాటుమాటుగా నక్కి ఉండ వలసిన అవసరం ఏముంది?

"ఎవరక్కడ?" అంటూ నెమ్మదిగా అడిగింది.

ఆ వ్యక్తి పొదలచుట్టూ తిరిగి దోవ చూసుకుంటూ వచ్చాడు. అతన్ని చూసి జలజ ఆశ్చర్యపోయింది. అతడు కాంతారావు.

"మీరు ఇక్కడికెలా వచ్చారు?" జలజ ఆశ్చర్యంగా అడిగింది.

"నేనే మిమ్మల్ని ఆ ప్రశ్న అడుగుదామనుకున్నాను" కాంతారావు మళ్ళీ ప్రశ్నించాడు.

"సారథి భార్య స్నేహలత నా స్నేహితురాలు. ఆమెను చూదామనిపించి వచ్చాను!"

"నేను ఇక్కడకు రావటానికి కారణం సరస్వతి! ఆత్మకథ ఎక్కడనుంచి మొదలెట్టాలి అని అడిగాను. ఈ ఊరికీ, మూర్తి జీవిత ధ్యేయం అయిన ఫొటోగ్రఫీకిచాలా బాంధవ్యం ఉన్నదని చెప్పింది. అందుకే వివరాలకోసం ఇక్కడకు రావాల్సి వచ్చింది."

అనుమానపు మేఘాలు కమ్ముకున్నాయ్ ఆమెలో. ఇతడు తనను నీడలా వెంబడించటం లేదుగదా? తన బ్రతుకు ఇతడి చేతుల్లోనే తెల్లారిపోతుందా ఏం?

"నిజంగా ఈ పల్లె వాతావరణం అంటే నాకు భలే ఇష్టం!" అన్నాడు కాంతారావు.

"అవునవును! నాకూ అంతే!" అంది జలజ తన మనసులోని భావాల్ని కప్పిపుచ్చుకుంటూ.

"అయినా మీరు అంటే అందమైన స్నేహలత బంగళా వదిలి ఈ భూత్ బంగళాలోకి వచ్చారేమిటి?"

"అదా? ఇక్కడ లైబ్రరీ ఉందంటే వచ్చాను. ఆ పుస్తకాలన్నిటినీ తీరికగా చదివేసెయ్యొచ్చుగదా అని నా ఆశ."

అంతలో సారథి లోపలకు వచ్చాడు. "జలజా! ఎప్పుడు వచ్చావ్! మేం ఆమధ్య మీ ఊరు వచ్చాం. నీవు ఇల్లు మార్చావట. అందుకని ఉత్తరం రాసి మీ ఇంటి ప్రక్క ఇంట్లో కుర్రవాడికి ఇచ్చి వచ్చా. అందిందా అది."

"అందిందండి! ఆ ఉత్తరాన్ని చూడంగానే స్నేహలతను చూడాలనిపించింది. వచ్చేశాను. అన్నట్టు మరిచాను. ఇతను నా ఫ్రెండ్! పేరు కాంతారావు. స్వర్గీయ మూర్తిగారి ఆత్మకథను రచించబోతున్నాడు" అంటూ ఇద్దర్నీ పరిచయం చేసింది.

"మూర్తికి ఆత్మకథా? వాడేం నాయకుడా? లేక చెప్పుకోదగ్గ గొప్ప వ్యక్తా? అయినా ఆ సరస్వతికి డబ్బు ఎక్కువగా వున్నట్టుంది. లేకపోతే అంత ఖర్చుతో ప్రింట్ చేయిస్తుందా?" సారథి విసుగ్గా అన్నాడు.

"ఆ విషయాలన్నీ సరస్వతి ప్రేరణవల్లనే నేను సేకరించాలని వచ్చాను. మూర్తి ఈ ఊళ్ళో కొన్నాళ్ళున్నాడటగూడా?" కాంతారావు అడిగాడు.

"నాకూ బాగా తెలీను! ఇవాళ రాత్రికి మా ఇంట్లో పార్టీ ఏర్పాటు చేస్తున్నాం. మా రెండో అబ్బాయి బర్త్‌డే! ఊళ్ళో పెద్దలు చాలామంది వస్తారు. వారిలో చాలామందికి మూర్తిని గురించి తెలుసు. అతని మొదటి భార్యగూడ ఈ ఊళ్ళోనే ఉంటున్నది. ఆమెగూడ పార్టీకి

వస్తుంది. రాత్రికి మీరుగూడా తప్పకుండా రండి!"

"థ్యాంక్యూ సర్!"

"జలజా! పదమ్మా! మనింట్లోకి వెళదాం!" అంటూ సారథి ముందుకు నడిచాడు. జలజ అతణ్ణి అనుసరించింది. కాంతారావు వెళ్ళిపోయాడు.

# 6

ఆ రాత్రి విందుకు అనేకమంది అతిథులు వచ్చారు. విందు చాలా వేడుకగా జరిగింది. కొందరు పాటలు పాడారు. మరికొందరు జంటలు డాన్స్ చేశారు.

కాంతారావుకూడా వచ్చాడు. జలజను ఒకమూలకు తీసుకువెళ్ళాడు.

"ఇక్కడకు వచ్చిన వ్యక్తుల్ని ఎవర్ని మూర్తి గురించి అడగకు. ఎందుకంటే నీ ప్రశ్నలకు వాళ్ళు అనుమానపడొచ్చు. అదే నేను అడుగుతాను. ఆత్మకథకోసం అడిగా ననుకుంటారు. ఎవరూ అనుమానించరు!"

"అలాగా?"

"అవును! ఈ రాత్రికి నీవు ఇక్కడే పడుకో! ఆ రాత్రి కొంపలోకి వెళ్ళకు. అందులో దయ్యాలుంటాయని ఇక్కడి వాళ్ళ నమ్మకం."

జలజ నవ్వింది. "నాకు దయ్యాలంటే నమ్మకంలేదు."

మాట్లాడుతూనే జలజ ఇంకా లోపలకు వస్తున్న ఒక వ్యక్తిని చూసి కెవ్వున అరవాలన్నంతగా భయపడి పోయింది.

అతడు సూర్యం. మూసిపోయిన హోటల్లో చని పోయిన మూర్తి ఆత్మకథ రాసే నెపంతో, స్టుడియోలోని డ్రాయరులో వెదుకుతూ తనకు దొరికిపోయిన వ్యక్తి.

తను వచ్చిన చోటకే కాంతారావూ, సూర్యం ఇద్దరూ

వచ్చారు. తనను వెతుక్కుంటూ వచ్చారా? లేక ఇక్కడ హంతకుల ముఠా ఏదన్నా ఉందా?

స్నేహలత మరో రెండు డ్రింక్స్ తెచ్చి జలజకూ, కాంతారావుకూ అందించింది.

* * *

జలజకు మెలకువ వచ్చేసరికి ఇంకా తెల్లారలేదు. అయినా ఎవరో అప్పుడే నేల ఊడుస్తున్న చప్పుడు స్పష్టంగా వినవస్తున్నది ఆమెకు.

రాత్రి విందులో అతిథుల పాటలూ, కేరింతలూ, నవ్వులూ అన్నీ ఆమె మనసులో మెదిలినయ్. స్నేహలత డ్రింక్ గ్లాసులు తెచ్చి ఇవ్వటం వరకే తనకు బాగా గుర్తు. ఆ తర్వాత ఏం జరిగిందీ తనకు గుర్తురావటంలేదు. తలకాయ బద్దలు కొట్టుకున్నా కళ్ళు తెరచిచి పక్కనుండీ గుర్తుకు తెచ్చుకోవటానికి యత్నించింది.

తను పాతబడిన ఆ రాతికట్టడంలో వుంది. మంచం, దానిమీద పరుపు, దానిమీద తను వుంది. విందుకాగానే తను కట్టుకున్న ఫారిన్ నైలెక్స్ చీర విప్పేయాలనుకుంది. కాని తను ఆ చీరతోనే బెడ్ మీద వుంది.

అంతలోనే ఆమెను మళ్ళీ తీయని మత్తు ఆవహించింది. మంచి నిద్రలోకి జారుకునే వ్యక్తిలా ఆమె కళ్ళుమూతలు పడిపోయినయ్.

మళ్ళీ మెలకువ వచ్చేసరికి బారెడు ఎండ పడుతోంది. నోరంతా అసహ్యంగా వుంది. తన జీవితంలో ఏనాడు లేనంతగా రాత్రి నిద్రపోయింది. అంటే! అంటే తనకు ఏదన్నా మత్తుమందు ఇవ్వలేదుకదా? లేకపోతే తను డ్రస్ కూడ మార్చుకోకుండా ఎలా పడుకోగలదు?

దగ్గరగా వేసివున్న తలుపుల్ని తోసుకుని స్నేహలత వచ్చింది. "జలజా! టిఫిన్, కాఫీ చల్లారిపోతున్నయ్.

ముఖం కడుక్కో!" అంది.

"ఇదిగో అయిదు నిముషాల్లో వచ్చేస్తున్నాను!" అంటూ జలజ ఎదురుగా టేబుల్ మీద వున్న తన బ్రీఫ్ కేస్ తెరిచింది. టూత్ బ్రష్, పేస్టూ తీసుకుని బాత్ రూమ్ కేసి నడిచింది.

ప్లేట్ లోని ఉప్మా చెంచాతో తీసి నోట్లో పెట్టుకుంటుండగా స్నేహలత అడిగింది. "పార్టీ అయిపోకుండానే నీవు నిద్రలోకి జారుకున్నావేంటి? పాపం! రాత్రి ఎక్కువసేపు నిద్ర నాప్పుకోలేకల్లే వుంది! అవునా?"

"అదే నాకూ అంతుపట్టడంలేదు. రాత్రి పదకొండు గంటల తర్వాత ఏం జరిగిందో నాకు గుర్తులేదు!"

"పార్టీ సగంలో వుండగా నేను నీకోసం చూశాను. అప్పటిదాకా నీవు అందరితోనూ కులాసాగా కబుర్లు చెబుతున్నావట. నేను చూసేసరికి ఒక మూల కుర్చీలో వాలిపోయి నిద్రపోతున్నావ్! నేనే తీసుకెళ్ళి బెడ్ రూమ్ లో పరుపుమీద పడుకోబెట్టాను. మరో గంటపోయాక వచ్చి చూస్తే అక్కడా లేవు. నిద్రలోనే నీవు లైబ్రరీ రూమ్ లోకి వెళ్ళి వుంటావ్! రాత్రి చాలా వేడుకగా వుందిలే! ముసలీ ముతకా అందరూ జంటలు జంటలుగా బాల్ రూమ్ డ్యాన్స్ చేశారు. మన ప్రక్కింటి లత లేదూ, అదేమో రికార్డు డ్యాన్స్ చేసింది."

సారథి లోపలకు వచ్చాడు. అతడి కళ్ళు ఎర్రగా నిద్రలేని వాడికళ్ళలా వున్నాయ్. ముఖం అదోరకంగా పెట్టుకున్నాడు. "నేను ఫ్యాక్టరీ దాకా వెడుతున్నాను" అన్నాడు.

"ఇవాళ గూడ ఇంత పెందలాడే వెళ్ళాలా? జలజ వచ్చింది! కులాసాగా ఇంట్లో గడపగూడదూ?"

"వీల్లేదు. అర్జెంటుపనివుంది. నే వెళ్తున్నాను!" అంటూ

సారధి సమాధానంకోసం ఎదురుచూడకుండా వెళ్ళి పోయాడు.

"ఏమిటో జలజా! ఈమధ్య ఈయన పూర్తిగా మారి పోయారు. ఒక్క క్షణం ఇంటిపట్టున వుండరు. ఫ్యాక్టరీలో ఎవరో కూలీదాని వలలో పడ్డారని విన్నాను. అదేమని అడిగితే పోట్లాటకొస్తారు. డబ్బుకు కొదువలేదుగదా అనుకుంటే ఈ బెడద ఒకటి!"

జలజ స్నేహలత చెబుతున్న దాంట్లో ఆసక్తి చూపించ లేదు. ఆమె ఇంకా రాత్రిని గురించే ఆలోచిస్తున్నది. తనూ, కాంతారావ్ ఇద్దరూ ఒకేసారి డ్రింక్స్ తీసు కున్నారు. మరి అతడూ మత్తుగా పడిపోయాడా?

కాంతారావుని గురించి అడిగింది.

"అతడూ, మూర్తి మొదటిభార్యగూడ వచ్చిందిగదా ఇద్దరూ చాలాసేపు డ్యాన్స్ చేశారు, మాట్లాడుకుంటూ. ఆ తర్వాత ఆమెతో వాళ్ళింటికి వెళ్ళిపోయాడు."

జలజ ముఖంలో రంగులు మారినయ్. అయినా తమా యించుకుంది.

"కాంతారావు ఎవరింట్లో ఉంటున్నాడు?" జలజ అడి గింది.

"మూర్తికి స్వంత యిల్లువుంది ఈ ఊళ్లో. ప్రస్తుతం దాంట్లో వుండడంలేదు. సరస్వతి సిటీలోకి మకాంమార్చిన తర్వాత. ఇతడు అక్కడే మకాం చేస్తున్నాడు."

కాసేపు ఆ విషయాలు ఈ విషయాలూ మాట్లాడుకున్న తర్వాత జలజ ఊళ్లోకి వెళ్లొస్తానని చెప్పి బయలుదేరింది.

పావుగంట నడిచి ఊరి చివరంటా వెళ్ళింది జలజ. అక్కడ ఎత్తైన గుట్టవుంది. దానిమీద నిల్చుంటేఊరంతా మ్యాప్‌లోలాగ కనపిస్తున్నది. ఒకవైపు చివరగా పెంకు టిల్లు మిగతా ఇళ్ళకు దూరంగా కనపిస్తున్నది. అదే

సరస్వతి ఇల్లు. ఎవరో సేద్యం చేసుకునే మనిషి ఆ ఇంటి కెదురుగా పాక వేసుకుని తన కాపురంతో వుంటున్నాడు. అతడే ఈ ఇల్లుని కనిపెట్టుకుని వుంటాడట!

జలజ ఆ పెంకుటిల్లు నెమ్మదిగా నడిచింది. ఆ ఇల్లు బాగా పాతబడిపోయింది. కప్పుమీద పెంకులు ఒకటి అరా లేచిపోయినయ్.

ఇంటిముందుకు వెళ్ళి "కాంతారావుగారూ!" అని పిలిచింది. సమాధానం రాలేదు.

వారగా వేసివున్న తలుపు తెరుచుకుని లోపలకు వెళ్ళింది. ముందు హాల్లో ఎవరూ కనుపించలేదు.

మళ్లీ పిలుద్దామనుకునేంతలో లోపల్నుంచి మాటలు వినబడినయ్. జలజ అలానే ఆగిపోయింది. ప్రక్కనున్న కిటికీలోంచి చాటుగా నిల్చుని లోపలకు చూసింది.

కాంతారావు కుర్చీలో కూర్చునివున్నాడు. అతని కెదురుగా మంచంమీద మరో స్త్రీ విలాసంగా పడుకుని వుంది.

ఆమెకు పాతికేళ్ళ వయసు వుంటుంది. బాగా అందంగా వుంది. కోలముఖం, వంకీల జుట్టు, మెడలో నగలూ. మనిషి ఆకర్షణీయంగా కనుపిస్తోంది.

"నన్ను కలుసుకోవటంకోసం ఇంతదూరం రాకుండా వుండాల్సింది. మామయ్యకీ విషయం తెలిస్తే ఇంకేమన్నా వుందా? అందుకని నన్ను కలుసుకున్నట్టే ఆయనకు తెలియనివ్వకు!"

ఆమె నవ్వుతూ తెలూపింది.

"ఆ విషయం నాకూ తెలుసు! కానీ నిన్ను చూడకుండా వుండలేకపోయాను. ఆయన్ను చూస్తుంటే నాకు ఏమీ తోచటంలేదు. ప్రక్కన నీవన్నా వుంటే నాకు కొంచెం ధైర్యంగా వుండేదనుకుంటే నీవ్వూ ఊళ్ళవెంట

తిరుగుతుంటివి! నిజంగా వ్యవహారంమీదే తిరుగుతున్నావా? లేక ఆ అమ్మాయి ఎవరో నీ అభిమానం చూరగొన్నదని చెప్పావే, ఆమె వలలోపడి నన్ను మరిచిపోయావేమో అనుకున్నాను!''

''నీ స్త్రీ బుద్ధి పోనిచ్చుకున్నావు కావు! నీ కా భయం అక్కర్లేదులే!'' కాంతారావు లేచి ఆమె నడుంచుట్టూ చెయ్యిపోనిచ్చి ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

ఆ పైన దృశ్యం ఇలజ చూడలేకపోయింది. అడుగుల చప్పుడు కాకుండా ఆ ఇంట్లోంచి బయటపడింది.

కాంతారావుని చూసి అతడు చాల మంచివాడని భ్రమించింది. అతడు మరో స్త్రీతో, అదీ వివాహిత అయినదీ, బంధుత్వంగలదాన్ని తన వలలో వేసుకున్నాడు. ఇంత నయవంచకుడని తను ఊహించలేకపోయింది.

# 7

సాయంత్రం నాలుగు గంటలయింది.

స్నేహలత ఇంటివెనకగా ఒక ఫర్లాంగు దూరంలో పంటకాలువ పారుతోంది. గొడ్లకాపరులు కొందరు అందులో చేపలు పడుతుంటారు.

ఒక కుర్రాడి గాలానికి ఏదో బరువుగా తగిలింది. అతడు పైకిలాగాడు. కాని గాలానికి తగిలిన వస్తువు నీళ్ళ మీదకు కనపడి ఆగిపోయింది. అది మనిషి చెయ్యి. ఎక్కువ లోతులేని ఆ పంటకాలువలో ఎవరిదో శవాన్ని పడేశారన్నమాట.

ఆ కుర్రవాడు ఏదో దయ్యాన్ని చూసి భయపడ్డట్టుగా పెద్దగా అరిచాడు. ఇంకా కుర్రాళ్ళు పోగయ్యారు.

ధైర్యంగలవాళ్ళు కొందరు కాలవలోకి దిగి మొలబంటి నీళ్ళలోని శవాన్ని గట్టుమీదకు లాగారు.

ఊళ్లో కరణానికీ, మునసబుకూ ఈ వార్త వెళ్ళింది. ఊళ్లోని జనం చాలమంది అక్కడకు మూగారు.

ఆ చనిపోయిన వ్యక్తి ముఖం వికృతమైపోయి గుర్తుపట్టటానికి వీల్లేకుండా వుంది. అతడికి పాతిక, ముప్పయ్యేళ్ళు వుండవచ్చు. అతడి జేబుల్లో కూడ అతని ఊరు పేరు తెలిపే ఆధారం ఏం కనుపించలేదు.

జలజ నిద్ర లేచేసరికి ఈ విషయమే ఊరంతా చెప్పుకుంటున్నారు.

జలజకు అంతా అయోమయంగా కనుపించసాగింది. ఒక సమస్యను తను విడదీయాలనే ప్రయత్నంలో వుండగా తన స్నేహితురాలు చనిపోయింది. ఇక్కడేదో సమాచారం దొరుకుతుందని వస్తే ఇక్కడ మరో శవం స్వాగతం పలుకుతోంది.

శవపరీక్షలో, అతడు చనిపోయి రెండురోజులకన్న ఎక్కువ అయివుంటుందని తేల్చారు.

పోలీసులకు అంతకన్నా ఆధారం ఏమీ దొరకలేదు. ఊళ్లో ఎవరూగూడ హతుడ్ని గుర్తుపట్టలేకపోయారు. అంటే అతడు తప్పకుండా పొరుగూరువాడై వుండాలి.

ఆ ఊరికి వచ్చే బస్సు కండక్టర్లందర్నీ వాకబు చేశారు, పోలీసులు, చనిపోయిన వ్యక్తి దుస్తుల్ని వర్ణించి చెప్పి.

ఒక కండక్టరు తనకు గుర్తున్న సమాచారం చెప్పాడు. ఆ వ్యక్తి తన బస్సులోనే వచ్చాడన్నాడు. దిగవలసిన స్టాప్‌లో దిగక పై స్టాప్ దాకా రావటంవలన అతడికీ, కండక్టరుకూ చిన్న వాగ్వివాదం జరిగింది. అందువల్లనే అతడు కండక్టరుకూ బాగా గుర్తున్నాడు.

అతడి చేతిలో బ్రీఫ్ కేస్, హ్యాట్ చూశానని చెప్పాడు.

పోలీసులు మళ్లీ కాలువ దగ్గరకు పరుగెత్తారు. మనుషుల్ని నీళ్ళలోకి దింపి బ్రీఫ్ కేస్ కోసం వెదికించారు. కానీ దొరకలేదు. నీళ్ళలో తడిసి నానిపోయిన ఈవెనింగ్ హ్యాట్ మాత్రం దొరికింది.

పోలీసులు జలజ దగ్గరకు వచ్చారు.

"చూడండీ! ఈ హ్యాట్ మాత్రం దొరికింది కాలువలో. ఇది ఈ ఇంట్లో వ్యక్తులెవరిదన్నానా?" అని అడిగాడు ఇన్స్పెక్టర్.

ఆ హ్యాట్ ని చూస్తూనే కంగారుపడింది జలజ.

దాన్ని మొదటిసారిగా తను మూర్తి స్టుడియోలో చూసింది. ఇంటర్వ్యూకు వచ్చిన వ్యక్తుల్లో ఒకడైన సూర్యారావుది అది.

# 8

"చూడమ్మాయ్! ఆ నానిపోయిన వ్యక్తి ఎవరో ఈ ఊళ్లోని వ్యక్తులెవరూ గుర్తుపట్టలేకపోయారు. అయితే నీవా హ్యాట్ ని ఎక్కడో చూశానని చెబుతున్నావ్! నీవు చెప్పేది కరెక్టేనా? ఆలోచించుకుని చెప్పు!"

జలజ ఒక నిముషం ఆలోచించింది. "ఆ హ్యాట్ ని ఒకసారి కాదండీ! అనేకసార్లు చూశాను. మొదటిసారి మూర్తి స్టుడియోలో సరస్వతి వద్దకు ఇంటర్వ్యూకు వచ్చాడు ఆ వ్యక్తి. తన పేరు సూర్యం అని చెప్పాడు. తన మురికి హ్యాట్ ని అందమైన పులిబొమ్మమీద తగిలించాడు. పులిబొమ్మ అందంగూడ చెడగొడుతున్నదే ఈ హ్యాట్ అనుకున్నాను.

"తర్వాత అతను దాన్ని నెత్తిమీద వుంచుకుని అదే స్టుడియోలోని డ్రాయరు తెరచి వేటికోసమో వెదుకుతూండగా చూశాను. మరోసారి అతను మందులషాపులో

కూర్చుని సిగరెట్ త్రాగుతున్నాడు. అతని తలమీద ఉన్న ఆ టోపీ మూలంగానే అతగాడిని త్వరగా గుర్తు పట్టగలిగాను."

తను మూర్తి స్టుడియోలో చూసిన నీడలూ, ఆతర్వాత మూర్తి కిటికీలోంచి క్రిందకు పడిపోవడం, దాన్ని హత్యగానే తాను భావించి అలాగే సాక్ష్యం ఇచ్చినదైనాన్నీ, ఆ తర్వాత రాగిణి ఎటువంటి పరిస్థితుల్లో చనిపోయిందీ అన్నీ వివరించి చెప్పింది.

ఇన్స్పెక్టర్ రాజేంద్ర అన్నిటినీ నోట్ బుక్ లో వ్రాసుకున్నాడు.

# 9

సర్కిల్ ఇన్స్పెక్టర్ నిరంజనరావు కుర్చీలో కూర్చుని మూర్తి మరణం గురించిన ఫైలుని తిరగేస్తున్నాడు.

జలజ ఇచ్చిన సాక్ష్యంలో ఏమాత్రమో నిజం వుండి వుంటుందని అతను అనుమానించాడు. రాగిణి ఎలా చనిపోయిందీ తెలుసుకున్న తర్వాత అతను నిట్టూర్పు విడిచాడు.

మూర్తిని తుదముట్టించిన హంతకుడి వెనుక పెద్ద వలయం వుండి వుంటుంది. అంతేకాదు. వాళ్ళు చాలా తెలివైనవారు. హత్యల్ని ఏక్సిడెంట్లా కనబడేట్టుగా మార్చివేయగల చతురులు. ఇప్పుడు హత్య వెంట హత్య జరిగినయ్. మూర్తి చావు, ఆ తర్వాత రాగిణి, ఆ తర్వాత సూర్యం. ఆపైన ఎవరికి మూడిందో!

ఆ ఛాన్సు కొంతవరకు జలజకే ఉంది.

ఆ కేసుని తనే స్వయంగా పరిశోధించాలనుకున్నాడు నిరంజనరావు.

అతను మొట్టమొదటగా కలుసుకున్న వ్యక్తి సరస్వతి.

ఆమెకు తమ డిపార్టుమెంటువారు సేకరించిన విషయాలన్నీ చెప్పాడు.

"చూడండీ! నేను చెప్పిన ఆధారాల్ని బట్టి మీ భర్త ప్రమాదవశాత్తూ చనిపోలేదనీ, ఎవరో హత్య చేసి వుంటారనీ భావించాల్సి వస్తోంది!" అన్నాడు.

సరస్వతి గుండెలు బాదుకుంటూ ఏడవసాగింది. "నే నేం చెయ్యానురో భగవంతుడా? అంతపనీ ఆ ముండ చేయిస్తుందని నాకు ఏనాడో తెలుసు!" అని శోకశోకాలు పెట్టింది.

"ఎవరామె! ఎవర్ని మీరు అనుమానించింది?"

"అదేనండీ! ఆయన మొదటిభార్య!"

"ఆమె లేచిపోయిందిగా? ఇంకా ఇద్దరికీ ఏం సంబంధం?"

"లేకేమండీ? నన్ను పెళ్ళాడి మూర్తి ధనవంతుడయ్యాడుగా? బెల్లంచుట్టూ చీమలు మూగినట్టుగా అతడిని వదలలేదు ఆమె. మూర్తికూడా ఆమెకోసం నాలుగైదుసార్లు ఆ ఊరు వెళ్ళాడు. నాకు ఆ విషయం తెలిసి గట్టిగా మందలించాను—నేనో, ఆమే ఇద్దరిలో ఎవరు కావాలో తేల్చుకోమని! అతడు నా పక్షమే అవుతాడని నాకు గట్టిగా తెలుసనుకోండి!"

పోలీస్ ఫోటోగ్రాఫర్ వచ్చాడు. మూర్తి స్టుడియోని ఎదురింటి మేడమీదనుంచి ఫోటోలు తీశాడు. తర్వాత స్టుడియో అంతా వేలిముద్రలకోసం వెదికారు.

మూర్తి చనిపోయిన తర్వాత స్టుడియోనంతా కడిగించి శుభ్రం చేయించింది సరస్వతి, నీట్ గా ఉంచాలని. అందు వల్లనే వేలిముద్రలు ఎక్కడా దొరకలేదు.

నిరంజనరావు స్టుడియోని పరీక్షించాడు. అందులో పడమరదిక్కుగా వాకిలీ వుంది. దాని తలుపులు తెరిస్తే ఎండ

లోపలకు పడుతోంది. ఎవరన్నా వ్యక్తి అటునుంచి లోపలకు వస్తే అతడు కనబడకపోయినా ఎండపై నీడ అడ్డం వస్తుంది. అంతేకాదు. ఆ తలుపు ఎల్లప్పుడూ మూసేసి వుంటుంది. ఆ రోజున మాత్రం హంతకుడు ఆ తలుపు తెరుచుకొనే వచ్చాడు. అందరూ వచ్చే వాకిట్లోంచి వస్తే తనను ఎవరైనా గుర్తుపడతారని అలా చేసివుండచ్చు.

తర్వాత నిరంజనరావు స్టుడియోలోని ఫోటోలన్నిటినీ పరీక్షించి చూశాడు. కాని వాటిల్లో ఎటువంటి ఆధారాలు దొరకలేదు. మూర్తి చనిపోయిన నాటిరాత్రి ఆ ఇంట్లోకి ఎవరో దొంగ జొరబడ్డాడు. వాడు నిజంగా దొంగతనానికి వచ్చివుండడు. ఏదో అమూల్యమైన ఫోటోకోసమో లేక హంతకుని పట్టించే క్లూని ఎత్తుకుపోయి వుంటాడు.

సరస్వతి వద్దకు ఇంటర్వ్యూకి వచ్చిన నలుగురినీ గురించి మరోసారి వాకబు చేశారు పోలీసులు.

మొదటివ్యక్తి సూర్యం. సూర్యం ఆ వీధి చివరలో ఒంటరిగా రూమ్‌లో అద్దెకుండే వాడట. నెల నెలా టంచనుగా అయిదో తారీకున అద్దె చెల్లించేవాడట. ఉదయం వెళ్ళిన వ్యక్తి రాత్రి పొద్దుపోయినదాకా వచ్చేవాడు కాదని చుట్టుపట్లవున్న వాళ్ళు చెప్పారు. అతడు ఎక్కడా ఉద్యోగం చేస్తున్నట్టు ఎవరికీ తెలీదు. మరి అతడు తన జీవితం ఎలా వెళ్ళమారుస్తున్నాడో భగవంతుడికే తెలియాలి.

అతడి గదితాళం పగులగొట్టి సోదా చేశారు. ఒక సూటు, చిరిగిపోయిన టెర్లిన్ చొక్కాలు రెండు, తుండ్లూ ధోవతలూ మాత్రమే వున్నాయ్. ఇంక ఏవిధమైన కాగితాలు కానరాలేదు.

ఆ తర్వాత వ్యక్తి కమల. జలజ ఆమెను చాలాసార్లు చూసింది లోగడ. స్నేహలత ఇంటికి ఆమె తరచూ

వస్తుండేది. ఆమెను గూర్చి విచారించగా తేలిన విషయం ఏమిటంటే ఆమె పత్రికల్లో వ్యాసాలూ, గేయాలు రాస్తూ వుంటుంది. ఆమె గిండి ఇండస్ట్రియల్ ఎస్టేట్ లో ఏదో ఫ్యాక్టరీలో ఫోర్ మెన్. అయితే ఆమెకు ఈ ప్రయోగం చేయాల్సిన అవశ్యకత వున్నట్టు తోచదు. అంటే మూర్తి జీవితానికి సంబంధించిన రహస్యాల్ని సంగ్రహించటానికి ఆ మిషతో వచ్చివుంటుంది.

మూడో వ్యక్తి కాంతారావు. కాంతారావు మద్రాసులో ఒక రూమ్ అద్దెకు తీసుకుని వుంటున్నాడు. దావార్స్ కాలేజీలో బిజినెస్ ఎగ్జిక్యూటివ్ ట్రెయినింగ్ పొందుతున్నాడు. చుట్టూ వుండేవారిని వాకబుచేయగా అతడు సత్ప్రవర్తనగలవాడనీ, అందరితో స్నేహంగా వుంటాడనీ తెలిసింది. ఇప్పుడిప్పుడే అతడు వ్రాసే కథలు పత్రికల్లో ప్రచురితమవుతున్నయ్.

కాంతారావుపై ఒక కన్ను వేసి వుంచమని ఒక సార్జెంట్ ని పంపాడు.

అతడో ఆసక్తికరమైన సమాచారాన్ని సేకరించాడు. ఎవరో ఒక స్త్రీ కాంతారావు కోసం వచ్చి వెళ్ళింది. సార్జెంట్ ఆమెని ఫాలో అయాడు. కార్మికనగర్ గ్రామానికి పంచాయతీబోర్డు ప్రెసిడెంటు రాజారావు భార్య ఆమె!

నిరంజనరావు అతని వ్యక్తిగత జీవితంలోకి తరచి చూశాడు. అతడు నాలుగైదు దఫాలనుంచి ఏకగ్రీవంగా ప్రెసిడెంటుగా ఎన్నిక అవుతున్నాడు. మంచి ఆస్తిపరుడు. అతడిపై ఎటువంటి 'దోషం' కనుపించలేదు. అతడి మొదటి భార్య చనిపోయింది. ఆమెకో కూతురు వుంది. ఆమెకు వివాహమైన తర్వాత తను మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు.

రాజారావు చనిపోయిన చెల్లెలికొడుకే కాంతారావు.

కాంతారావుకూడ తన మేనమామపోషణలో నేవున్నాడు.

రాజారావుకీ చనిపోయిన మూర్తికీ ఏవైనా పరిచయం గాని వ్యాపార సంబంధాలు గాని ఉన్నాయేమో అని ఆరాతీశాడు నిరంజనరావు. కాని అలాంటివేం ఉన్నట్టు కనబడలేదు.

అయితే మరో ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే మూర్తి చనిపోయే ముందురోజున అతడు ఇండస్ట్రియల్ ఎస్టేట్ కి వెళ్ళి ఒకరోజు అక్కడ ఉన్నాడు.

# 10

నిరంజనరావు టేబుల్ మీది ఫోన్ మ్రోగింది. రసీవర్ ఎత్తి "హల్లో" అన్నాడు.

"హల్లో సార్! సర్కిల్ ఇన్స్పెక్టరుగారేనా మాట్లాడు తూంట! ఇప్పుడే నాకో కొత్త సమాచారం తెలిసింది సార్! మూర్తి పేరిట ఆంధ్రాబ్యాంకులో నలభయ్ ఆరు వేల రూపాయలు ఎక్కౌంటు ఉన్నదట!" ఫోనులో చెప్పింది సరస్వతి.

"అలాగా? అతడికి మీరిచ్చారా ఆ డబ్బు?"

"లేదండీ! స్టుడియో ఖర్చులకు అని నెలకు వెయ్యి రూపాయలు నా దగ్గర తీసుకువెడుతుండేవాడు! మరి అంతడబ్బు అతనికి ఎలావచ్చిందో నాకూ ఆశ్చర్యంగా వుందిసార్! ఇందాక నే బ్యాంక్ ఏజంట్ గారు ఫోన్ చేసి చెప్పారు! ఆ డబ్బుకు నేనేగదా వారసురాల్ని!"

"సరేలెండి! మీ సమాచారానికి థ్యాంక్స్!" అంటూ ఫోన్ పెట్టేశాడు.

మళ్ళీ ఏదో ఆలోచన వచ్చింది. రసీవరెత్తి ఆంధ్రా బ్యాంక్ కు ఫోన్ చేశాడు. ఏజంట్ గార్ని కాంటాక్ట్ చేసి మూర్తి ఎక్కౌంట్ లో ఆ డబ్బు ఎప్పుడెప్పుడు జమకట్టి

బడింది, డ్రాఫ్ట్ రూపంలో లేక చెక్కుల ద్వారా డిపాజిట్ చేశారో సమాచారం కావాలని అడిగాడు.

ఒక నిమిషం గడిచాక ఆ వివరాలూ వచ్చాయి. మూర్తి గత మూడు నెలల్లోనూ ఒక నెల పదిహేను వేలూ మరోదఫా ఇరవయ్ వేలూ, మూడో నెలలో పదకొండు వేలూ బ్యాంక్ లో జమకట్టాడు. అంతా క్యాష్ గానే ముట్టచెప్పబడింది.

ఇన్స్పెక్టర్ రాజేంద్ర, సర్కిల్ ఇన్స్పెక్టర్ నిరంజన రావు దీర్ఘమైన ఆలోచనలో పడ్డారు. ఫోటో స్టుడియో ఎంత బాగా బిజినెస్ చేసినా వందల్లోనే గాని వేలల్లో వ్యాపారం చెయ్యటం అసంభవం. అయితే అతనికి అంత డబ్బు ఎలా వచ్చింది. మూర్తికి లాటరీలు కట్టే అలవాటు గాని రేసుల్లో పాల్గొనే పిచ్చిగాని లేదు.

అయితే అతడు బ్లాక్ మెయిలరా?

"అంతే అయివుండాలి సార్! అదేకాదు. అతడు లక్షాధికారుల్ని బ్లాక్ మెయిల్ చేస్తుండాలి."

"కరెక్ట్! కార్తికనగర్ పోదాం! అక్కడ ధనవంతులు ఎందరున్నారో ఆరాతీస్తే ఈ మిస్టరీ కొంత విడిపోవచ్చు."

నిరంజనరావు లేచాడు.

# 11

నిరంజనరావు లోపల కూర్చుని కాఫీ త్రాగుతున్నాడు జలజతో మాట్లాడుతూ.

ఇన్స్పెక్టర్ రాజేంద్ర ఊళ్లోకి వెళ్లాడు తనకు కావలసిన సమాచారం సేకరించటానికి.

సారథి ఇంట్లో లేడు. ఫ్యాక్టరీలో ఉన్నాడని చెప్పారు. అతడీమధ్య పెన్నుల ఫ్యాక్టరీలో బిజీగా ఉంటున్నాడు.

మూర్తి మొదటి భార్యను పిలిచి కొన్ని ప్రశ్నలడి

గారు. ఆమె చెప్పిన దాన్నిబట్టి మూర్తి సరస్వతిని కేవలం డబ్బుకోసమే పెళ్లాడాడు. ఆ వివాహానికి ముందు మూర్తి పేర బ్యాంక్‌లో నయాపైసా లేదు సరికదా ఊరినిండా అప్పులున్నాయ్. ఈ వివాహంతో ఆ బాకీ లన్నిటినీ తీర్చివేశాడు. ఆ తర్వాత అతను ఎక్కడా బాకీలు చేయకుండా సరస్వతి జాగ్రత్తపడింది.

కనుక ఈ డబ్బు, అంటే నలభై ఆరువేలు మూడు నెలల్లో అతడికెలా వచ్చింది?

ఇన్స్పెక్టర్ రాజేంద్ర తిరిగి వచ్చాడు. మూర్తి ఈ ఊళ్లో ఆక్రితం రోజున అంటే రేపు చనిపోతాడనంగా, నలుగురు వ్యక్తుల్ని కలుసుకున్నాడు.

మొదటివ్యక్తి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు రాఘవరావు భార్యను కలుసుకున్నాడు. ఆ తర్వాత కాంతారావుని కలిసి ఏవో మాట్లాడాడు. మధ్యాహ్నం సాగర్ పెన్ వర్క్స్‌లోకి వెళ్లాడు. నాలుగోవ్యక్తి శూన్యం.

అతడి చేతుల్లో ఫొటో ప్రింట్స్ వుంచే కవరువుంది, వీళ్ళందరితోనూ మాట్లాడేటప్పుడు.

"ఇన్స్పెక్టర్ రాజేంద్ర! జలజనుంచి మీరేదో సమాచారం కావాలన్నారుగా? మీరు ఆమెని ప్రశ్నిస్తూ, ఉండండి! ఈ లోపల నేను బయటకు వెళ్ళివస్తాను' అంటూ జలజ చూడకుండా సైగచేసి బయటికి వెళ్ళిపోయాడు.

"చూడండి జలజగారూ! మా ప్రశ్నలకు సమాధానం చెప్పలేక మీకూ విసుగ్గానే ఉందనుకుంటాను! అయినా తప్పదు. హంతకుని ఆచూకీ దొరికేదాకా మీకూ మాకూ ఈ బాధ తప్పదు!" అన్నాడు ఇన్స్పెక్టర్ రాజేంద్ర, జలజను చూస్తూ.

"అంతేసార్! మీకేం సమాచారం కావాలి! అడగండి"

అంది జలజ, మళ్ళీ 'రెడ్డొచ్చె మొదలిడ!' అన్నట్టుగా కథ మళ్ళీ మొదటికి వచ్చింది అనుకుంది.

# 12

నిరంజనరావు, రాజారావు ఇంటికెళ్లాడు సైకిల్ వేసుకుని. ఇల్లంతా బావురుమంటూ వుంది. అతనికి వాకిట్లోనే విచారంగావున్న నౌకరు ఎదురయాడు.

"దండాలు బాబయా! ఎవరికోసమండీ?" వినయంగా నమస్కరిస్తూ అడిగాడు నౌకరు.

"మీ అయ్యగారున్నారా?"

"లేరండీ! . ఆయన పట్నం వెళ్లారు ఏదో పనిమీద!"

"పోనీ అమ్మగారున్నారా?"

"ఉన్నారండీ! ఇలా కూర్చోండి అయ్యా! వెళ్ళి పిల్చుకు వస్తాను!" అంటూ లోపల గదుల్లోకి వెళ్ళి పోయాడు.

నౌకరు వెళ్ళి సరళతో పోలీస్ ఆఫీసరు రాక గురించి చెప్పటం, ఆమె 'కాంతారావు ఇంట్లో లేకుండా ఎక్కడకు వెళ్లాడని' విసుక్కోవడం నిరంజనరావు చెవినబడక పోలేదు.

ఆమె ముఖాన చిరునవ్వు అలుముకుని నిరంజనరావు ముందుకు వచ్చింది.

"నమస్కారమండీ!" అన్నది.

"నమస్కారం! మీవారున్నారా?" అనడిగాడు ఆమె అందానికి అచ్చెరువు పొందుతూ.

"లేరండీ! వారు మద్రాసు కెళ్లారు ఏదో పనిమీద! ఎప్పుడు వచ్చేది తెలియదు!"

"అలాగా! సరే పోనివ్వండి. గత వారంరోజుల క్రితం మూర్తి ఇక్కడకు వచ్చినట్టు మీకేమైనా తెలుసునా?"

ఆమె ఆలోచనగా పైకి చూసింది. ఆ తర్వాత నింపాదిగా అన్నది. "మావారికోసం ఎందరో వస్తుంటారు! ఆ విషయాలు నేను పట్టించుకోను!"

ఆమె పెదాలు వణుకుతున్నయ్. కళ్ళలో నీరు జేరుతున్నది. మనిషి చిరాకుగా ఉన్నట్టు కనిపించింది. ఈమె కోసం కాంతారావు ఏమైనా చెయ్యటానికి సిద్ధపడతాడన్నా ఆశ్చర్యంలేదు అనుకున్నాడు.

"సరేనండి! వారు ఊరినుంచి రాగానే వెంటనే నాకు కబురుచెయ్యండి! నేను ప్రస్తుతం సారథి వాళ్ళింట్లో మకాం చేస్తున్నాను."

"అలాగే!" అని సరళ నమస్కరించింది.

ప్రతి నమస్కారంచేసి నిరంజనరావు అక్కడ్నుంచి బయటకు వచ్చాడు.

సారథిని కలుసుకోవాలని పేనాల ఫ్యాక్టరీకి వెళ్ళాడు అటునుంచి.

వాకిట్లోనే సారథి ఎదురుపడి ఆహ్వానించాడు. డ్రింక్ తెప్పించి ఆఫర్ చేశాడు.

"ఏం సార్! మా కలాల వర్క్‌షాప్ చూద్దామని వచ్చారా?" అని అతడికి వర్క్‌షాప్ అంతా చూపించాడు.

మద్రాసులోని ఒక ప్రముఖవ్యాపారసంస్థ కొత్తరకం కలాలకు ఆర్డరిచ్చింది. ఆ కలం ఫ్యాషన్ కోసం వాడేది. దాన్ని చేతికర్రలాగా పట్టుకుపోవచ్చు. రూళ్ళకర్ర అంత లావున ఉంది. పది అంగుళాల పొడవుంది. చూసేవాళ్ళకు అది రూళ్ళకర్రలాగానే కనబడుతుంది. కాని పై క్యాప్ తీస్తేగాని అది కలం అని కనుక్కోలేరు.

ఆ కలాన్నొకదాన్ని తీసి నిరంజనరావుకు చూపించాడు సారథి. ఒక కొత్తకలాన్ని ప్రెజెంట్ చేశాడు. సర్కిల్

ఇన్స్పెక్టర్ నిరాకరించాడు. కాని సారథి బలవంతంమీద చివరకు తీసుకోక తప్పలేదు.

"అన్నట్టు సారథిగారూ! మూర్తి మీ వర్క్‌షాప్‌కి వచ్చినట్టు మాకు తెలిసింది. ఎందుకు వచ్చాడో తెలుసుకో వచ్చా?"

"తప్పకుండాను! అతను సరస్వతిని వివాహం చేసుకున్న తర్వాత అతడికీ ఈ కలాల ఉత్పత్తిలో వాటా దారుడు కావాలనే కాంక్ష కలిగింది. అందుకే మా నివాసమయిన కార్మిక నగర్‌కి వచ్చినప్పుడల్లా నన్ను కలుసుకోకుండా వెళ్ళటంలేదు."

"ఛీ, ఛీ! అయితే మీరు అతణ్ని పార్ట్‌నర్‌గా చేసుకున్నారా?"

"లేదండీ! ఈ ఫ్యాక్టరీ నా స్వంతం. ఇందులో ఎవరికీ భాగం పెట్టదలచుకోలేదు! ఆ మాటే చెప్పాను అతడితో. కానీ ప్ర ప్రతిమాలాడు. చివరకు లాభంలేదని తెలిసి వెళ్ళి పోయాడు."

"థ్యాంక్యూ మిస్టర్ సారథీ!" అంటూ నిరంజనరావు బయటకు వచ్చేశాడు.

# 13

వర్క్‌షాప్‌లో కార్మికులకు ఏవో సూచనలు ఇచ్చి వచ్చి సారథి ఆఫీసురూమ్‌లో కూర్చుని ఏవో ఉత్పత్తి అంచనాలను సరిచూస్తున్నాడు.

అతడి గదికి ప్రక్కనే మరో గదిలో టైపిస్ట్ చంచల టకటక కాగితాలు టైప్ చేస్తున్నది.

ఎవరో వ్యక్తి దురుసుగా సారథి గది తలుపు తోసుకుని వెళ్ళటం చూసింది ఆమె. అతను హరి అని గుర్తు తెచ్చుకోవటానికి అట్టేసేపు పట్టలేదు ఆమెకు. టైప్ చెయ్యటం

ఆపి లోపల్నుంచి వినబడే మాటలు విందామని చెవులు రిక్కించుకుని ఉంది.

హరి ఏవేవో చెపుతున్నాడు. అతడి ప్రతి మాటలకు సారథి ఒక్క ముక్కలో సమాధానం చెబుతున్నాడు. అంతలోనే డ్రాయరు లాగిన చప్పుడు, ఆ వెంటనే పిస్తోలు పేలిన శబ్దం వినవచ్చాయి. కుంతల కంగారుపడి పోయింది. టేబుల్ కి అమర్చిన బజర్ నొక్కింది.

సారథి గది తలుపు నెట్టుకుని హరి బయటకు వచ్చి ఫ్యాక్టరీలోంచి గోడుమీదకు పరుగెత్తాడు. అతడి చేతిలో రివాల్వర్ ఉంది.

గోడుమీద తాళం వేయకుండా ఉన్న స్కూటర్ని స్టార్ట్ చేసి చూస్తూండగానే కనుచూపు మేరలో లేకుండా మాయమయిపోయాడు.

కుంతల, సారథి గది తలుపులు బాదసాగింది. పిస్టల్ షాట్ విని ఫ్యాక్టరీలోని పనివాళ్ళు పరుగెత్తుకు వచ్చారు.

లోపలకు వెళ్ళి చూశారు అంతా. కుర్చీలో సారథి లేడు. ఆదుర్దాగా ఇంకా లోపలకు జొరబడ్డారు. టేబుల్ ప్రక్కనే నేలమీద తివాసిపై పడివున్నాడు సారథి. అతడి కుడి భుజంలోకి బుల్లెట్ దిగబడి రక్తంధార చొక్కానంతా తడిపేసింది.

"నాకేం భయంలేదు! ముందు డాక్టరుకు కబురు పెట్టండి!" అని అరిచాడు సారథి.

డాక్టరుకోసం ఎవరో పరుగెత్తారు. మరొకరు గుడ్డ తడిపి రక్తం వచ్చేచోట అదిమి ఉంచారు.

"పోలీసులకుకూడా కబురు పెట్టండి! వాడు అసలే ఉద్రేకంలో ఉన్నాడు. చేతిలో పిస్తోలు ఉంది. ఇంకా అందులో నాలుగు బుల్లెట్లున్నయ్!" తనదగ్గరకు వచ్చిన వారితో

హీనస్వరంలో చెప్పాడు.

డాక్టరూ మరో కాంపౌండర్ వచ్చారు. సారథిని టేబుల్ మీద పడుకోబెట్టి అక్కడికక్కడే బుల్లెట్ ని తీసేసి భుజానికి బ్యాండేజీ కట్టారు.

ఇన్స్పెక్టర్ రాజేంద్ర, సర్కిల్ ఇన్స్పెక్టర్ నిరంజన రావు లోపలకు దూసుకువచ్చారు, అరగంట తర్వాత.

రక్తం పోవటం వలన సారథి నీరసంగా ఉన్నాడు. అయినా నిదానంగా మాట్లాడగలుగుతున్నాడు. తనను హరి పిస్తోలుతో కాల్చినట్లు చెప్పాడు. అతడి చేతిలో పిస్తోలు ఉంచుకునే పారిపోయాడు. ఇంకా ఎందర్ని కాల్చి చంపుతాడో అన్న ఆవేదన వ్యక్తం చేశాడు.

రాజేంద్ర పోస్టాఫీసునుంచి ఆ గ్రామం చుట్టుప్రక్కల స్టేషన్లన్నిటికీ ఫోన్ చేసి హరి విషయం తెలియజేశాడు.

"హరి ఏదో బ్లాక్ మెయిల్ వ్యవహారంలో ఉన్నాడేమో అని అనుమానంగా ఉంది. ఈ మధ్య అతడిదగ్గర డబ్బు ఎక్కువగా కనబడుతోంది. అతడి 'కాంటాక్ట్స్' ఎవరో మీకేమైనా అయిడియా ఉందా?" అడిగాడు నిరంజనరావు, సారథిని.

"నాకు అంతగా అయిడియా లేదండి. కాని నా అనుమానం ఇక్కడే ప్లాస్టిక్ కంపెనీలో ఫోర్ మెన్ గా పని చేస్తున్నతని భార్య, ఆమె పేరు కమల అనుకుంటాను! ఆమె ఇతడూ తరచూ సిటీకి వెళ్ళి వస్తుంటారు!"

"కమల! అంటే మూర్తి చనిపోయిన తర్వాత అతని ఆత్మకథని రచించే ఉద్దేశ్యంతో స్టుడియోలో ఇంటర్వ్యూకి వెళ్ళిన వ్యక్తే అనుకుంటాను!" నిరంజనరావు అడిగాడు.

"ఆ విషయం నాకు తెలియదుసార్!"

"సరే పోనివ్వండి! తర్వాత చెప్పండి!"

"వీళ్ళిద్దరి స్నేహం చూస్తుంటే వాళ్ళుగూడ మూర్తి

అనుచరులేమో అన్న అనుమానం కలుగుతోంది. అంతే కాని నా అనుమానానికి ఎటువంటి సాక్ష్యాలు లేవుసార్! ఇకపోతే మీరు హరికోసం వెదికించాలి, అతడి చేతిలోని పిస్తోల్లో బుల్లెట్లు అయిపోకముందే!''

నిరంజనరావు అక్కడినుండి హరి ఇంటికి వెళ్లాడు.

హరి భార్య సుందరి గోలుగోలున ఏడుస్తున్నది.

''ఆయన ఇలాంటి అఘాయిత్యం ఏదో చేస్తాడనే అనుమానిస్తున్నాను. పాడు డబ్బుకోసం ఏం కక్కుర్తి పనులు చేస్తున్నాడో ఏమో!'' అంది అతన్ని చూస్తూ.

''చూడమ్మా! నీ భర్తకు వచ్చిన భయం ఏమీ లేదు. అతడీ మధ్య కానిపనులేమన్నా చేస్తున్నాడా?''

''ఆ వివరాలు నాకు తెలియవండి! పారిపోతున్న వ్యక్తిని పోలీసులు తుపాకులతో కాల్చి చంపుతారట కదా! నా భర్తకు ఏ ప్రమాదం రాకుండా చూడండి!'' అంటూ గోలుగోలున ఏడ్చింది.

హరి ఎటుగా పారిపోవటానికి వీలుంటుందో ఆ మార్గాలన్నీ వెదికారు పోలీసులు. హరి ఆచూకీ దొరికి లేదు. కాని అతడు వేసుకువెళ్ళిన స్కూటరు మాత్రం రోడ్డు పక్కనే దొరికింది. ఆ ప్రాంతంలో ఎక్కువ సంచారం ఉండదు. అంతా మిట్ట పల్లాలు, దూరదూరంగా చెల్లాచెదురుగా ఉన్న ఇళ్ళు. వీటిమధ్య హరి దాక్కోవటానికి ఒకటికి వెయ్యి అవకాశాలున్నయ్.

ఆ సాయంత్రమే పనిమీద నిరంజనరావు వెళ్ళిపోయాడు.

# 14

జలజ లైబ్రరీ హాల్ కేసి నడిచింది. తాళం తీసుకుని లోపల ప్రవేశించింది.

ఏదో వాసన ఇల్లంతా వ్యాపించి ఉంది. ఏమిటదీ అనుకుంది? అది పెట్రోలు వాసన. పైనున్న పెట్రోలు డ్రమ్ము పగిలి అందులోదంతా క్రిందకు కారుతుందేమో, నేలంతా రొచ్చుగా ఉంది పెట్రోలుతో తడిసి.

ఆమె లైటు వేయటానికి స్విచ్ వేసింది. కాని వెలగలేదు లైటు. బహుశా కరెంటు పోయి ఉంటుంది అనుకుంది.

అవతల గది కిటికీ తలుపు గాలికి అల్లల్లాడుతూ చప్పుడు చేస్తోంది. ఏదో అడుగుల అలికిడి వినపడినట్లయ్యింది. ఆమెకు తను ఊరికే అనవసరంగా భయపడుతున్నానా అనిపించింది. అయినా ధైర్యం తెచ్చుకుని "ఎవరక్కడ?" అని అరిచింది. సమాధానం రాలేదు.

అంతలో ఆమె కళ్ళముందు ఏదో వెలుగు వచ్చినట్లయింది. అప్పుడే ఉదయించే సూర్యుని కిరణాలలా ఉంది ఆ వెలుగు.

అప్పుడామెకు అర్థం అయింది, అవి మంటలని! కావాలనే ఈ ఇంట్లో పెట్రోలు చల్లారు అంతటా. ఆ తర్వాత కిటికీలోంచి ఎవరో అగ్గిపుల్ల గీసి లోపలకు విసిరారు. కిటికీ తలుపుని బయటనుంచే లాగి మూసేశారు.

మంటలు ఇల్లంతా వ్యాపిస్తున్నయ్. డోర్ కర్టెన్లూ, తివాసీలూ, సోఫాలూ, కుర్చీలు అన్నిటిని స్వాహా చేసేస్తున్నయ్ మంటలు. చూస్తూండగానే మంటలు ఆమె చుట్టూ అల్లుకున్నయ్. బయట కుండపోతగా వర్షం. లోపల పెట్రోలుతో రగులుకున్న మంటలు, ఇంటిని స్వాహా చేస్తున్నయ్. తననుగూడ చంపటానికి ఇది హంతకులు పన్నిన పన్నాగమని జలజకు అర్థమైపోయింది.

మంటలు దగ్గరకు వస్తున్నయ్. జలజ భయంతో పెద్దగా అరవసాగింది. వర్షం వల్లా, తలుపులన్నీ మూసేసి ఉండటంవల్లా

ఆమె కేకలు ఆమెకే భయంకరంగా వినవచ్చినయ్.

అంతలోనే ఆమెకు మరో ఆలోచన వచ్చింది. ఇందాక అగ్గిపుల్ల విసిరిన కిటికీకి ఊచలు లేవు. మంటలు తనను ఆక్రమించుకోకముందే ఆమె అటు పరుగెత్తింది. కిటికీ తలుపుని లాగి చూసింది. రాలేదు. దబదబమని దాన్ని బాదసాగింది. రెండు చేతుల్తోనూ పిడికిళ్ళు బిగించుకుని తలుపుమీద బాదుతోంది.

కిటికీ వారగా ఉన్న పుస్తకాల బీరువా కొయ్యతో చేసినది. అది కూడా అంటుకుంది. మరో క్షణంలో తనూ తగలబడిపోతుంది, అనుకుంది.

భళ్ళున కిటికీ తలుపులు తెరుచుకున్నయ్. బయట వానలో తడుస్తూ సారథి నిలబడి ఉన్నాడు. అతడు చేతులు చాచి జలజను పట్టుకున్నాడు. ఒక్క ఊపులో ఆమెను కిటికీలోంచి బయటకు లాగేశాడు.

## 15

పోలీసులూ, డాక్టరూ ఒక్కసారే వచ్చారు. ఇన్స్పెక్టర్ రాజేంద్రకు జరిగినదాన్ని వివరించి చెపుతున్నాడు సారథి.

"నేను కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాను. ఏదో కాలుతున్న వాసన వచ్చింది. అయినా నేను పట్టించుకోలేదు. ఇంత జోరున వర్షం పడుతుంటే ఏం తగులబడుతుందిలే అని సరిపెట్టుకున్నాను.

"ఇంతలో లైబ్రరీ హాలులో కిటికీ తలుపు నెవరో లోపల్నుంచి బాదుతున్నట్టుగా అనిపించింది. స్నేహలతను కేకేశాను. ఆమె అప్పుడే బయటకు వెళ్ళివచ్చింది. ఆమె తలంతా తడిసిపోయింది గాబోలు తల తుడుచుకుంటూ నా మాటలు వినిపించుకోలేదు.

"ఆలస్యం చేస్తే పరిస్థితి విషమించవచ్చని నేనే లేచి వెళ్లాను. ఏ కిటికీదగ్గర చప్పుడవుతున్నదో ఆ కిటికీ వద్దకు వెళ్ళి తలుపుల్ని బలంగా లాగాను. లోపల జలజ కనుపించింది. ఆమె చుట్టూ మంటలు అల్లుకుంటున్నయ్. నేను రావటం ఏమాత్రం ఆలస్యంచేసినా ఆమె మనకు దక్కేది కాదు."

ఈ హడావిడిలో సారథి భుజానికున్న బ్యాండేజీ ఊడిపోయింది. మానిపోతున్న గాయంలోంచి మళ్ళీ రక్తం వచ్చింది.

డాక్టర్ అతడికి మళ్ళీ కట్టుకట్టాడు. ఇంజెక్షన్ ఇచ్చి కుర్చీలో కూర్చోబెట్టాడు. తర్వాత జలజని పరీక్షించాడు. ఆమెకు ప్రమాదం ఏమీ జరగలేదు. కాకపోతే భయంతో పడిపోయింది. ఆమెకు ఇంజెక్షన్ ఇచ్చిన అయిదు నిముషాలకు ఆమెకు తెలివివచ్చి కళ్ళు తెరిచింది. ఎదురుగా కాంతారావు కనుపించాడు. ఆమె అయిష్టంగా కళ్ళు మూసుకుని తల త్రిప్పుకుంది అతన్ని చూడటం ఇష్టం లేనట్టుగా.

పోలీసులు లైబ్రరీ హాల్‌లోకి వెళ్ళి చూశారు. ముందు రెండు గదులూ పూర్తిగా కాలిపోయినయ్. గోడలూ, పైకప్పూ మినహా మరేం మిగలలేదు. డోర్ కర్టెన్‌లూ, కిటికీ కర్టెన్లూ, కుర్చీలు, సోఫాలూ, అన్నీ తగలబడి పోయినయ్. పైకప్పులోంచి వెంటిలేషన్ కిటికీ ఉంది. ఆ పై కప్పుమీద పెట్రోల్ డబ్బా ఉంది. అది తిరగబడిపోయి పెట్రోల్ అంతా క్రింద గదుల్లోకి పారింది. ఎవరో కావాలని అగ్గిపుల్ల గీచి లోపలకు పడేసినట్టుగా జలజ చెప్పింది.

"ఇదంతా వాడి పనే అయివుండాలి!" అన్నాడు రాజేంద్ర తల నిమురుకుంటూ.

"ఎవరు సార్?" సారథి అడిగాడు.

"ఇంకెవరు? హరిగాడే! రాత్రి వాడు ఇంటికి వచ్చాడట. వాన మూలంగా మా వాళ్ళు అతడికోసం గాలింపు మానేశారు. ఇదే అదనుగా అతడు తన ఇంటికి తిరిగి వచ్చాడు. ఇంట్లో అన్నం తిన్నాడు. క్రితం రాత్రి తన భార్య తన జేబులోంచి కాజేసిన నలభయ్ రూపాయలు మళ్ళీ పోట్లాడి తీసుకున్నాడు. ఎలా వచ్చాడో అలా జారుకున్నాడు వానలోనే."

"అయితే హరి వచ్చాడా? ఇది వాడి పనే అయి ఉండచ్చు సార్?"

"సారధిగారూ! మీకూ హరికీ అసలు ఘర్షణ పడాల్సిన అవసరం ఎందుకు కలిగిందో చెప్తారా?"

సారధి ఒక నిముషం ఆలోచించాడు. "అదేమంత పెద్ద విషయం కాదు! వాడి జీతం పెంచమని లోగడే అడిగాడు. అసలు నిన్ను ఉద్యోగంలోంచి తీసేయకుండా కంటిన్యూ చేయటమే అదృష్టం అనుకో అన్నాను. ఎందుకంటే క్రితం నెలలో 'ప్రెసిషన్ కేస్' అనే సున్నితమైన మిషన్ని పాడుచేశాడు. దాని విలువ కొన్ని వందలు వుంటుంది. అసలు వాణ్ని అప్పుడే తీసేయ్యాల్సింది.

"వాడు నే చేసిన ఉపకారాన్ని మరిచిపోయి నామీద కక్షగట్టాడు సార్!" అంటూ చెప్పాడు సారధి నిదానంగా.

వాన వెలిసింది. ఆ పూటే సర్కిల్ ఇన్స్పెక్టర్ నిరంజనరావు తిరిగి వచ్చాడు.

జలజపై మళ్ళీ అత్యాచారం జరిగిందనీ, సారధి ఆమెను రక్షించాడనీ తెలుసుకున్నాడు. పారిపోయిన హరికోసం పోలీసుల్ని నాలుగువేపులకూ తరిమాడు.

నిరంజనరావు తనొక్కడే లైబ్రరీ హాల్‌లోకి వెళ్ళాడు. సారధి తనుగూడ వస్తానన్నాడు లోపలకు.

"మీరు కదలకండి. మీ గాయం మళ్ళీ పెద్దదవుతుంది!" అని అతన్ని వారించాడు.

ముందు గది అంతా మసిబారి నల్లగా ఉంది. పెట్రోలు వాసన వస్తూనే ఉంది. ముందు రెండు గదుల్లోని వస్తువులన్నిటినీ అగ్ని తన పొట్టను పెట్టుకుంది. ఆ విషయం స్పష్టంగా తేటతెల్లమవుతున్నా గాని అతడు విసుగు చెందకుండా గోడ మూలలన్నీ వెదికి చూశాడు.

ఒక ప్రక్క గోడకు వెంటిలేటర్ మీద చిన్న ప్లాస్టిక్ బొమ్మ మంటలకు ఆహుతి కాకుండా మిగిలిపోయింది.

దాన్ని చేతబుచ్చుకుని బయటకు నడిచాడు నిరంజనరావు.

"చూడండి జలజగారూ! మీతో పాటు ఆ మంటల్లో నుంచి బయటపడింది ఈ బొమ్మ! దీన్ని జ్ఞాపకార్థంగా మీ దగ్గరే ఉంచుకోండి!" అంటూ బొమ్మ జలజ చేతికిచ్చాడు.

ఆ బొమ్మను చూస్తూనే సారథి ముఖం ఆదోలా అయిపోయింది.

చిరునవ్వుతో ఆ బొమ్మను అందుకుంటూ అంది జలజ. "సార్ మద్రాసు వెళ్ళాలి, పర్మిషన్ ఇప్పించండి నాకు!"

"ష్యూర్! ష్యూర్! తప్పకుండా! నేనే మిమ్మల్ని మద్రాసు తీసుకువెళ్ళి దిగబెడతాను సరా?"

నిరంజనరావు బయటకు వెళ్ళాడు. మరో అరగంట తర్వాత తిరిగి వచ్చాడు.

"సారథి లేరా ఇంట్లో?" అని అడిగాడు.

"లేరండీ! ఫ్యాక్టరీకి వెళ్ళారు. నేను వెళ్ళొద్దని మొత్తుకున్నా వినలేదు!" అని స్నేహలత విచారంగా అంది.

"జలజగారూ! మనం మరో అరగంటలో ప్రయాణం కావాలి!" అన్నాడు నిరంజనరావు.

"ఇదిగో! పది నిముషాల్లో రానూ!" అంటూ జలజ బాత్ రూమ్‌లోకి పరుగెత్తింది.

ఇక్కడనుంచి ఎంత త్వరగా బయట పడగాలమా అని ఆమె ఆత్రంగా వుంది.

జలజ టాయిలెట్ అయివచ్చేసరికి పోలీస్ జీప్ వచ్చి ఆగింది ఇంటిముందర.

"స్నేహలతా! వెళ్ళొస్తాను! సారధిగారు ఇంట్లో లేరు సమయానికి. వెళ్ళానని చెప్పండి వారికి!" అంది జలజ జీప్‌లో ఎక్కబోతూ.

నిరంజనరావు జీప్ దగ్గరకు వచ్చాడు. జలజ జీప్ ముందుసీట్లో కూర్చుంది. నిరంజనరావు డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

జీప్ కదలింది. చూస్తుండగానే కార్మికనగర్‌లో ఇళ్ళూ, ఇండస్ట్రియల్ ఎస్టేట్ అన్నీ దూరమయినయ్.

"మీ బొమ్మనికూడ తెచ్చుకుంటున్నారా మీ వెంట?" అని అడిగాడు నిరంజనరావు.

జలజ నాలుక కొరుక్కుంది. "అరె! దాన్ని అక్కడే మర్చిపోయాను సుమండీ!" అంది.

"పోనీలెండి! దాన్ని గురించి విచారించకండి!"

# 16

మధ్యాహ్నం పోస్ట్‌మెన్ తలుపు తట్టాడు. వెళ్ళి తలుపు తీసింది జలజ. నాలుగు ఉత్తరాలు, ఒక పత్రిక ముప్ఫై రూపాయలకు మనిఆర్డరు ఇచ్చాడు.

తను వ్రాసిన వ్యాసం పత్రికలో పడింది. దాని కాపీ వచ్చింది ఇప్పుడు. రెండు నెలల క్రితం ప్రచురింపబడిన వ్యాసం తాలూకు పారితోషికం మనిఆర్డరు వచ్చింది. పోస్ట్‌మెన్ వెళ్ళిపోయాక తలుపు దగ్గరకువేసి వచ్చి

కుర్చీలో కూర్చుని ఉత్తరాలు చదవటంలో నిమగ్నమై పోయింది. వాటిని చదవటం పూర్తిచేశాక పత్రికలో ప్రచురింపబడిన వ్యాసం చదువుతూ కూర్చుంది.

వ్యాసం ధ్యాసలో పడిన జలజ, నెమ్మదిగా తలుపు తెరుచుకుని ఒక వ్యక్తి లోపలకు రావటం గమనించలేదు.

అతడు నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చాడు ఆమె దగ్గరకు. ఆ తర్వాత తన జేబులోంచి ఒక బొమ్మను తీసి ఆమె ముందరున్న టేబుల్ మీద పెట్టాడు.

జలజ భయంతో బిగ్గరగా అరవబోయి వచ్చినవ్యక్తిని చూసి ఆగిపోయింది.

ఆ వచ్చిన వ్యక్తి ఎవరో కాదు. సారధి! తను మరచి పోయి వచ్చిన ప్లాస్టిక్ బొమ్మను— తనతో బాటుగా మంటల్లో తగులబడిపోకుండా మిగిలిపోయిన బొమ్మను తెచ్చాడు.

"చాలా థ్యాంక్స్ సారధ గారూ! నేను హడావిడిలో ఆ బొమ్మను మరచిపోయాను తేవటం. నేను ఆ మంటల్లోంచి బ్రతికి బయటపడ్డందుకు ఇది జ్ఞాపకార్థం!" అన్నది నవ్వుతూ.

సారధ ముఖంలోకి చూసిన జలజ నవ్వు మాయమయింది. అతడి కళ్ళు కోపంతో ఎర్రగా ఉన్నయ్. పెదిమలు వణుకుతున్నయ్. మనిషిని పట్టిగానే నమిలి మింగే కిరాతకునిలా ఉన్నయ్ అతని ముఖకవళికలు.

"సారధ్! ఏమిటిది? మీరదోరకంగా ఉన్నారు?" భయంతో అడిగింది జలజ.

"ఈ బొమ్మలో దాచినది ఏది? ఎక్కడ పెట్టావ్?"— అతడి గొంతు కర్కశంగా ఉంది.

జలజ బిత్తరపోయింది. భయంతో బిగుసుకుపోయింది.

"ఏమిటి మీరనేది? అందులో ఏముంటుంది? అది కేవలం బొమ్మ!" కంగారులో మాట సరిగారాక తడబడుతూ పలికింది.

సారథి రెండడుగులు ముందుకు వేశాడు. అతడి కబంధ హస్తాలు ఆమె భుజాల్ని పట్టుకుని కుదించినయ్.

"సారథీ! వదలు! ఏమిటిది?" అతడి ముఖంలోకి చూస్తూ అరిచింది.

"ఏమీ తెలియని నంగనాచిలా నటించకు. ఈ బొమ్మలో డైరీని దాచాను. నీవు ఏంచేశావ్ దాన్ని! త్వరగా చెప్పు!"

"సారథీ! నీవేదో అపోహలో ఉన్నావ్! నన్ను వదిలెయ్. డైరీ గురించి నాకేం తెలియదు."

అతడు తన చేతుల్ని వదిలేశాడు. కాని మరుక్షణంలో ఆమె చెంపమీద బలంగా దెబ్బపడింది. ఆమె తూలి పడిపోయింది. పైట జారిపోయింది.

సారథి ఆమెమీదకు వంగాడు. జాకెట్ మధ్య భాగాన్ని గట్టిగా పట్టుకుని ఆమెను లేవదీశాడు. అయితే ఆమె బరువుకు జాకెట్ చిరిగిపోయింది. కొట్టకుండానే ఆమె క్రిందపడిపోయింది.

తల దేనికో కొట్టుకుంది. చిల్లిపడి నెత్తురు కారింది. అరచేత్తో గాయాన్ని అదుముకుంది జలజ.

సారథి ఆమెను లేవతీసి నిల్చోబెట్టాడు. గోడకానుకుని ఒరిగి నిలబడింది జలజ. పెద్దగా అరుద్దామనుకుంది. కాని అలా అరిచే లోపలే అతడి ఉక్కు చెయ్యి తన కంఠాన్ని నులిమేస్తోంది.

"నీవు ఆ డైరీని ఇచ్చావా సరేసరి! లేదూ! ఆ మూర్తి గాడు పై అంతస్తులోని కిటికీలోంచి పడిపోయినట్టుగా నీవూ పడిపోతావ్."

"అంటే? మూర్తిని హత్యచేసింది నీవేనా?" అంత హింసలోనూ ఆశ్చర్యంగా అంది జలజ అతడికేసి చూస్తూ.

"అవును! ఆ గాడిదని నేనే చంపాను. లేకపోతే నన్నే బ్లాక్ మెయిల్ చెయ్యాలని చూస్తాడా? నీ అనవసరపు ప్రసంగం కట్టిపెట్టి ఆ డైరీ ఎక్కడుందో త్వరగా ఇచ్చెయ్యి."

"మీరు అడిగేది ఈ డైరీకోసం కాదుగదా?" ఎవరిదో మూడో కంఠం వినిపించింది.

జలజ, సారధి ఇద్దరూ వాకిలికేసి చూశారు. గుమ్మంలో సర్కిల్ ఇన్స్పెక్టర్ నిరంజనరావు నిలబడి ఉన్నాడు. అతడి చేతిలో డైరీ వుంది.

బిలబిలమంటూ లోపలకు జొరబడ్డారు పోలీసులు, నిరంజనరావుని తప్పుకుంటూ. అందరూ సారధిని చుట్టుముట్టారు.

"మీ రనేదేమిటో నా కర్థంకావటంలేదు సి. ఐ. గారూ?" అమాయకంగా అన్నాడు సారధి.

"ఏమిటా? మూర్తిని హత్యచేయటం, ఆ తర్వాత రాగిణిని చంపటం, సూర్యాన్ని చంపి అతడి శవాన్ని కాలువలో పారేయడం, జలజపై హత్యాప్రయత్నం! ఇప్పుడు అర్థమయిందా? మిస్టర్ సారధీ! నీఆట కట్టింది. నీ పెన్నుల ఫ్యాక్టరీగూడ మా స్వాధీనం అయింది!"

జలజ గుడ్లప్పగించి అలానే చూస్తూ ఉండిపోయింది. ఆమె కళ్ళముందు వెయ్యిదీపాలకాంతి వెలిగింది. అంతలోనే గాఢాంధకారం అలుముకుంది. నిల్చున్నపళంగా కుప్పలా కూలిపోయింది.

* * *

జలజ కళ్ళు తెరిచింది. చుట్టూ వాతావరణాన్ని కలియజూసింది. తను ఆస్పత్రిలో ఉన్నట్టు తెలుసుకుంది. తల

క్రింద దిండ్లు ఎత్తుగా పెట్టబడివున్నయ్. ప్రక్కనే నిలబడి తనను కనిపెట్టుకుని ఉన్న నర్సు గది బయటకు వెళ్ళి నిరంజనరావుని వెంటపెట్టుకుని వచ్చింది.

"ఇప్పుడెలా వుందమ్మా?" అనునయంగా అడిగాడు నిరంజనరావు.

"బాగానే ఉందండి! ఇంతకీ నాకేమయింది?" అని అడిగింది.

"అతిగా భయపడటంవల్ల నీకు స్పృహతప్పి పడిపోయావు. అంతే! అంతకన్నా పెద్ద ప్రమాదమేం జరగలేదు."

"సారథి ఇంతపని చేస్తాడని కలలోకూడ అనుకోలేదు సుమండీ! అతడు హంతకుడంటే ఇప్పటికీ నమ్మశక్యం కాకుండా వుంది."

"నీకేకాదు! మాకూ అతడిమీద అనుమానం రాలేదు డైరీ దొరికేదాకా!"

"ఇంతకీ అతడు హంతకుడుగా మారాల్సిన అవసరం ఏమొచ్చింది సార్?"

"అదంతా పెద్దకథ అవుతుంది!"

జలజ ఉత్సాహంగా పైకి జరిగింది. "ఇప్పుడు నాకు ఓపికగానే ఉంది. వివరంగా కాకపోయినా టూకీగా అన్నా చెప్పండి ఇన్స్పెక్టర్!"

"చెబుతానమ్మా! చెబుతాను! నీకు కాకపోతే ఇంకెవరికి చెప్పను? భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ ఇటీవల రెండుగా చీలిపోయిన సంగతి నీకూ తెలుసనుకుంటాను. ఒకవర్గం రష్యా అభిమానులు. మరోవర్గం చైనా అభిమానులు.

"అయితే చైనా అభిమానులు ప్రభుత్వ నిషేధాజ్ఞల్ని దృష్టిలోవుంచుకొని రహస్యంగా పనిసలుతుంటారు. ఈ

సారథిగూడ అలాంటి పెద్దమనిషే. అతడికి పెద్ద పెద్ద నాయకులతో పరిచయం వుంది. పైనావర్గంలో ఇతడు అత్యున్నత స్థానంలో ఉన్నాడు. అయితే ఈ విషయం ఆ పార్టీలోని మెంబర్లకుగూడ చాలమందికి తెలియదు.

"అతడి రహస్యం ఒకటి మూర్తికి తెలిసింది. అతడూ లోగడ కొన్నాళ్ళు ఆ పార్టీలో పనిచేసినవాడే. కాని అతడు డబ్బు మనిషి. పార్టీలోంచి విడివడిపోయి, సరస్వతిని పెళ్ళాడిన తర్వాత అతడు పెట్టుబడిదారీవర్గంలో జేరిపోయాడు.

"సారథి రహస్యం ఆధారంగా అతన్ని బ్లాక్ మెయిల్ చేసి డబ్బు గుంజసాగాడు. ఈ విషయం పార్టీలో చర్చకు వచ్చింది. మూర్తికి టిక్కెట్టు ఇవ్వాల్సిందేనని నిర్ణయించారు పార్టీ ఉన్నతాధికారవర్గం. ఎందుకంటే అతడు పార్టీలో కొన్నాళ్ళు పనిచేసి ఉన్నందున, పార్టీ రహస్యాలు కొన్ని అతడికి తెలిసివుండవచ్చు. అది పార్టీకి ప్రమాదం ఎప్పటికైనా. రెండవది ఒక బ్లాక్ మెయిలర్ పీడా వదిలించుకోవటానికి.

"ఈ పని ఎవరు చేయాలీ అనే ప్రశ్నగూడ చర్చించారు. చివరకు ఆపని సారథికి అప్పగించారు. ఎందుకంటే అతని పార్టీ భక్తిని పరీక్షించటానికి ఒకటీ, రెండోది తనను డబ్బుకోసం పీడించే జలగలాంటి వ్యక్తిని ఏరిపారేసే అవకాశం అతనికే ఇవ్వాలనే దానికీ.

"సారథి అతిచాకచక్యంగా ఆ పని నెరవేర్చాడు. అతడు తనకు అప్పచెప్పబడిన పనిని చేస్తాడా, లేదా అని కనిపెట్టటానికి సూర్యాన్ని నియమించారు. సూర్యం పార్టీలో మామూలు వర్కరు.

"సారథి హత్యచేయటం చూసిన సూర్యం అతగాడు ఆపని ఎందుకు చేస్తున్నాడో ఆరాతీశాడు. అతడూ

అప్పుల్లో ఉన్నాడు. మూర్తి సారథినుంచి ఎలా డబ్బు రాబట్టేవాడో కనుక్కోవటానికి బయలుదేరాడు.

"సరస్వతితో ఇంటర్వ్యూకి వచ్చినప్పుడు డ్రాయర్లు శోధించి డైరీని దొంగిలించుకున్నాడు. దాంతో సారథిని బెదిరించాలని చూశాడు. సారథి అతడిని నేర్పుగా తన లైబ్రరీ హాల్లోకి పిలిపించాడు. సూర్యంను చంపి డైరీని తీసుకొని ప్లాస్టిక్ బొమ్మలో దాచేశాడు సారథి.

నీకు మత్తుమందు ఇచ్చి నిద్రపుచ్చాడు. నీవు మగతలో ఉన్నప్పుడే సూర్యంను చంపి శవాన్ని బయటకు చేర్చాడు.

"మూర్తిని కటికీలోంచి తొంగిచూస్తూ ఎదురు బిల్డింగులో ఒక స్త్రీని లీలగా చూశాడట సారథి. ఆమె రాగిణే అయివుంటుందని ఆమెను లారీ ప్రమాదానికి గురిచేశాడట అతడే!"

"అయితే సారథి నన్ను ఎందుకు చంపలేదు! నేను మంటల్లో ఉంటే నన్ను చావనీయక ఎందుకు రక్షించాడు!"

"నిన్ను రక్షిస్తే అతడే హంతకుడని ఎవరికీ అనుమానం రాదని ఆ విధంగా నటించాడు.

"తగులబడిపోయిన ఇంట్లోకి వెళ్ళినప్పుడు అదృష్టవశాత్తూ ప్లాస్టిక్ బొమ్మలో నా కా డైరీ కనిపించింది. లేకపోతే ఇన్ని హత్యలు చేసిన సారథి తప్పించుకొనేవాడు. డైరీగురించి సారథి నీ దగ్గరకు వస్తాడని మేము అతడికోసం వలపన్నాము. మేమాశించినట్లే అతను నేరుగా వచ్చి మా వలలో చిక్కిపోయాడు."

"ఇంతకీ సారథిని ఏవిషయం మీద బ్లాక్ మెయిల్ చేశాడు మూర్తి?"

"చైనావారు మొదటినుంచీ కత్తిబలంకన్నా కలంబలం

గొప్పదని వాదించేవారు. ఆ మాటల్లోని అంతరార్థం ఇప్పుడు బయటపడింది. సాయుధ పోరాటంతో ప్రతి దేశంలోనూ విప్లవాన్ని లేవదీయాలని వాళ్ళ ఆశ.

“అందుకోసమే ఈ మధ్య కొత్తరకం పిస్తోళ్ళను కనిపెట్టారు. మామూలు పెన్ ఉంటుంది కదా! అందులోనే క్రిందభాగంలో పిస్తోలుని అమర్చేవిధంగా కొత్తరకం కలాన్ని ఉత్పత్తిచేశారు. పైన క్యాప్ తీస్తే రాసుకోవటానికి వీలుగా కలం ఉంటుంది. వాటిని తమ పార్టీ వారికి పంచిపెడుతున్నారు.

“క్రిందిభాగాన రహస్యంగా స్ప్రింగు అమర్చబడి ఉంటుంది. దాన్ని నొక్కిపెడితే పదిగజాల దూరంలో ఉన్న వ్యక్తిని కాల్చటానికి ఆట్టే శ్రమపడక్కర్లేదు. సరిగ్గా అలాంటి కలాలనుకూడ తయారుచేస్తున్నాడు సారథి రహస్యంగా. పైకి ఆకారంగా అతడి ఫ్యాక్టరీని సోదా చేశాం. నేరస్థుడు దొరికిపోయాడు.”

“అయితే శారద నాన్న ఎలా అయ్యాడు?”

“వాడొట్టి ఉద్రేకపరుడేగాని బుద్ధిలేనివాడు. వాడ్ని దెబ్బకొట్టి మన అనుమానాన్ని అతడి మీదకు మళ్ళించారు కేసుని తప్పుదోవ పట్టించటానికి—!”

“తీగ లాగితే డొంక అంతా కదిలినట్టయ్యింది!” అంటూ చిన్నగా నిట్టూర్పు విడిచింది జలజ.

—: ఐ పో యిం ది :—

విసుగా.

ఆమె కళ్ళు చిట్లించింది.

"తినండి, అన్నీ మీకు నచ్చేవే!"

రామ్మూర్తి తింటున్నాడు, కాని మనస్సు తిండిమీద లేదు. బయటి గదిలోంచి టెలిఫోన్ మోత వినపడ్తోంది.

"నే వెళ్ళి చూస్తా!" అందామె.

ఆమెకంటె ముందు అతను ఫోన్ దగ్గరకు పరుగెత్తి, రిసీవర్ని ఎత్తి, "హల్లో, రామ్మూర్తి స్పీకింగ్!" అన్నాడు.

"మిస్టర్ రామ్మూర్తీ, టైము పదకొండయింది. మరో గంట టైముంది నీకు! పట్నంలో బియ్యం దొరక్క వేలాది ప్రజలు పస్తుంటున్నారు. నువ్వు నీ గోడౌన్‌లో రహస్యంగా దాచిన రెండువేల బస్తాలను బయట పెట్టి సరైన ధరల్లో అమ్మవలసిన సమయమొచ్చింది! పన్నెండు తర్వాత, అలా నువ్వు చెయ్యకపోతే నీ గోడౌన్‌లోని బస్తాలన్నీ మాయమవుతాయి. ప్రజల మేలుకోరి మేం చెప్పింది చేస్తావా, లేక దేశద్రోహివై మా శిక్షకు బలవుతావా— నువ్వే నిర్ణయించుకో!"

గంభీరమైన బొంగురు కంఠం! అటువైపున రిసీవర్ పెట్టేసిన చప్పుడైంది. రిసీవర్ని పెట్టేసి రామ్మూర్తి డైనింగ్ గదిలోకి వెళ్ళాడు. అర్ధాకలిగా తిని అతను చెయ్యి కడుక్కున్నాడు.

ఆదుర్దాగా భార్య అతనివైపు చూసింది.

"ఏమీ తినలేదు. అంతా వదిలేశారు. మీ మనస్సు ఎక్కడుందో!" అందామె.

రామ్మూర్తి పెళ్ళాం చెయ్యి పట్టుకుని ఆమెను దగ్గరగా లాక్కున్నాడు. తనను వేధించే సమస్యను ఎవరికో చెప్తే గాని బరువు తగ్గదు!

"రమా! మనం రహస్యంగా దాచిన బియ్యం బస్తాలను

బయట పెట్టి తక్కువ ధరలకు అమ్ముమంటున్నారు. అలా చెయ్యకపోతే గోడౌన్ని లూట్ చేస్తారట!"

"మనదగ్గర అంత స్టాకుందని వాళ్ళకెలా తెల్సింది!" అడిగిందామె.

"ఎలాగో తెల్సింది రమా! ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి?"

"పోలీస్ రిపోర్టు ఇవ్వండి!"

అతను ఫక్కున నవ్వాడు.

"అతిరహస్యంగా దాచిన స్టాక్, రమా! అంత స్టాకు నా దగ్గర వుందని ప్రభుత్వానికికూడా తెలియదు. పోలీసు రిపోర్టిస్తే ప్రభుత్వానికి అంతా తెలుస్తుంది, ప్రమాదం!"

"అయితే ఎందుకీ గొడవ! తక్కువ ధరల్లో ప్రజలకు అమ్మేయండి! ప్రజలు మిమ్మల్ని మెచ్చుకుంటారు!"

"ఈనాటి హెచ్చు ధరల్లో అమ్ముకుంటే విశేషంగా లాభం వస్తుంది. వాళ్ళు చెప్పినట్లు అమ్మితే నష్టంకూడా రావచ్చు!"

"నా బుర్ర పనిచేయడంలేదు! ఏం చెయ్యాలో మీరే ఆలోచించండి!" అంది రమా.

## 2

టైము పన్నెండయింది.

అన్నాపిళ్లై స్ట్రీట్‌లో వున్న రామ్మూర్తి అండ్ సన్స్, హోల్‌సేల్ అండ్ రిటెయిల్ షాపులోకి ఒక స్త్రీ వెళ్ళింది.

రామ్మూర్తి ఆమెకేసి సీరియస్‌గా చూశాడు.

"బియ్యం కావాలి!" అందామె.

"స్టాకు లేదమ్మా!"

"ఎంతో కొంత యివ్వండి. అత్యవసరంగా కావాలి!"

"పది అయిదు రూపాయలు!"

"అంత ఖరీదులో బియ్యం కొని ఎలా బ్రతగ్గలం?"

రామ్మూర్తి జవాబివ్వలేదు. తన షాపులో పనిచేసే వాళ్ళతో మాట్లాడుతున్నాడు.

"ఖరీదు తగ్గించండి!"

"మార్కెట్లో బియ్యం లేదమ్మా. అయిదు రూపాయిల రేటులో కొనడం కూడా కష్టం. ఇంకా ధర ఎక్కువవుతుంది," అన్నాడు రామ్మూర్తి.

ఆమె వెనక్కి తిరిగి నీరసంగా బయటకు నడిచింది. గోడమ్మట అనుసరిస్తోంది. స్కూటరుమీద వెళ్తోన్న ఒకతను ఆమె పక్కనే ఆగాడు.

"బియ్యం లేవు! పదికి అయిదు రూపాయిలిస్తే ఇస్తానన్నాడు!"

స్కూటర్ ముందుకు దూసుకుపోయింది.

* * *

మధ్యాహ్నం రెండుదాటింది. రామ్మూర్తి సంతోషంగా సిగరెట్ వెలిగించాడు. ఫోన్లో వాళ్ళు ఏదో అన్నారు కాని గోడౌన్లోని బస్తాలను పట్టుకెళ్ళడం అంతసులువైన పనికాదు. భయపెట్టగానే తను లొంగిపోతాడని వాళ్ళు అనుకుని వుంటారు. తను ధైర్యం గలవాడనీ, చిల్లిగవ్వ లేకుండా మద్రాసు వచ్చి లక్షలు గడించిన తను పిరికిపంద కాదని వాళ్ళకు తెలియదు!

డాడ్జి కారు షాపుముందు ఆగింది. ఖరీదైన దుస్తులు ధరించిన ఒక సేట్ షాపులోకి నడిచాడు.

"ఈ కంపెనీ యజమాని మీరేనా?" అడిగాడు సేట్.

అతని కుడిచేతికి నాల్గు వుంగరాలున్నాయి. మెళ్ళో బంగారం గొలుసు మెరుస్తోంది.

"నేనే, సార్!" అన్నాడు రామ్మూర్తి.

"మీతో రహస్యంగా మాట్లాడాలి!"

రామ్మూర్తి అతడ్ని లోపలున్న ఏర్‌కండిషండ్ గది లోకి తీసుకువెళ్ళాడు. స్ప్రింగ్ తలుపు వాళ్ళ వెనక నే మూసుకుంది. ఇద్దరూ పెద్ద సోఫాలో కూర్చున్నారు. ఫ్లోరసెంట్ లైట్ వెల్గుతోంది. గదిలో ఎంతో చల్లగా వుంది.

"మిస్టర్!" అన్నాడు సేట్.

"పేరు రామ్మూర్తి!" అన్నాడతను.

"నా పేరు సేట్ గోకులదాస్! నాకు బియ్యం కావాలి! అమ్మకానికి!" అన్నాడతను.

"ఎన్ని బస్తాలు?" అడిగాడు రామ్మూర్తి.

సేట్ ముందుకు వంగాడు. రామ్మూర్తి కేసి నవ్వుతూ చూశాడు.

"నాకు అమ్మడానికి పెర్మిట్ లేదు. మీదగ్గరకొని బియ్యాన్ని నేను మలబార్‌కి రహస్యంగా పంపుతాను. అక్కడ విపరీతమైన డిమాండ్ ఏర్పడింది!"

రామ్మూర్తి లోలోపల సంతోషించాడు. తన దగ్గరున్న స్టాకంతా సేట్‌కి ఇచ్చేస్తే అటుపైన తనని బెదిరించినవాళ్ళు ఏమీ చెయ్యలేరు!

"బస్తాలో నలభై పళ్ళుంటాయి. ఖరీదు రెండువందలు!" అన్నాడు రామ్మూర్తి.

"ఆ రేటున ఎన్నిబస్తా లివ్వగలరు?" అడిగాడు సేట్.

"మీరు ఎంత తీసుకెళ్ళగలరు?"

"స్కయ్ ఈజ్ ది లిమిట్! నాకు పోలీసులతో రహస్య సంబంధాలున్నాయి. ఎంత స్టాకున్నా పట్టుకు పోతాను!"

"రెండువేల బస్తాలు ఇవ్వగలను. మీరు నాకు నాల్గు

లక్షలు ముందుగా కట్టాలి!"

"లక్ష ఇప్పుడిస్తాను. తతిమ్మా మూడులక్షలూ బస్తాలు నా లారీల్లో వెయ్యగానే చెల్లిస్తాను."

"ఎప్పుడొస్తాయి మీ లారీలు?" అడిగాడు రామ్మూర్తి.

"రాత్రి పన్నెండింటికి మీ గోడౌన్ ముందుంటాయి. ఆ సమయంలో అందరూ నిద్రపోతూవుంటారు."

"అలాగే చేద్దాం. నాదగ్గర బియ్యంకొన్నట్లు మీరు ఎవ్వరికీ చెప్పకూడదు!"

సేట్ నవ్వాడు.

"మిస్టర్ రామ్మూర్తీ, నాదిగూడా బ్లాక్‌మార్కెట్ వ్యాపారం. నాకు మీరు రసీట్, బిల్లు ఇవ్వనక్కరలేదు. సరుకిచ్చి క్యాష్ తీసుకోండి!"

"అలాగే, సేట్ జీ," అన్నాడు రామ్మూర్తి.

సేట్ గోకులదాస్ తన ప్లాస్టిక్ బాక్స్ తెరిచాడు. నాలుగు కట్టలను రామ్మూర్తి కిచ్చాడు.

"కట్టల్లో ఇరవైఅయిదు వేలున్నాయి. ఒక తెల్ల కాగితంమీద లక్ష అడ్వాన్సు ముట్టినట్లు రాసియ్యండి!"

సంకోచిస్తూ రామ్మూర్తి సేట్ వైపు చూశాడు.

"అది అవసరమా?"

"టెంపరరీగా. తతిమ్మా డబ్బు మీ కిచ్చేటప్పుడు ఈ రసీట్ మీ కిచ్చేస్తాను. చింపి పారేయొచ్చు;"

తెల్లకాగితంమీద రామ్మూర్తి రాసి, సంతకం పెట్టి, తారీఖు వేసి అతని కిచ్చాడు.

"రాత్రి పన్నెండింటికి మీ లారీలు అహమ్మద్ రోడ్డు నంబరు 10 కాంపౌండులో వుండాలి. అది బయటినుంచి చూస్తే పెద్దమేడ! దాన్ని నేను గోడౌన్‌గా ఉపయోగిస్తున్నాను," అన్నాడు రామ్మూర్తి.

"అక్కడ మీరుంటారా?"

"ఉంటాను."

"బస్తాలు లారీల్లో వేసేవరదాకా ఏ ప్రమాదమూ లేకుండా మీరు చూడాలి. అటుపైన బాధ్యత నాది!"

"ఏ భయం లేదు. అది నా స్వంత భవనం. మా వాళ్ళు ఉంటారు. వాళ్ళను మనం నమ్మొచ్చు!"

సేట్‌ను బయటనున్న కారుదాకా సాగనంపాడు రామ్మూర్తి. డాడ్జికారు చప్పుడు లేకుండా కదిలింది. రామ్మూర్తి తన ఏర్‌కండిషండ్ గదిలోకి పరుగెత్తాడు. తన రొటేటింగ్ కుర్చీలో కూర్చుని వెనక్కి వాలాడు. లోలోపల ఎంతో సంతోషంగా వుంది. ఎంతో రహస్యంగా కూడబెట్టిన బస్తాలు మాయమవుతాయేమో అని అతను భయపడ్డాడు. ఇప్పుడా బెంగ లేదు! తన శ్రమ ఫలించింది! లక్షన్నర రూపాయలు లాభం! అదృష్టం తన్ని వరించినది.

టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ని ఎత్తిన అతని చెయ్యి వణుకుతోంది.

"నేనండీ!" అంది రమాదేవి.

"ఓ, నువ్వా!" అన్నాడతను నవ్వుతూ.

"దాన్ని గురించి ఏం చేశారు?"

"స్టాకంతా అమ్మేశాను. మనకి బెంగ లేదు!"

"ఇంత తొందరగా ఎలా అమ్మారు?"

"అదే లక్! రమా, ఒక సేట్‌జీ దొరికాడు. అతను మలబార్‌కి బియ్యం స్మగుల్ చేస్తున్నాడు. అతని కిచ్చేశాను. మనకు లక్షన్నర లాభం!" అన్నాడతను సగర్వంగా!

"ఇంటికి తొందరగా వచ్చేయండి! పొద్దుట మీరు టిఫిండే తినలేదు!" అందామె.

"వినాయకుడి గుడికి వెళ్ళివస్తాను."

అతను రిసీవర్ పెట్టేశాడు. స్టేట్ ఎక్స్‌ప్రెస్ ఫిల్టరు సిగరెట్ వెలిగించి, పొగ వదుల్తూ కుర్చీలో వెనక్కి వాలాడు.

# 3

రాత్రి పన్నెండయింది.

అహమ్మద్ రోడ్ లో దీపాలు వెల్గుతున్నాయి. ఇరవై లారీలు కాంపౌండులోకి ప్రవేశించాయి. డాడ్జి కారు పక్క నిలబడిన సేట్ వాటికేసి సంతోషంగా చూశాడు. పక్కనున్న రామ్మూర్తి కేసి తిరిగాడు.

“బెస్ట్ గోడౌన్! ఎవ్వరూ అనుమానించరు!”

“నేను చెప్పానుగా, సేట్ జీ!”

“మిస్టర్ రామ్మూర్తీ, పని తొందరగా కానివ్వండి.”

“మా వాళ్ళు లారీల్లో బస్తాలు వేస్తారు. మనం నా గదిలో కూర్చుందాం.”

రామ్మూర్తి వెనుకనే సేట్ నడిచాడు. ఒక విశాలమైన ఏర్ కండిషండ్ గదిలోకి వెళ్లారు. పెద్ద ఫోమ్ సోఫాల్లో ఇద్దరూ ఆశీనులయ్యారు.

రామ్మూర్తి బజర్ నొక్కాడు. ఒక అందమైన యువతి లోపలకొచ్చింది. సేట్ ఆమె కేసి ఆత్రంగా చూశాడు. సన్నగా, పచ్చగా, వుందామె. పొడుగాటి జడ. స్కర్ట్, వైట్ బ్లౌస్ ధరించింది. చెవులకు పెద్ద రింగులున్నాయి. ఎత్తయిన స్తనాలు. ఎర్రటి పెదిమలు!

“రాణీ, స్కాచ్ అండ్ సోడా! ఛిప్స్!” అన్నాడు రామ్మూర్తి.

“మీ గోడౌన్ లో అమ్మాయిలు కూడా వున్నారే!” అన్నాడు సేట్.

“రాణీ ఇక్కడే తల్లితో వుంటోంది. అన్నివిధాలా మనతో సహకరించే యువతి!” అన్నాడు రామ్మూర్తి.

"అటువంటివాళ్ళే కావాలి మనకు!" అన్నాడు సేట్.

రాణీ ట్రేలో అన్నీ తెచ్చి టీపాయిమీద పెట్టింది. రెండు గ్లాసుల్లో విస్కీ పోసి, సోడా కలిపి ఐస్ క్యూబ్స్ వేసింది. దగ్గరలో వున్న టేబుల్ వరకు నడిచి టేప్ రికార్డర్ని ఆన్ చేసింది. తగ్గు స్వరంలో వెస్టర్న్ ఆర్కెస్ట్రా వినపడుతోంది. ఆమె బయటకు వెళ్ళిపోయింది. ఇద్దరూ గ్లాసులను ఎత్తారు.

"టు లాస్టింగ్ బిజినెస్!" అన్నాడు రామ్మూర్తి.

"విత్ ప్రాఫిట్!" అన్నాడు సేట్.

"ఎప్పుడు కావాల్సినా నేను మీకు స్టాకు సప్లయి చెయ్యగలను."

"అందుకే మీ దగ్గరకొచ్చాను," అన్నాడు సేట్.

గ్లాసులు ఖాళీ అయ్యాయి. రామ్మూర్తి గ్లాసుల్లో స్కాచ్ విస్కీ మళ్ళా పోసి, సోడా కలిపి, ఐస్ వేశాడు. ఇద్దరూ సిగరెట్లు కాలుస్తున్నారు. గదిలో చల్లగా, హాయిగా వుంది. "ఆ బాలెన్సు క్యాష్ ఇచ్చేస్తే మన పని పూర్తవుతుంది," అన్నాడు రామ్మూర్తి.

సేట్ పన్నెండు కట్టలుతీసి సోఫామీద పడేశాడు. రామ్మూర్తి కట్టల్ని లెఖ్ఖపెట్టుకుని తన హేండ్ బాగ్‌లో పెట్టుకున్నాడు. సేటు మొదటిచ్చిన లక్ష అదే బాగ్‌లో వుంది. సేట్ రసీట్‌ను రామ్మూర్తి కిచ్చాడు. అతను దాన్ని చింపి సోఫా వెనక పడేశాడు.

"మద్రాస్‌లో మీ రెక్కడుంటున్నారు?" అడిగాడు రామ్మూర్తి.

సేట్ అతనికేసి విచిత్రంగా చూశాడు.

"నాది మద్రాస్ కాదు. బొంబాయి. నా పేరు గోకుల దాస్ కాదు. స్మగ్లర్స్ అన్నింటికీ తెగించి ఎన్నో మారు వేషాలు వెయ్యాలి. మనం మరికొంత దగ్గరయ్యాక నా

అసలు పేరు, అడ్రెస్ మీకు చెప్తాను."

గ్లాసులను రామ్మూర్తి మళ్ళా నింపాడు. విస్కీ రామ్మూర్తిమీద పనిచేస్తోంది. అతను ముద్దగా మాట్లాడుతున్నాడు. కాని సేట్‌లో అంతగా మార్పు లేదు. విస్కీ సేవించడం అతనికి బాగా అలవాటేమో!

"మనం దగ్గరయ్యాం! వుయ్యార్ బ్రదర్స్ యిన్ స్మగ్లింగ్ రైస్!" అన్నాడు రామ్మూర్తి నవ్వుతూ.

"వెల్ సెడ్!" అన్నాడు సేట్.

స్కర్ట్ ధరించిన యువతి లోపలకొచ్చింది.

"లోడింగ్ ఎంతవరకూ అయింది?" అడిగాడు సేట్.

"పని సాగుతోంది సార్!" అందామె.

"వాళ్ళు లారీల్లో బస్తాలను లోడ్ చేస్తున్నారు. మనం ఇక్కడ స్కాచ్‌ని మన కడుపుల్లోకి లోడ్ చేస్తున్నాం!" అన్నాడు రామ్మూర్తి.

సేట్ అతనికేసి వింతగా చూస్తున్నాడు. రాణీ రామ్మూర్తి పక్కనే కూర్చుంది. అతని గ్లాసులో మరి కొంత విస్కీ పోసింది.

"ఓవర్ డోస్!" అన్నాడు సేట్.

"తాగినప్పుడు ఆయన చక్కగా మాట్లాడతారు," అందామె.

రెండు దాటింది. తప్పతాగిన రామ్మూర్తి సోఫాలో పడుకుని వున్నాడు. రాణీ అతడ్ని గట్టిగా తట్టింది. అతను లేచి కూర్చున్నాడు. నిద్రమత్తులో ఆమెకేసి చూశాడు.

"రాణీ, నువ్వా?" అన్నాడతను.

"మీరు గోడౌన్ భవనంలో మత్తుగా నిద్రపోతున్నారు. మీ భార్య మూడుసార్లు ఫోన్ చేశారు. మీరు బిజీగా వున్నారని చెప్పాను," అందామె.

"సేట్ ఏడీ?" అడిగాడు రామ్మూర్తి.

"బియ్యం బస్తాలు వేసుకుని లారీలు వెళ్ళిపోయాయి. సేట్ కూడా వెళ్ళిపోయారు!" అందామె.

నేలమీద పడున్న తన ప్లాస్టిక్ బాగ్‌ను అతను అందుకున్నాడు. తెరిచి చూశాడు. నోట్లకట్టలు లేవు!

"రాణీ, ఇందులో నోట్లకట్టలుండాలి! అవి ఏమయ్యాయి" అర్చాడతను.

"నాకు తెలియదు, సార్. సేట్ నాతో చెప్పి వెళ్ళిపోయారు. మీరు నిద్రపోతున్నారు!"

టెలిఫోన్ మ్రోగింది. అతను మెల్లిగా వెళ్ళి రిసీవర్ని అందుకున్నాడు.

"మిస్టర్ రామ్మూర్తీ, నీ రెండువేల బస్తాలూ ప్రజలకు పంచి పెడ్తున్నాం. దేశద్రోహీ, కళ్ళు తెర్చుకో! ప్రజల్ని మోసంచేసి నువ్వు డబ్బు గడించలేవు!" అంది గంభీర కంఠం.

"హలో, నా స్టాకంతా నే నమ్మేశాను," అన్నాడు రామ్మూర్తి.

"యూ ఆర్ ఫూల్! సేట్ గోకులదాస్ మా మనిషి. నీకు పైసా ఇవ్వకుండా బస్తాలు మాయమయ్యాయి. మా మాట వినకపోవడం వలన ఎంత నష్టపోయావో ఆలోచించుకో!" అటువైపునుంచి క్లిక్ శబ్దం ధ్వనించింది.

రామ్మూర్తి రిసీవర్ని పెట్టేశాడు. మెల్లిగా వెళ్ళి సోఫాలో చతికిలబడ్డాడు.

"రాణీ, నా స్టాకంతా గాలిలో ఎగిరిపోయింది! రెండున్నర లక్షలు నష్టం," అన్నాడతను, ఏడుపు కంఠంతో.

## 4

పడక కుర్చీలో వెనక్కి జార్లబడి డిటెక్టివ్ వాలి చుట్ట పీలుస్తున్నాడు. ఎదురుగా రామ్మూర్తి కూర్చుని

ఉన్నాడు.

"అబ్బాయి, చాలా గాభరాగా ఉన్నావు!" అన్నాడు వాలి.

"వాలిగారూ, రెండువేల బస్తాల బియ్యాన్ని వాళ్ళు లారీల్లో వేసుకుని పారిపోయారు. నాకు చిల్లిగవ్వరాలేదు. రెండున్నర లక్షలు నాకు నష్టమొచ్చింది," అన్నాడు రామ్మూర్తి.

"వివరంగా చెప్పు!" అన్నాడు వాలి.

జరిగినదంతా రామ్మూర్తి వివరంగా చెప్పాడు. వాలి నవ్వుతూ అతనివైపు చూశాడు.

"నువ్వు పోలీస్ రిపోర్టిచ్చావా?"

"లేదు, సార్!"

"ఎందుకివ్వలేదు?"

"ఆ సాకు నేను రహస్యంగా దాచాను. ఖరీదుఎక్కువై నాకి అమ్మాలని నా ఉద్దేశం! అన్ డి క్లేర్డ్ స్టాక్, సార్!"

"డబ్బుకోసం కక్కుర్తిపడి సర్వాన్నీ కోల్పోయావ్!" అన్నాడు వాలి.

"వాలిగారూ, వాళ్ళెవరో మీరు కనుక్కోవాలి! అందుకోసం ఎంత ఖర్చయినా నేను భరిస్తాను."

"ఆల్ రైట్, ప్రయత్నిస్తాను," అన్నాడు వాలి.

"సేట్ గోకులదాస్ అతని అసలుపేరు కాదు. అతను బొంబాయినుంచి మద్రాస్ వచ్చాడు."

"నీతో అతను అబద్ధం చెప్పుండొచ్చు!" అన్నాడు వాలి.

"మీరు చెప్పేది నిజమే సార్. అతను బాగా నటించాడు. అతనొక స్మగ్లర్ అని నేను నమ్మాను. నాకు ఫోన్ చేసినవాళ్ళే ఆవిధంగా నన్ను మోసగిస్తారని నేననుకోలేదు!" అన్నాడు రామ్మూర్తి.

"అబ్బాయి, ప్రజలకు అన్నం కావాలి! వేలాది బస్తాలు దాచి నువ్వు ప్రజలకు తిండిలేకుండా చేశావు. అందుకు శిక్ష అనుభవించాలి," అన్నాడు వాలి.

"వాలిగారూ, నన్నొక ద్రోహిగా భావించకండి! మన దేశంలో అందరూ డబ్బుకోసం తాపత్రయ పడుతున్నారు. డబ్బు గడించాలనే ఉద్దేశంతో నేను స్టాకును దాచాను. నా స్టాకు ఆ విధంగా పట్టుకుపోవడం పచ్చిమోసం!" అన్నాడు రామ్మూర్తి.

"అబ్బాయి, నీకు ఫోన్ చేసినవాళ్ళు ప్రజలకు మంచి చేస్తున్నారు. దాన్ని గురించి నాకు సందేహంలేదు. అయినా వాళ్ళు చేసినది చట్టానికి విరుద్ధం!" అన్నాడు వాలి.

రామ్మూర్తి కుర్చీలోంచి లేచాడు. పదివేల రూపాయలకు చెక్కు రాసి వాలికిచ్చాడు.

"ఇది అడ్వాన్సుగా వుంచుకోండి!" అన్నాడు రామ్మూర్తి.

# 5

కేశవులు భోజనంచేసి సిగరెట్ పీలుస్తూ ఫోమ్ బెడ్ మీద పడుకున్నాడు. టెలిఫోన్ మ్రోగింది. అతను రిసీవర్ని ఎత్తి, "హల్లో, కేశవులు స్పీకింగ్!" అన్నాడు.

"మిస్టర్ కేశవులూ, నువ్వు రహస్యంగా వేయి కేసుగ నూనెని దాచావు. వెంటనే ఆ డబ్బాలను బయటపెట్టి ప్రజలకు సరైన ధరల్లో అమ్ము! అమ్మకపోతే నీ గొడౌన్‌లో వున్న డబ్బాలన్నీ మాయమవుతాయి!" అంటోంది గంభీర కంఠం.

ఏం చెప్పాలో తోచక కేశవులు మౌనంగా వున్నాడు.

"మిస్టర్ కేశవులూ, తెలిసిందా?"

"తెలిసింది," అన్నాడతను.

"ఏం చెయ్యా దల్చావు?"

"మీ ఇష్టమొచ్చింది చేసుకోండి. నా కా భయం లేదు," అన్నాడు కేశవులు.

"గుడ్ నైట్!" అని, అటువైపున రిసీవర్ పెట్టేయబడింది.

కేశవులు రిసీవర్ని పెట్టేశాడు. అతని భార్య సుమతి కిల్లీని నవ్వుతూ అందించింది.

"ఏమిటండీ! అలా వున్నారు?" అడిగిందామె.

"ఎవరో నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నారు, సుమతీ! బ్లాక్ మెయిలర్ కి లొంగకూడదు," అన్నాడతను.

"దేన్ని గురించి?" అడిగిందామె.

"నా దగ్గరున్న గ్రౌండ్ నట్ ఆయిల్ని సరైన ధరల్లో ప్రజలకు అమ్మాలిట!"

"అమ్మేయండి! గ్రౌండ్ నట్ నూనె దొరక్క ఎందరో కష్టపడుతున్నారు," అందామె.

"సుమతీ, యూ ఆరే ఫూల్! మనకు ఎంతో లాభం వస్తుందని ఆశిస్తున్నాను. వాళ్ళు చెప్పినట్లు చేసి నష్టపోమంటావా?"

"ప్రజలు బతికుంటేనేగా ఏ వ్యాపారమైనా సాగేది? వాళ్ళుపోతే మీరు ఏం చెయ్యగలరు?" అంది సుమతి.

కేశవులు ఆమెను తనమీదకు లాక్కున్నాడు. సుమతి అమాయకురాలు! ఆమె పెదిమలను అతను బలంగా ముద్దెట్టుకున్నాడు.

"సుమతీ, డబ్బు చేసుకునే అవకాశం వచ్చినపుడు మనం వదులుకోకూడదు. మంత్రులు లంచాలు తీసుకుంటున్నారు. మనం ఎక్కువ ధరకి అమ్మితే పోయిందేమిటి?" అన్నాడతను.

సుమతి మాట్లాడలేదు. వ్యాపారమంటే ఏమిటో ఆమెకు తెలియదు. భర్త కేశవులకు వదిలేయడం మంచిది!

* * *

రాత్రి రెండు దాటింది. టెలిఫోన్ మ్రోగుతోంది. విసుక్కుంటూ అతను రిసీవర్ని ఎత్తాడు.

"హలో!" అన్నాడతను.

"గోడౌన్ వాచ్‌మన్ ప్రతాప్, సార్!"

"ఏమిటి సంగతి?"

"గోడౌన్‌లోని నూనె డబ్బాలన్నీ పోయాయి, సార్. వాళ్ళు పట్టుకుపోయారు. నన్ను తాళ్ళతో కట్టేశారు. వాళ్ళు పోయాక నేను మీకు ఫోన్ చేస్తున్నాను!"

"ఎవరు వాళ్ళు?"

"చాలామంది వచ్చారు సార్. పది లారీ లొచ్చాయి సార్. లారీల్లో డబ్బాలు పెట్టుకుని వాళ్ళు వెళ్ళి పోయారు!"

"ప్రతాప్. నువ్వు వాచ్‌మన్ పదవికి పనికిరావు. పోలీసుకు ఎందుకు ఫోన్ చెయ్యలేదు?" అడిగాడు కేశవులు.

"నేను కదిలే స్థితిలో లేను, సార్. నా అరుపులు విని సమీపంలో ఉండేవాళ్ళు వచ్చి నన్ను కట్టిన తాళ్ళను విప్పేశారు. అంతవరకూ నేను ఖైదీని!"

కేశవులు చిరాకుతో రిసీవర్ని పెట్టేశాడు. సుమతి లేచి కళ్ళు నులుముకుంటోంది.

"ఇంత రాత్రివేళ ఎవరండీ ఫోన్ చేస్తే?" అడిగిందామె.

"గోడౌన్ వాచ్‌మన్!" అన్నాడతను.

"ఏమైందట?"

"గోడౌన్‌లోవున్న నూనెడబ్బాలను ఎవరో ఎత్తుకు

పోయారు. వాచ్‌మన్‌ని వాళ్ళు తాళ్ళతో కట్టేశారు!'' అన్నాడతను.

ఆమె ఉలిక్కిపడింది.

''నేను చెప్తే మీరు వినలేదు! ఆ డబ్బాలను అమ్మేస్తే ప్రజలు సంతోషించేవారు. ఇప్పుడు మనకు నష్టంగా!'' అందామె.

''వాళ్ళకు బుద్ధి చెప్పాలి!'' అన్నాడు కేశవులు, కోపంగా.

# 6

పోలీస్ కమీషనర్‌కి ఎదురుగా వాలి కూర్చున్నాడు. కమీషనర్ కామత్ నవ్వుతూ వాలికేసి చూశాడు.

''వాలిగారూ, తమ దర్శనం అయి చాలా కాలమైంది!''

వాలి అమాయకుడిలా నవ్వాడు. అతని కళ్ళు మెరుస్తున్నాయి. పెద్దముఖం, విశాలమైన నుదురు. బుగ్గమీసాలు, పళ్ళమధ్య పొడుగాటి చుట్ట!

''కామత్ భాయ్ రెండువేల బస్తాల బియ్యం మీకు దొరికినట్లు వార్త అందింది. దాన్ని గురించి వివరంగా చెప్పు!'' అన్నాడు వాలి.

''రాత్రి మూడింటికి ముఖ్యమంత్రిగార్కి ఎవడో అకాశరామన్న ఫోన్ కాల్ చేసి ఇరవై లారీల్లో బియ్యంబస్తాలు ఉన్నాయనీ, లారీలు పూనమల్లీ హైరోడ్డులో హోటల్ అమీన్ ముందు ఆపబడి వున్నాయనీ, వాటిని ముట్టడించి బస్తాలను స్వాధీనం చేసుకుని ప్రజలకు తక్కువ ధరలో అమ్మాలనీ చెప్పాడతను.''

''అటుపైన ఏం జరిగింది?''

''ముఖ్యమంత్రిగారు ఆ వార్తను నాకు అందించారు. మేం లారీలనూ, డ్రయివర్లనూ పట్టుకున్నాం. సివిల్ సప్లయిస్ కమీషనర్ బియ్యంబస్తాలను స్వాధీనం చేసుకున్నారు.

కోఆపరేటివ్ స్టోర్స్ద్వారా ఆ బియ్యాన్ని ప్రజలకు కిలో 2.60 రేటున అమ్ముతున్నారు.''

''ఆ లారీలు ఎవరివి?''

''మురుగన్ లారీ సర్వీస్ కంపెనీవి. ఆ కంపెనీవాళ్ళు మోసపోయారు.''

''లారీల్లో వాళ్ళు బస్తాలను ఎక్కడకు తీసుకెళ్తున్నారు?''

''త్రివేండ్రమ్ వెళ్లాలని లారీలను అద్దెకు మాట్లాడారు. హోటల్ అవినాష్ ముందు ఆపమని వాళ్ళు ఉత్తరువిచ్చారు.''

''కామత్ భాయ్, ఆ బస్తాలను ప్రభుత్వానికి అందజేయాలనే ఉద్దేశంతో లారీలను హోటల్ ముందు ఆపమని ఫోన్ కాల్ చేసుండాలెవరో!'' అన్నాడు వాలి.

''ఇది విచిత్రంగావుంది, వాలిగారూ. రెండు వేల బస్తాలు! కొన్ని లక్షలు విలువుంటుంది. కాని ఆ స్టాకు ఎవరిదో ఇంతవరకూ తెలియలేదు!''

''బస్తాలను లారీల్లో ఎక్కడ వేశారో తెలుసుకొంటే స్టాకెవరిదో తేల్తుంది,' అన్నాడు వాలి.

''లోడ్ చేసేటప్పుడు లారీ కంపెనీ డ్రయివర్లు లేరట. వేరే డ్రయివర్లను వాళ్ళు ఉపయోగించారు.''

''అన్ డిక్లేర్డ్ స్టాకయివుండాలి!'' అన్నాడు వాలి.

''యూ ఆర్ రైట్, సార్. ఇది నాదని క్లెయిమ్ చేసే ధైర్యంలేదు, ఎవ్వరికీ!''

''కామత్ భాయ్, స్మగ్లర్స్ నష్టాలను లెఖచేయరు. క్లిష్టపరిస్థితులలో సరుకును వదిలేసి పారిపోతారు,' అని వాలి లేచాడు.

''వాలిగారూ, మరో విషయం మీకు చెప్పాలి!''

''నిన్న రాత్రి ఎవరో ముఖ్యమంత్రికి ఫోన్ చేశా

వెయ్యి వేరుసెనగ నూనెడబ్బాలను మేం స్వాధీనం చేసుకున్నాం. ఇరవై కిలోల డబ్బాలు! వాటినికూడా ప్రజలకు కోఆపరేటివ్స్ ద్వారా అమ్ముతున్నారు.''

వాలి కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నాడు. చుట్ట పొగ రింగుల్లో పైకిలేస్తోంది. రామ్మూర్తిలాగా మరెవరో దుకాణకు పోయి ఆ నూనెడబ్బాలను పోగొట్టుకొని వుంటారు!

వాలి కళ్ళు తెరిచి కామత్ వైపు చూశాడు.

''కామత్ భాయ్, మనుషులకు అత్యవసరమైన వస్తువుల ధరలు విశేషంగా పెరిగిపోయాయి. రూపాయి విలువ ఈనాడు 33 పైసలకు దిగిపోయింది. ఇటువంటి సమయాల్లో తక్కువ జీతగాళ్ళు బ్రతకడానికి ముప్పు తిప్పలూ పడాలి! ఈ పరిస్థితుల్లో డబ్బు చేసుకోవాలని వ్యాపారస్థులు చూస్తున్నారు. స్టాకును దాచి బ్లాక్ మార్కెట్‌లో అమ్ముతున్నారు. ప్రభుత్వం దాన్ని అరికట్టలేకపోతోంది! మద్రాస్ పట్నంలో ఏదో సంఘం ప్రజల మంచికోసం రహస్యంగా పాటుబడ్తోంది! రహస్యంగా దాచిన స్టాకును ఆ సంఘం బయటపెట్టి ప్రభుత్వానికి అప్పగిస్తోంది!'' అన్నాడు వాలి.

''వాళ్ళు చేసేది మంచిపనైనా, అది మన చట్టప్రకారం నేరం, వాలిగారూ! ఎక్కడేనా స్టాక్ దాచారని మాకు అందిస్తే మేమే వెళ్ళి రెయిడ్ చేస్తాంగా!'' అన్నాడు కామత్.

వాలి విచిత్రంగా నవ్వాడు.

''కామత్ భాయ్, ఆ సంఘానికి మీమీద అంతగా నమ్మకం లేకపోవచ్చు! దేశంలో కరప్షన్ ఎక్కువగా వుందని వాళ్ళకు తెలుసు!''

కమీషనర్ కామత్ సీరియస్‌గా వాలికేసి చూశాడు.

''అటువంటి సంఘాలు వుండడం మంచిదికాదు, సార్.

ఇప్పుడు మనం కళ్ళు మూసుకుంటే తర్వాత ఆ సంఘం ప్రభుత్వానికి పక్కలో బల్లెం అవుతుంది! భయపెట్టి, బ్లాక్ మెయిల్ చేసి స్టాకును బయట పెట్టడం చట్టవిరుద్ధం!"

వాలి కుర్చీలోంచి లేచాడు. కమీషనర్ కామత్ లేచి వాలి దగ్గరగా నడిచాడు.

"వాలిగారూ, ఆ సంఘాన్ని మనం నిర్మూలించాలి! అది పెరిగి పెద్దదయితే ప్రభుత్వానికే ప్రమాదం. పాారలల్ ప్రభుత్వాన్ని చివరకు ఆ సంఘం స్థాపిస్తుంది! దాని మూలంగా లాభాలు పొందిన ప్రజలు దాన్నే బలపరుస్తారు! వాలిగారూ, మీ సహాయం నాకు కావాలి! ఆ సంఘాన్ని మనం రద్దుచేయాలి! ఆ సంఘం తమ కార్యక్రమాలను చట్టరీత్యా బాహాటంగా చేస్తే నేను వద్దనను. కాని ఇలా రహస్యంగా పనిచేయడం దేశానికి మంచిది కాదు," అన్నాడు కామత్.

# 7

విశాలమైన హాల్లో యాభైమంది కుర్చీల్లో కూర్చున్నారు. ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. ఏర్ కండిషండ్ గది! ఎదురుగా వున్న ఎత్తయిన ఖాళీ కుర్చీవైపు అందరూ చూస్తున్నారు.

పచ్చగా, పొడుగ్గా వున్న ఒకతను గబగబా వచ్చి ఆ కుర్చీలో కూర్చున్నాడు. పంచ, జుబ్బా ధరించాడతను. కళ్ళు జ్యోతుల్లా మెరుస్తున్నాయి.

"కామ్రేడ్స్, భారత్ జిందాబాద్!" అన్నాడతను.

"భారత్ జిందాబాద్!" అరిచారందరూ.

"కామ్రేడ్స్, గతవారంలో మనం ఎంతో సాధించగలాం. పట్నంలోని ప్రజలకు బియ్యం, నూనె కొరత లేకుండా చేశాం. దమ్మిడీ ఖర్చులేకుండా దొరికిన సరుకును

ప్రభుత్వం తక్కువ ధరల్లో ప్రజలకు అమ్ముతోంది! ఇంత వరకూ మంచిదే. ఈ పట్నంలోని ప్రజలకు మనం చేసిన సేవ అమోఘం. కాని మన రాష్ట్రంలోని తదితర పట్టణాల్లో ప్రజలు కష్టపడుతున్నారు. మన సంఘాన్ని రాష్ట్రమంతటా వ్యాపించేట్లు చేయాలని నేనొక నిశ్చయానికి వచ్చాను. అది మీ సమ్మతిమీద ఆధారపడివుంటుంది!" అన్నాడతను.

"ఇన్‌ఫ్లేషన్‌లో ఇరుక్కుని తిండికోసం అష్టకష్టాలూ పడే ప్రజలకోసం మీరేంచేసినా మేం అంగీకరిస్తాం," అన్నాడొకతను.

"మన సేవ్ ది పీపుల్ సొసైటీకి మీరు బాస్! మీ మాటకు తిరుగులేదు!" అన్నాడు మరొకతను.

"కామ్రేడ్స్, నేను నియంతనుకాను. మీరు బాస్‌గా ఎన్నుకొని నన్ని కుర్చీలో కూర్చోబెట్టారు. ఈ కుర్చీలో కూర్చొని మన సంస్థను పెంపొందించే అవకాశం మీ అందరికీ లభిస్తుంది. మన సంస్థ స్వార్థరహితంగా పనిచేస్తుంది. సామాన్య ప్రజలను కాపాడ్డంకోసం మనం కంకణం కట్టుకున్నాం. మనం చేసే కార్యక్రమాలు ఇటుపైన రాష్ట్రంలోని వారందరకూ ఉపయోగపడ్తాయి! మన సంస్థకు బ్రాంచెస్ స్థాపిస్తున్నాను. శరవేగంగా అంతా జరుగుతుంది," అన్నాడు బాస్.

"చెయ్యండి!" అన్నారందరూ.

బాస్ ముఖం సీరియస్‌గా అయింది.

"మన సంఘాన్ని నిర్మూలించాలనే వుద్దేశంతో ప్రఖ్యాత డిటెక్టివ్ వాలిగారు పరిశోధన సాగిస్తున్నారని నాకు వార్తలొచ్చాయి. వాలిగారు దేశభక్తులు. ప్రజలంటే ఆయనకు ఎంతో అభిమానం. ఆయన్నికూడా మన

సంస్థలో చేర్పడానికి ప్రయత్నాలు. రహస్యంగా జరుపుతాను!"

"స్ప్లెన్ డిడ్!" అన్నారందరూ.

"కాంగ్రేచ్స్, బైబై!" అన్నాడు బాస్.

## 8

కరుపయ్యా టేప్ రికార్డర్ ఆన్ చేసి స్కాచ్ విస్కీ సేవిస్తున్నాడు. పక్కనే అతని సెక్రటరీ మాలతి కూర్చుని వుంది. ఏర్ కండిషండ్ గదిలో లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి.

మాలతి వయస్సు పదహారేళ్ళు. తండ్రి కుంటివాడు. ఇంట్లో గడవక ఆమె ఈ ఉద్యోగంలో చేరింది. మాలతి టైము చూసింది.

"ఏడైంది సార్! నేను ఇంటికి వెళ్తాను!"

కరుపయ్యా ఆమెకేసి ఆకలితో చూశాడు. నల్లటి బొగ్గులా వున్నాడతను. గారగట్టిన పళ్ళు. వికృతమైన ముఖం, మొహంనిండా స్ఫోటకం మచ్చలు!

అతని చెయ్యి ఆమె నడుమును ముట్టింది. ఆమె కళ్ళల్లోకి అతను ఆత్రంగా చూశాడు.

"మాలతీ, నువ్వు రెండు వందలు అడ్వాన్స్ అడిగావు. ఇస్తాను!"

ఆమె సంతోషించింది. తండ్రి చేసిన అప్పులు ఆ డబ్బుతో తీర్చొచ్చు! ఇటుపైన తన తండ్రికి సుఖంగా నిద్రపడ్తుంది!

కరుపయ్యా చటుక్కున ముందుకువంగి ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు. విదిలించుకుని మాలతి లేచి దూరంగా వెళ్ళింది. రుమాల్తో పెదిమలను తుడుచుకుంది. చెడు వాసన!

అతను కోపంగా ఆమెకేసి చూశాడు.

"నన్ను వద్దంటే నువ్వీ లోకంలో బ్రతకలేవ్!" అరిచాడతను.

ఆమె వణుకుతోంది.

"నన్ను పోనివ్వండి!" అందామె.

అతను తూలుతూ లేచాడు. ఆమె చెయ్యి పట్టుకుని గట్టిగా లాగాడు. ఆమె సోఫాలో పడింది.

"పిల్లా, కనుపయ్యను కన్నిస్తే నీకు వేలకి వేలొస్తాయి!"

"అటువంటి డబ్బు నా కొద్దు!" అందామె.

అతను విరగబడి నవ్వాడు.

"మొదట్లో అలాగే అందరూ అంటారు. శరీరం పవిత్రమైంది అని పోరుబడ్తారు. కాని పవిత్రమైన శరీరం తిండి లేకపోతే చస్తుంది! డబ్బుంటేకాని తిండిరాదు. అందువలన అన్నిటికంటె పవిత్రమైనది డబ్బు, శరీరం కాదు! డబ్బు దేనిమీదా ఆధారపడదు. సవ్యసాచిలా అంతా సాధిస్తుంది!"

మాలతి మాట్లాడలేదు. ఆమె గుండె దడదడ కొట్టుకుంటోంది. తను ప్రేమించిన కుమార్ ఆమెకు గుర్తుకొచ్చాడు. ఉద్యోగం రాగానే కుమార్ తన్ని పెళ్ళాడ్తాడు.

గ్లాసులోని విస్కీని కనుపయ్య గడగడ తాగేశాడు. ఎక్కిళ్ళు వస్తున్నాయి! కింగ్ సైజ్ గోల్డ్ ఫ్లేక్ సిగరెట్ వెలిగించాడు.

"మాలతీ, ఏమంటావు?"

"నన్ను ఇంటికి పోనివ్వండి. అమ్మా నాన్నా నా కోసం ఎదురు చూస్తూ వుంటారు. అమ్మకి బ్లడ్ ప్రెషర్!" ఆమె దీనంగా అతణ్ని వేడుకుంది.

కనుపయ్య కళ్ళు ఎర్రబడ్డాయి. ఆమె చెంపమీద

గట్టిగా చేత్తో కొట్టాడు. ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి!

"నిన్ను ఇంటికి వెళ్ళనివ్వను! నిన్ను నేను అనుభవిస్తే గాని బయటకు పంపను!"

ఆమె లేచింది. దూరంగా పరుగెత్తింది. గుమ్మంవైపు చేరుకుంది. తలుపును బలంగా లాగింది. తలుపు తెరవబడ లేదు! కనకయ్య తాళం చెవిని ఆమెకు చూపించాడు!

"తలుపుకు తాళంవేసి అంతా కట్టుదిట్టం చేశాను!" అన్నాడతను పరిహాసంగా నవ్వుతూ.

మాలతి అతనికేసి ఆగ్రహంతో చూసింది.

"నన్ను ముట్టుకుంటే అరుస్తాను!" అందామె.

"ఇది సౌండ్ ప్రూఫ్ గది! నీ అరుపుల్ని ఎవ్వరూ వినరు!"

అతను గ్లాసులో విస్కీ పోసి కొద్దిగా సోడా కలిపి తొందరగా తాగేశాడు. తూలుతూ ఆమె దగ్గరకు నడిచాడు. ఆమె తప్పించి పక్కకు పోయింది. ఆమె కాళ్ళను అతను బలంగా పట్టుకున్నాడు. మాలతి వెనక్కు పడింది. కనకయ్య ఆమెమీదకు వాలాడు! మాలతి గింజుకుంటోంది. అతను ఆమె చీరను లాగేశాడు. పావడాను వూడదీశాడు.

ఆమె తన కాళ్ళను దగ్గరగా వుంచి అతనివైపు చూసింది. "దుర్మార్గుడా, నన్ను వదిలేయ్!" అందామె.

టెలిఫోన్ మ్రోగింది. అతను వెళ్ళి రిసీవర్ను ఎత్తాడు.

"హలో కనకయ్య స్పీకింగ్!" అన్నాడతను.

"ఒళ్ళు రుద్దుకోవడానికి సబ్బులు లేక ప్రజలు కష్ట పడుతున్నారు. నువ్వా సోప్సుకి హోల్ డిస్ట్రిబ్యూటర్వి. నీ దగ్గరున్న సోపుల్ని వెంటనే మార్కెట్లో చీప్ గా అమ్ము! అలా చెయ్యకపోతే నీ సోపులు మాయమవుతాయి!" ఇంకొక గంభీర కంఠం.

తప్పతాగిన కరుపయ్య పిచ్చివాడిలా నవ్వాడు.

"మిస్టర్, నువ్వెవరు?" అడిగాడు కరుపయ్య.

"అది నీకు అనవసరం!"

"మిస్టర్, నువ్వు నన్ను బెదిరిస్తున్నావా? పోలీస్‌కి రిపోర్టిచ్చి నిన్ను అరెస్టు చేయిస్తాను." అన్నాడు కరుపయ్య.

"చూద్దాం," అని అటువైపున రిసీవర్ పెట్టేయబడింది.

"దొంగనా కొడుకులు! భయపెడ్తే కరుపయ్య లొంగడని వాళ్ళకు తెలియదు," అన్నాడతను.

మాలతి అతను ఫోన్‌లో మాట్లాడుతుండగా చీర కట్టుకుంది. అతను మళ్ళీ ఆమె దగ్గరగా వెళ్ళాడు.

కరుపయ్య ఆమెమీద పడ్డాడు. ఆతడ్ని తోసేసి ఆమె దూరంగా పరుగెత్తింది. అతను ఆమెవైపు పరుగెత్తాడు. అతనికి దొరకకుండా ఆమె తప్పించుకుంటోంది!

అతను ఒగరుస్తూ సోఫాలో చతికిలబడ్డాడు. గ్లాసులో విస్కీ పోసుకుని కొద్దిగా సోడా కలిపి అతను తాగేశాడు. సిగరెట్ పీలుస్తూ దూరంలో నిలబడిన ఆమెకేసి చూశాడతను.

తప్ప తాగి అతను సోఫాలో పడుకున్నాడు. టీపాయి మీదున్న తాళం చెవిని ఆమె తీసుకుంది. తలుపు తెరచి బయటకు పరుగెత్తింది!

# 9

గోడౌన్ ప్రాంతంలో వాలి XYZ కారును ఆపి దిగాడు. రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. కొంచెం దూరంలో కరుపయ్య గోడౌన్ వుంది. వాలి రోడ్డమ్మట పచార్లు చేస్తున్నాడు.

ఒక లారీ వచ్చి గోడౌన్ ముందు ఆగింది. ఇద్ద

వ్యక్తులు లారీలోంచి దిగారు. వాలి వాళ్ళవైపు నడిచాడు. డ్రయివర్, అతని అసిస్టెంట్!

"ఎవరిదీ లారీ?" అడిగాడు వాలి.

"ఇక్కడ వుండమన్నారు, సార్!" అన్నాడు డ్రయివర్.

"ఇక్కడ వుండటానికి వీల్లేదు. లారీని తీసుకుపో!" అన్నాడు వాలి.

డ్రయివర్ తికమకలు పడుతున్నాడు! వాలిని చూస్తే అతని గుండె దడదడమంటోంది! లారీ కదిలింది. మెయిన్ రోడ్డుమీదకు పోయింది. కాస్సేపట్లో డాడ్జి కారొచ్చి లారీ పక్కనే ఆగింది. ఒకతను డ్రయివర్ కేసి చూశాడు.

"ఎందుకిక్కడున్నావు?" అడిగాడతను.

"గోడౌన్ ముందు లారీని ఆపకూడదని ఆయనన్నారు, సార్. అందుకని ఇక్కడ ఆపాను!" అన్నాడు డ్రయివర్.

"ఎవరాయన?"

"పగవాడాయన, సార్. మనిషిని చూస్తేనే గుండె దడదడమంది సార్!"

డాడ్జి కారు కదిలింది. రోడ్డుమ్మట స్పీడుగా వెళ్తోంది. వెనకనే ఏదో కారొస్తోంది.

"స్పీడ్ హెచ్చించు!" అన్నాడతను డ్రయివర్తో.

వెనకనుంచి కారు హెడ్ లైట్లు కన్పిస్తున్నాయి.

వెనకనుంచి వస్తూన్న కారు దగ్గరవుతోంది. కాస్సేపట్లో ఆ కారు ముందుకుపోయి చటుక్కున ఆగింది. అడ్డుగావున్న కారు వలన డాడ్జి కారు ఆగవలసి వచ్చింది.

XYZ కార్లోంచి వాలి దిగి వెనక్కి వచ్చాడు. డాడ్జి కారువైపు నడిచాడు. వెనుక సీటుమీద ఒంటరిగా కూర్చున్నతనివైపు చూశాడు.

"మిస్టర్, బయటకురా!" అన్నాడు వాలి.

అతను బయట అడుగు పెట్టాడు. వాలి కేసి ఆశ్చర్యంగా చూశాడు.

"వీరా!" అన్నాడతను.

"అబ్బాయి, నీ పేరేమిటి?" అడిగాడు వాలి.

"సేట్ గోకులదాస్," అన్నాడతను.

"లారీ డ్రయివర్ తో ఏమి మాట్లాడావ్?"

"గోడౌన్ అడ్డంగా లారీ ఆపవద్దని చెప్పాను!"

"నువ్వు నాతో పోలీస్ స్టేషన్ కి రావాలి!" అన్నాడు వాలి.

అతను మాట్లాడలేదు. నవ్వుతూ వాలి కేసి చూశాడు. "నేను ఏం నేరం చేశాను?" అడిగాడతను.

వాలి చుట్ట పీలుస్తూ కారు నంబర్ని చూసి అతని వైపు తిరిగాడు.

"కరుణయ్య పోలీసు రిపోర్టిచ్చాడు. అతని గోడౌన్ని లూటీ చేస్తున్నాడు. రక్షణ కావాలన్నాడు. మీ లారీ గోడౌన్ ముందుకొచ్చి ఆగింది!" అన్నాడు వాలి.

"అది నా లారీ కాదు!" అన్నాడు అతను.

డాడ్జ్ కారు కదిలింది. XYZ కారులో కూర్చుని వాలి శరవేగంగా గోడౌన్ ముందుకు వెళ్ళాడు. అక్కడ లారీలేదు. గోడౌన్కి వేసిన రెండు తాళం కప్పలూ సవ్యంగా వున్నాయి.

వాలి టైమ్ చూశాడు. ఒంటిగంట దాటింది. కారులో కూర్చుని వాలి స్పీడుగా పోనిచ్చాడు. ఒక మందుల షాపు ముందు కార్ని ఆపి దిగాడు. లోపలకు వెళ్ళి టెలిఫోన్ రిసీవర్ని ఎత్తి ఒక నంబరు తిప్పాడు.

"హల్లో, కమీషనర్ కామత్ స్పీకింగ్!"

"మిస్టర్ కామత్, కరుణయ్య గోడౌన్ కి ఏ ప్రమాదమూ సంభవించలేదు," అన్నాడు వాలి.

"గుడ్ న్యూస్ సార్," అన్నాడు కామత్.

తను చూసిన కారు నంబర్ని వాలి చెప్పాడు.

"కామత్ భాయ్, ఆ కారు ఎవరిదో కనుక్కో! ఆ కారులో కూర్చున్న వ్యక్తి పెద్ద మనిషిలా వున్నాడు. అందుకని పోమ్మన్నాను!" అన్నాడు వాలి.

"కనుక్కుంటాను, సార్," అన్నాడు కామత్.

వాలి డబ్బు చెల్లించి తన కారువైపు నడిచాడు. కార్ని వేగంగా తన హోటల్ వైపు పోనిచ్చాడు. చల్లటి గాలి వీస్తోంది. హోటల్ కాంపౌండ్లో కారు ఆగింది.

వాలి తన గదికి చేరుకున్నాడు. చుట్ట పీలుస్తూ కుర్చీలో వాలాడు.

టెలిఫోన్ మ్రోగింది. అతను వెళ్ళి రిసీవర్ని ఎత్తి, "హలో!" అన్నాడు.

"వాలిగారూ, కరుపయ్యా గోడౌన్లోని సోప్సు స్టాకంతా మాయమైంది! లారీల్లో వేసుకుని వాళ్ళు పట్టుకు పోయారు," అన్నాడు కమీషనర్ కామత్.

"బాడ్ లక్," అన్నాడు వాలి.

# 10

"వాలిగారూ!" అన్నాడు కమీషనర్.

"చెప్పు!"

"ఆ కారు నంబరు హెల్త్ మంత్రిగారి కారుది!"

"దాన్నిబట్టి అది ఫాల్స్ నంబరని మనకు తెలుస్తోంది!" అన్నాడు వాలి.

"కరుపయ్యా గోడౌన్ని లూటీ చేసి స్టాకంతా పట్టుకు పోయిన వాళ్ళతో అతనికి సంబంధం వుండుండాలి!" అన్నాడు కామత్.

"యూ ఆర్ రైట్!"

"ఆ స్టాకంతా సివిల్ సప్లయిస్ కమీషనర్ స్వాధీనంలో వుంది. ముఖ్యమంత్రికి ఫోన్ కాలొచ్చింది. అంతా మునపటిలాగే జరిగింది. 93 పైసల రేటున ఆ సోప్సును ప్రజలకు కో ఆపరేటివ్స్ ద్వారా అమ్మబోతున్నారు!"

"ప్రజలకు ముఖ్యమైనవి తక్కువ ధరల్లో దొరుకుతున్నాయి! వాళ్ళను మెచ్చుకోవాలనిపిస్తోంది!" అన్నాడు వాలి.

"ముఖ్యమంత్రిగారు చాలా గాభరా పడ్తున్నారు. వాళ్ళు చేసేది మంచి పనైనా వాళ్ళ పద్ధతులు చెడ్డవి! భారతదేశంలోని పౌరుల ఆస్తి పాస్తులను కాపాడే బాధ్యత ప్రభుత్వానిది. గోడౌన్స్ లూట్ చేసి సరకును పంచి పెట్టడం న్యాయంకాదు!"

"యూ ఆర్ రైట్!" అన్నాడు వాలి.

"వాలిగారూ, రోజురోజుకీ అరాచకం ఎక్కువవుతోంది. హోల్ సేల్ వ్యాపారస్తులెందరో వాళ్ళ స్టాకును హోర్డ్ చేసుకుంటున్నారు. ఇటుపైన స్టాకును తెప్పించకూడదని వాళ్ళు తీర్మానించారు! అప్పుడు ప్రజల గతి ఏమవుతుంది? అంతేకాదు. ఈ పట్నంలో జరిగినట్టే రాష్ట్రంలోని ఇతర పెద్ద పట్నాల్లో సాగుతోంది! అంటే ఇక్కడి రహస్య సంస్థ తతిమ్మా పట్నాల్లో కూడా ఆపరేట్ చేస్తోందని మనం వూహించాలి! వాలిగారూ, మనం ఇప్పుడే వాళ్ళను ఆపకపోతే దేశమంతటా ఇటువంటి సంస్థలు రూపొందుతాయి. మన దేశంలోని వ్యాపార సంస్థలు చెల్లాచెదురౌతాయి. అరాచకం పెరిగి మన దేశాన్ని నాశనం చేస్తుంది!"

చుట్ట పీలుస్తూ కుర్చీమీద చేతులు ఆనించి వాలి కమీషనర్ వైపు చూశాడు.

"కామత్ భాయ్, వాళ్ళు మొదట ఫోన్ ద్వారా

వార్నింగ్ ఇచ్చి తర్వాత రెయిడ్ చేస్తున్నారు. వార్నింగ్ ఇవ్వగానే వ్యాపారస్తులు పోలీస్ రిపోర్టివ్వాలి. అప్పుడు మనం ఏదేనా చేసే అవకాశం లభిస్తుంది," అన్నాడు వాలి.

"పెద్ద వ్యాపారస్తులకు అలా చెయ్యమని హెచ్చరిక పంపుతాను. దాన్ని పాటించిన వాళ్ళకు మనం సహాయం చేయొచ్చు! దాన్ని నిర్లక్ష్యం చేసిన వాళ్లు నష్టపోతే తప్పు వాళ్ళదవుతుంది."

"వెంటనే అందర్నీ రహస్యంగా హెచ్చరించు." అన్నాడు వాలి.

కమీషనర్ బజర్ నొక్కాడు. పెర్సనల్ అసిస్టెంట్ గదిలోకొచ్చాడు.

## 11

కనకరాజు రిసీవర్ ఎత్తి, "హలో!" అన్నాడు.

"నువ్వు దాచిన గోధుమరవ్వ బస్తాలను బయట పెట్టి సరైన ధరల్లో వెంటనే అమ్మేటట్టు చూడాలి. రాత్రి పన్నెండు దాకా నీకు టైమిస్తున్నాం. అటుపైన నువ్వు మా శిక్షకు గురవుతావు!" అంది ఓ గంభీర కంఠం.

"మీ బెదిరింపులకు భయపడే మనిషిని కాను నేను!" అన్నాడు కనకరాజు.

కోపంగా రిసీవర్ని పెట్టేశాడు. వెంటనే కమీషనర్ ఆఫీసుకి ఫోన్ చేసి తనని బెదిరిస్తూ ఫోన్ కాల్ వచ్చిందన్నాడు. అతని పేరూ, గోడౌన్ అడ్రెసూ ఇచ్చాడు. తగిన బందోబస్తు సమకూర్చుతామని పోలీస్ కమీషనర్ కామత్ హామీ ఇచ్చాడు.

రాత్రి పన్నెండయింది. రెండు పోలీసు వాన్లు గోడౌన్ ముందు ఆగాయి. యాభైమంది కానిస్టేబుల్సు కిందకి

చూశారు. ఇన్‌స్పెక్టర్ నాయర్ వాళ్ళకు గంభీరంగా ఆర్డర్లిస్తున్నాడు. కానిస్టేబుల్సు గోడౌన్ ముందు పచార్లు చేస్తున్నారు.

పన్నెండున్నరైంది. **XYZ** కారును వాలి ఆపాడు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ వాలికి నవ్వుతూ నమస్కరించాడు.

"ఈసారి ఇంపాసిబుల్ సార్! ఎవ్వరూ గోడౌన్ దగ్గరకు రాలేరు," అన్నాడు నాయర్.

"బి ఎలర్ట్!" హెచ్చరించాడు వాలి.

* * *

కనకరాజు ఇంటి కాంపౌండులోకి కారు దూసుకుపోయి పోర్టికోలో ఆగింది. నిద్రపట్టక హాల్లో పచార్లు చేస్తూన్న కనకరాజు బయటకు పరుగెత్తుకొచ్చాడు.

కార్లోంచి నాలుగు పిస్టల్సు అతని వేపు గురిపెట్టబడ్డాయి. అతను గాభరాగా వెనక్కి తిరిగి లోపలకు పోబోతూన్నాడు. భయంకరమైన చప్పుడు చేస్తూ నాలుగు పిస్టల్సు ప్రేలాయి. కనకరాజు శరీరానికి తూట్లు పడ్డాయి. గావుకేక పెడ్తూ అతను గుమ్మంముందు వాల్లిపడ్డాడు. అనేక చోట్లనుంచి రక్తం చిమ్ముతోంది!

పోర్టికోలో ఆగిన కారు బయటకు దూసుకుపోయింది. లోపల్నించి రాజేశ్వరి బయటకు పరుగెత్తుకొచ్చింది. భర్తను చూసి ఆమె గట్టిగా అరిచింది. వెనుకనుంచి నౌఖర్లు, పక్కింటివాళ్ళు పరుగెత్తుకొచ్చారు.

కనకరాజు ముఖం రక్తమయంగా వుంది. రక్తంతో అతను ధరించిన పంచ, బనియన్ ఎర్రబడ్డాయి. పక్కింటి ఆసామి కనకరాజు స్థితిని చూసి వెంటనే పోలీస్ రిపోర్టిచ్చాడు.

* * *

కనకరాజు ఇంటిముందు, రోడ్డుమీద పోలీస్ జీప్, వాన్ ఆగివున్నాయి. జీప్ వెనకనే కారు ఆపి వాలి లోపలకు నడిచాడు.

విశాలమైన కాంపౌండు. పోర్టికోలో లైట్లు వెలుగుతున్నాయి. గుమిగూడిన మనుష్యుల మధ్యనుంచి వాలి ముందు వరండా మీదకు వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ గబగబా వచ్చి అతనికి నమస్కరించాడు.

నేలమీద పడున్న మనిషిని వాలి పరీక్షగా చూశాడు.

"కనకరాజు ఈయనే సార్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

వాలి వంగి దేహంవైపు చూశాడు. మూడు బుల్లెట్లు అతని శరీరంలోకి జొచ్చుకుపోయి వుంటాయి!

"నాయర్ భాయ్, ఇతని నేరాన్ని ఏమీ చేయలేక వాళ్ళు కసిని ఇతనిమీద ప్రదర్శించారు! ప్రజలకోసం పాటుపడే సంఘం హత్యల్లోకి దిగింది!" అన్నాడు వాలి.

శరీరంపక్కన కూర్చుని ఏడుస్తున్న రాజేశ్వరివైపు వాలి దీనంగా చూశాడు.

"అమ్మాయి, వాళ్ళు ఎంతమంది వచ్చారు?"

"ఏదో కాల్చినట్టు చప్పుడైంది సార్. నేను లోపల ఉన్నాను. నేను వచ్చేసరికి అంతా అయిపోయింది!" అందామె.

"ఆ కారుని నువ్వు చూశావా?"

"లేదండి!"

"మరెవరైనా చూశారా?" అడిగాడు వాలి, నలువైపులా చూస్తూ.

పోర్టికోలో నిలబడిన ఒకతను వాలిదగ్గరకొచ్చాడు.

"నేను పక్కింట్లో పనిమనిషిని, సార్. బీడీ కాలుస్తూ రోడ్డుమీద నుంచున్నాను. ఢాం ఢాం చప్పుళ్ళు విని

ఉలిక్కి పడ్డాను. బయటకు పోతున్న నల్ల అంబాసిడర్ కార్ను చూశాను!" అన్నాడతను.

"నంబర్ చూశావా?"

"నంబరు సరిగ్గా కనబడలేదు సార్!"

"కారులో ఎంతమంది వున్నారు?"

"అరడజన్ మంది వున్నారు సార్."

వాలి పోర్టికోలోకి దిగి దూరంగా వున్న గేటు బయటకు నడిచాడు. అన్నీ పెద్ద ఇళ్ళు. ఇంటి చుట్టూ కాంపౌండులు. ఆలోచిస్తూ వాలి వెనక్కి నడుస్తున్నాడు. పోర్టికో దగ్గరున్న పూల మొక్క పక్కన ఆగాడు.

నేలమీద ఏదో కాగితం కదుల్తోంది. దాన్ని తీసి చూశాడు.

"మమ్మల్ని ఎదిరించిన వాళ్ళకు ఇదే శిక్ష!

సేవ్ ది పీపుల్ సొసైటీ!"

అని పెద్ద అక్షరాల్లో ముద్రించి వుంది.

చీటీని పట్టుకుని వాలి గబగబా ముందు వరండా మీదకు అడుగులేశాడు.

# 12

తన పడక కుర్చీలో వాలి కూర్చుని చుట్ట పీలుస్తున్నాడు. ఎదురుగా సోఫాలో పోలీస్ కమీషనర్ కామత్ ఆశీనుడయ్యాడు.

"వాలిగారూ, కోయంబత్తూర్, సేలమ్, తంజావూర్ పట్నాల్లో గోడౌన్స్ మీద దాడిచేసి సాకును ఎత్తుకుపోయారు. ఆ సరుకు కలెక్టర్ల స్వాధీనంలో వుంది. వాళ్లు కో ఆపరేటివ్స్ ద్వారా ప్రజలకు అమ్మిస్తున్నారు!" అన్నాడు కామత్.

"ఇక్కడ తలెత్తిన సంఘం విస్తరించి రాష్ట్రమంతటా

తన కార్యక్రమాలను సాగిస్తోంది! ఇది మనం మొదట్లోనే అనుకున్నాం,'' అన్నాడు వాలి.

''కొన్ని సందర్భాలలో అహింస హింసకి దారితీస్తుంది. ఇక్కడ కనకరాజు ఘోరంగా హత్యచేయబడ్డాడు. ఇటు వంటి హత్యలు ఆ పట్నాల్లోనూ జరగొచ్చు!''

''సేవ్ ది షీప్స్ సంఘాన్ని మనం ఆపవలసిన సమయ మొచ్చింది. ఇంకా ఆలస్యం చేస్తే ప్రమాదం!'' అన్నాడు వాలి గంభీరంగా.

''ఎలా ఆపడం? ఎక్కడా క్లూస్ దొరకడం లేదు! ఇంత జరిగినా మన పరిశోధన ఒక్కడుగు ముందుకు వెయ్యలేక పోయింది!''

వాలి గంభీరంగా నవ్వాడు.

''కామత్ ఛాంప్. మనం ఒకేచోట నిలబడిపోయాం! నిజమే. కాని నిలబడిన వ్యక్తి అమాంతంగా దోషిమీదకు దూకగలడు!'' అన్నాడు వాలి.

''ఏదో తొందరగా చెయ్యాలి, వాలిగారూ! అసెంబ్లీలో ప్రశ్నలువేసి దుమారం లేపాలని కొందరు అపోజిషన్ సభ్యులు ఆలోచిస్తున్నారు!'' అన్నాడు కామత్.

''డోంట్ బాదర్, ఆఖరికి మనం నెగ్గుతాం! రాష్ట్రంలోని తదితర పట్నాలకు వెళ్ళి అక్కడ కొంత దర్యాప్తు చేసి వస్తాను,'' అన్నాడు వాలి, చుట్టపొగ దట్టంగా వదులుతూ.

''గుడ్ లక్ సార్!''

# 13

పంచ, ఖద్దరు జుబ్బా ధరించాడు కుప్పుశెట్టి. తెల్లటి గెడ్డం, తలమీద తెల్లటి జుత్తు! పొడుగ్గా, లావుగా వున్నాడతను. కొబ్బరికాయల వ్యాపారంలో అతను

లక్షలు గడించాడు.

కుప్పుశెట్టి తన ఏర్ కండిషండ్ గదిలో కూర్చున్నాడు. మార్కెట్ రిపోర్టులను చూస్తున్నాడు. టేబుల్ మీదున్న టెలిఫోన్ మ్రోగింది.

"హల్లో, కుప్పుశెట్టి కంపెనీ! ఎవరు కావాలి?" అడిగాడతను.

"అతనే కావాలి!"

"అయితే నేనే!"

"పట్నంలోని ప్రజలకు కొబ్బరికాయలు లేకుండా చేస్తున్నావు," అంటోంది గంభీర కంఠం.

"లేకేం, అమ్ముతున్నాం. కాయి రెండు రూపాయలు!"

"ఆ రేటున మన దేశంలో ఎంతమంది కొనగలరు?"

"నువ్వు చెప్పేది బాగుంది. దేశంలోని వాళ్ళందరూ కొంటే అమ్మడానికి నా దగ్గర స్టాకెక్కడిది! డబ్బున్నాళ్లు కొందరు కొనుక్కుంటారు!"

"మిస్టర్ కుప్పుశెట్టీ, నీ గోడౌన్ లో దాచిన స్టాకును పన్నెండు గంటల్లోగా ప్రజలకు కాయ రూపాయి చొప్పున అమ్మాలి! అలా చెయ్యకపోతే కొబ్బరికాయలు గాలిలో ఎగిరిపోతాయి!"

"నువ్వెవరివో గానీ, నీకు డజన్ కాయిలిస్తాను, పట్టుకుపో! నన్ను వదిలేయి!" అన్నాడతను.

"నా కోసం పాటుపడ్డం లేదు నేను. ప్రజలకోసం!"

"ప్రజల్ని చూడ్డానికి ప్రభుత్వముందిగా!"

"ప్రభుత్వం కదలకపోవడం వలన మేం రంగంలోకి దిగవల్సి వచ్చింది."

అవతలివైపున రిసీవర్ పెట్టేయబడింది. కుప్పుశెట్టి గాభరాగా బెల్ నొక్కాడు. అరవై ఏళ్ళ అయ్యర్ పరుగెత్తుకొచ్చాడు.

"అయ్యగారూ, వాళ్ళు నాకూ ఫోన్ చేశారు!"

"ఏమన్నారు?"

"కొబ్బరికాయలు గాలిలో ఎగిరిపోతాయన్నారు!"

"పిచ్చోళ్ళు, అంత బరువైనవి గాలిలో ఎలా ఎగురుతాయి, సార్!" అడిగాడు అయ్యర్ అమాయకంగా.

"ఒంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకుతూంటే నోరు విసుత్తా వేమిటి? ఇప్పుడు మనం ఏం చెయ్యాలి!" అడిగాడు కుప్పుశెట్టి.

"పోలీస్ రిపోర్టిద్దాం, సార్!"

"అదేదో తొందరగా కానీ!"

అయ్యర్ రిసీవర్ ఎత్తి నంబరు తిప్పి పోలీస్ రిపోర్టు చేశాడు. పేరూ, అడ్రెసూ వివరంగా చెప్పాడు.

"మీరు గాభరా పడకండి! పోలీసులను కాపలా పెడ్తాం." అన్నాడు ఇన్‌స్పెక్టర్ అటువైపునుంచి.

అయ్యర్ ధన్యవాదాలర్పించి రిసీవర్ పెట్టేశాడు.

"మరేం భయంలేదు, సార్. మన ఆఫీసు, గోడౌనుకు పోలీసోళ్ళు కాపలా వుంటారు. మన స్టాకును ముట్టుకునే అవకాశం ఎవ్వరికీ వుండదు!" అన్నాడు అయ్యర్.

"అయ్యర్, సాయంత్రం మూడు కొబ్బరికాయలు పట్టుకెళ్ళి కందస్వామి గుడిలో నా పేర అర్చన చేయించు! పోలీసుల బలానికి దైవబలం కూడా తోడుగా వుంటుంది!" అన్నాడు కుప్పుశెట్టి.

"అలాగే సార్." అన్నాడు అయ్యర్.

## 11

గోడౌన్ ముందు వందమంది కానిస్టేబుల్స్ పహారా కాస్తున్నారు. పోలీస్ కమీషనర్ కామత్ కారు ఆగింది. ఇన్‌స్పెక్టర్ నాయర్ కారు దగ్గరకొచ్చి కమీషనర్‌కి సెల్యూట్ చేశాడు.

"కుప్పుచెట్టి ఆఫీసు వెనక భాగంలో ఇల్లుందని విన్నాను. అక్కడ మన వాళ్ళను కాపలా వుంచారా?"

"వుంచాం సార్!" అన్నాడు నాయర్.

కమీషనర్ నలువైపులా చూసాడు. గోడౌన్ మీద దాడి చెయ్యడం సాధ్యంకాదు!

"వాలిగారు ఇంకా రాలేదు, సార్!" అన్నాడు నాయర్.

"ఆయన రాష్ట్రంలోని తదితర పట్నాలకు వెళ్ళుంటారు!"

పోలీస్ కమీషనర్ కారు కదిలింది. కుప్పుచెట్టి ఇంటి ముందునుంచి కారు మెల్లిగా వెళ్తోంది. అక్కడ కాపలా వున్న వాళ్ళవైపు కమీషనర్ తృప్తికరంగా చూశాడు.

పన్నెండు దాటింది. కుప్పుచెట్టి ఇంటి ముందు ఒక పాత అంబాసిడర్ కారు ఆగింది. నలుగురు మొగాళ్ళు, ముగ్గురు స్త్రీలు కిందకి దిగారు. ఆడవాళ్ళ చేతుల్లో మూటలున్నాయి. నలుగురు మొగాళ్ళకూ తలమీద వెంట్రుకలు లేవు. నున్నగా గీసిన బోడిగుళ్ళు!

తిరపతి వెళ్ళి వస్తున్నట్టున్నారు!

"వాళ్ళు చుట్టాలై వుండాలి!" అన్నాడొక కానిస్టేబుల్.

వాళ్ళను గురించి కానిస్టేబుల్సు అంతగా పట్టించుకోలేదు!

వాళ్ళు తలుపును తట్టారు. అయ్యరు తలుపు తెరిచి వాళ్ళకేసి విచిత్రంగా చూశాడు.

"మావయ్య వున్నారా?" అందొక స్త్రీ.

"కుప్పుచెట్టి బావ!" అంది మరో స్త్రీ.

అయ్యర్ వెనకనే వాళ్ళు ఏర్ కండిషండ్ గదిలోకి ప్రవేశించారు. వాళ్ళకేసి కుప్పుచెట్టి ఆశ్చర్యంగా

చూశాడు.

కాలి కిందనున్న బటన్ నొక్కాడు!

నల్గురు మొగాళ్ళ చేతుల్లోనూ పిస్టల్స్ మెరుస్తు న్నాయి. ట్రిగ్గర్స్ మీదకి వేళ్ళు కదులుతున్నాయి.

కుప్పచెట్టి తల్లోలున చెయ్యి ఎత్తాడు. నాలుగుసార్లు వాయువేగంగా పిస్టల్‌తో షూట్ చేశాడు. వాళ్ళ చేతుల్లోని పిస్టల్స్ ఎగిరి దూరంగా పడ్డాయి.

"కదలకండి! కదిలితే చస్తారు!" అరిచాడు కుప్పచెట్టిలా నటించిన వాలి.

అతని గంభీర కంఠాన్ని విని వాళ్ళు అలాగే నిలబడి పోయారు. వెనక్కి తిరిగారు. పోలీసు కానిస్టేబుల్సు లోపలకు జొరబడ్డారు.

"వాళ్ళందర్నీ పట్టుకోండి!" అరిచాడు వాలి.

మొగాళ్ళకూ, ఆడాళ్ళకూ బేడీలు వేయబడ్డాయి.

"వాళ్ళను తీసుకెళ్ళి కారులో కూర్చోబెట్టండి," అన్నాడు వాలి.

కానిస్టేబుల్సు వాళ్ళను బయటకు లాక్కుపోయారు. వాళ్ళ పిస్టల్సును సబిన్‌స్పెక్టర్ రామన్ గుడ్డల్లో చుట్టి బాగ్‌లో పడేసుకున్నాడు.

పక్క గదిలోకి వెళ్ళాడు వాలి.

తన సూటూ, బూట్లూ ధరించాడు. హాయిగా నిద్ర పోతున్న కుప్పచెట్టిని మెల్లిగా తట్టి లేపాడు.

"ఇటుపైన నువ్వు బెంగ లేకుండా పడుకోవచ్చు! వాళ్ళు మాకు పట్టుబడ్డారు. కాని కొబ్బరికాయల ధర తగ్గించు" అన్నాడు వాలి నవ్వుతూ.

* * *

పాత హడ్సన్ కారు వెనకనే పోలీస్ జీప్, వాన్ వస్తున్నాయి.

"ఎక్కడి కెళ్ళాలి? మీ రహస్య స్థావరం ఎక్కడ?"

"తెలియదు!" అర్చాడు ఒకతను.

వాలి అతని చెయ్యిని మెలితిప్పాడు. నొప్పితో అతను అరుస్తున్నాడు.

"ఎక్కడ?" అర్చాడు వాలి.

"ఇంకా ముందుకు వెళ్ళాలి!"

ఒక పెద్ద కాంపౌండులోకి కారు వెళ్ళింది. వెనకనే జీప్, వాన్ లోపలకు ప్రవేశించాయి. వాలి కిందకి దూకాడు. వాన్ లోంచి కిందకి వురికిన సాయుధపోలీసులు ముందువరండా మీదకు పరుగెత్తారు.

వాలి తలుపును తట్టాను. కాస్సేపట్లో తలుపు తెరవ బడింది. ఎదురుగా నిలబడిన పచ్చటి వ్యక్తికేసి వాలి సూటిగా చూశాడు. ఆనాడు డాడ్జి కారులో తను చూసిన సేట్ గోకులదాస్!

అతను నవ్వుతూ వెనక్కి జరిగాడు.

"వాలిగారూ!" అన్నాడతను.

వాలి ముందుకు వెళ్తున్నాడు. అతను సోఫాలో కూలబడ్డాడు.

"మేం ఎప్పుడో అప్పుడు మీ చేతుల్లో పడ్తామని నాకు తెలుసు!" అన్నాడతను.

"సేవ్ ది పీపుల్ సొసైటీ మంచిగా ప్రారంభమై హత్యల్లోకి దిగింది!" అన్నాడు వాలి.

సేట్ గోకులదాస్ తన ముఖాన్ని కప్పిన మాస్కును తీసేసి ప్రక్కగా విసిరాడు. అందరూ అతనికేసి ఆశ్చర్యంగా చూశారు.

ప్రఖ్యాత రాజకీయవేత్త, ఎమ్.పి. మధుసూదన్!

"వాలిగారూ, సమద్దేశంతో సేవ్ ది పీపుల్ సొసైటీని స్థాపించాను. వుద్యోగాలు లేనివాళ్ళెందరోన్ని సభ్యులుగా చేర్చాను. చీకట్లో దాచిన స్తాసుని వెలుతుర్లోకి తెచ్చి ప్రభుత్వానికి అందజేయాలని నా ఆశ. మొదట్లో అలాగే జరుగుతూ వచ్చింది. నాకు తెలియకుండా కనకరాజును వాళ్ళు చంపారు. అతడ్ని భయపెట్టి వదిలేయమన్నాను. నా ఆజ్ఞను కొందరి యువరక్తం పాటించలేక పోయింది. ఆవేశాలకు లోబడి అతడ్ని చంపేశారు! ప్రజలకోసం పాటుబడే ఈ సంస్థను మూసేద్దామనుకుంటున్నాను. అది జరిగేముందు మీ చేతిల్లో చిక్కుకున్నాం. ఒకప్పుడు జెయిల్లో ఏళ్ళ తరబడి కూర్చున్న నాకు జెయిలు శిక్షంటే భయం లేదు. వాలిగారూ, నేను మీకు లొంగిపోతు న్నాను" అన్నాడు మధుసూదన్.

# 15

సేవ్ ది పీపుల్ సొసైటీ సభ్యులందరూ అరెస్ట్ చేయ బడ్డారు.

పోలీస్ కమీషనర్ ఆఫీసు ముందు వాలి కార్ను ఆపి గబగబా అతని గదిలోకి వెళ్ళాడు.

కమీషనర్ కామత్ నవ్వుతూ అతనితో కరచాలనం చేశాడు.

"కామత్ భాయ్, నిలబడిన వ్యక్తి దోషిమీదకి అమాం తంగా దూకొచ్చాన్నాను! ఒప్పుకుంటావా?" అడిగాడు వాలి.

"యూ ఆర్ రైట్, వాలిగారూ! మీరు ఏ కోయం బత్తూరో వెళ్ళారనుకున్నాను. మీరు రంగంలో వున్నారని విని ఆశ్చర్యపోయాను!"

"కామత్ భాయ్, కథల్లోలాగే మనం చేసే కార్య

క్రమాలకు కొంత సస్పెన్స్, కొద్దిగా మిస్టరీ వుంటే మంచిదికి?" అన్నాడు వాలి నవ్వుతూ.

వాలి కుర్చీలో కూర్చొని ఎదురుగా వున్న కామత్ కేసి చూశాడు.

"కామత్ భాయ్, నేవ్ దిపీపుల్ సొసైటీలో మొత్తం నూటయాభై మంది సభ్యులున్నారు. యాక్టివ్ గా పనిచేసే వాళ్ళు యాభైమంది. ఆ యాభైమందిలో ఆరుగురు కనక రాజు ఇంటికి వెళ్ళి అతడ్ని చంపారు. కొందరు స్త్రీలు కూడా ఈ సొసైటీలో మెంబర్లు!" అని ఆగాడు వాలి.

"కోయంబత్తూర్, సేలం, తంజావూరులోని సభ్యులను ఈపాటికి అక్కడి పోలీసులు అరెస్టు చేసుంటారు. చీడలా వ్యాపిస్తున్న ఈ సంఘం పూర్తిగా ధ్వంసం చేయబడింది.

అటువంటి వాళ్ళు ఈ పట్నంలో తలెత్తకుండా నువ్వు జాగ్రత్త పడాలి!" అన్నాడు వాలి.

"వాలిగారూ, అంత గొప్ప రాజకీయవేత్త, దేశ భక్తుడు మధుసూదన్ ఈ సంస్థకు స్థాపకులవడం ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు పోలీస కమీషనర్ కామత్.

"కామత్ భాయ్, మధుసూదన్ సరైన మార్గంలో ఈ సంస్థ నడుస్తుందని అనుకున్నాడు. అనేకమంది అందులో వుండడం వలన అది వక్రమార్గాన్న పడింది. మునుపు గాంధీజీ అహింసా విధానంలో ఏదో వుద్యమాన్ని ప్రారంభించేవారు. కొంత కాలమయ్యేసరికి అది హింస కాండల్లోకి దిగేది. వెంటనే గాంధీజీ తన వుద్యమాన్ని మానుకునేవారు! ఇది గాంధీజీ కాలం కాదు! బట్ హిస్టరీ రిపీట్స్ ఇట్ సెల్ఫ్!" అన్నాడు డిటెక్టివ్ వాలి.

—: ఐపోయింది :—

# ఆపదలు కాచుకొని వుంటాయ్!

ఏ. వీ. మోహన్రావ్

హౌరా-మద్రాసు మెయిల్ విజయవాడ ప్లాట్ ఫాం పైన ఆగింది.

ఏ.సీ. కూపే తెరచి, క్రిందకు దిగింది మంజుల. పెద్ద పెద్ద పూల నైట్ గౌన్ తొడుక్కుని వుంది.

“మాడమ్! ఏం కావాలి?” అడిగాడు అటెండరు.

“బుక్ స్టాల్ ఎటుకేసి వుంది” అడిగింది మంజుల. ఆమె మెళ్లో వజ్రాల నెక్లెసు మెర్క్యురీ దీపాల వెలుగులో తళతళ లాడింది. ఎడంచేతి వేలికున్న రవ్వల వుంగరం ధగధగ లాడింది.

“స్టాల్ దూరంగా వుంది. ఏం కావాలో చెప్పండి తెస్తాను!” వినయంగా అడిగాడు అటెండెంటు. అలాంటి

ఖరీదైన ఆడవాళ్ళకు ఎలాంటి సర్వీసు చేసినా వృధా పోదని అనుభవంమీద తెలుసు అతనికి.

"నో. నేను వెళ్తాను. పది నిమిషాల్లో వచ్చేస్తాను. ఇక్కడే నిలుచుని చూస్తుండు!" అంది మంజుల, ముందుకు కదలబోతూ.

"అలాగే!" తలూపి నిలబడ్డాడు అక్కెందరు.

హిగిన్ బాథమ్స్ స్టాల్ ముందు నిలబడింది మంజుల. అందరూ ఆమెనే చూడసాగారు. మంజుల అందంగా వుంటుంది. వయస్సు నలభైదాకా వున్నా జాగ్రత్తగా మేకప్ చేసుకుని ముప్ఫైయికి మించనట్లుగా కనిపించడానికి అ స్తమానం తంటాలు పడుతూంటుంది.

"ఏం కావాలి మాడమ్!" అడిగాడు స్టాల్‌లో వున్న మనిషి.

"ఎనీ హాట్ బుక్స్!" అడిగింది చిన్నగా.

"సారీ! వుయ్ డోంట్ సెల్ దట్ స్టఫ్!" అన్నాడు నవ్వుతూ.

"ఓ.కే!" అంటూ నాలుగైదు మాగజైను తీసుకుని, స్కిన్ లెదర్ పర్స్ తెరిచి పదిరూపాయల నోటు అందించింది. అతను లెఖచూసి, మిగిలిన చిల్లర అందించాడు. మంజుల అందుకుని వెనక్కి తిరిగింది.

తెల్లటి యూనిఫాంలోవున్న టిక్కెట్ కలెక్టర్, లావుగా, ఎత్తుగావున్న ఒక కుర్రాడి కాలర్ పట్టుకుని అతనేదో చెబుతుంటే వింటున్నాడు. వాళ్ళిద్దర్నీ పట్టించుకోకుండా జనం అటూ, ఇటూ హడావుడిగా పరుగెత్తసాగారు.

మంజుల కాస్త ముందుకు నడిచి వాళ్ళకు దగ్గరగా జరిగింది.

"తిండి తిని ఆరగోజులయింది. పనికోసం విజయ

వాడంతా తిరిగాను. దొరకలేదు. లాభంలేదని మద్రాసుకు పోదామనే వచ్చాను. టిక్కెట్ కొనేందుకు డబ్బులు లేవు. నన్ను జెయిలుకు పంపండి. అక్కడన్నా హాయిగా తిండి దొరుకుతుంది" అంటున్నాడు కాలరు వీడక.

"నీలాంటి రాస్కెల్స్‌ను చాలామందిని చూశాను. డబ్బెక్కడో దాచిపెట్టి వుంటావ్. మర్యాదగా తీసి యివ్వు. లేకుంటే జెయిల్లో తోయిస్తాను" అన్నాడు టి.సి. కటువుగా కాలరుపైని పట్టు వదలకుండా.

మంజుల అతన్ని చూసింది. మంచి ధృడమయిన శరీరం. మనిషి అందంగాకూడా వున్నాడు. వయస్సు ఆట్టె వుండదుకూడా. రెండు నిమిషాలు మనస్సులోనే ఏదో మథనపడింది. తర్వాత ఏదో నిర్ణయం చేసుకున్నట్లు వాళ్ళ దగ్గరకు నడిచింది.

"ఏయ్! మిస్టర్ టి.సీ" పిలిచింది మంజుల.

టిక్కెట్ కలెక్టర్ వెనక్కి తిరిగాడు. మంజుల వేషం, దర్జా చూసి ఖంగుతిన్నాడు.

"ఏమిటతన్ని అలా పట్టుకున్నావ్!" అడిగింది అధికారికంగా.

"టిక్కెట్ లేదండీ! అందుకు..."

"అతను నాకు తెలుసు. మద్రాసుకు టిక్కెట్ రాసివ్వు" అంటూ వందరూపాయల నోటు విసిరింది.

టి.సి. అతని పట్టువదిలేసి "సారీ! మేడమ్!" అంటూ గబగబ ఎర్ర రసీదు పుస్తకం తీసి రాయసాగాడు.

"థాంక్ యూ మేడమ్!" అన్నాడతను.

అతన్ని గమనించనట్లుగానే "ఆ రసీదూ చిల్లరా తీసుకుని బండెక్కు. సెంట్రల్‌లో నన్ను కలువు. ఓ.కే." అంది మంజుల.

"ఓ.కే. మేడమ్!" అన్నాడతను.

మంజుల నకనకా తన కుపేవైపు వెళ్ళిపోయింది.

"ఎవరోయ్ ఆమె? చాలా డబ్బున్నదానిలా వుంది. అడిగాడు టీ.సీ. రషీదు రాస్తూనే.

"మా నాన్నగారి ఫ్రెండ్ భార్య. పది కోట్లకు వుంటుందేమో.ఆమె మరిదిగారేనయ్యా మీ రైల్వేమంత్రి" అవకాశం దొరికేంది గనుక చెప్పాడు.

రషీదు రాయటం ఆపి, ఉలిక్కిపడ్డాడు.

"త్వరగా రాసివ్వు" అన్నాడతను.

"నీ కాలరు పట్టుకోవటం ఆమె చూసింది. నేను ప్రయాణీకులతో అసభ్యంగా ప్రవర్తిస్తున్నానని మరిదిగారైన మంత్రిగారితో చెప్పి ఉద్యోగం ఊడబీకిస్తుందేమోనని భయంగా వుందోయ్!" అన్నాడు టి.సి.

"నీకా గొడవలేకుండా నేను చూస్తానులేవయ్యా!" అంటూ రషీదూ, మిగిలిన చిల్లర అందుకున్నాడు. టి.సీ. బలవంతంచేసి వద్దంటున్నా వినకుండా అతనికి కాఫీ ఇప్పించాడు.

"నీ పేరేమిటన్నావ్" అడిగాడు టీ.సీ.

"రూపర్!" అన్నాడు.

"నీ అడ్రసు రాసివ్వవోయి. ఏదైనా అవసరముంటే వస్తాను" అన్నాడు టీ.సీ.

"ఇప్పుడమ్మగారు చూశారుగా. ఇంక మళ్ళీ ఇంటికి తీసుకుపోతుంది. నేనెక్కడ తిరుగుతానో, ఎప్పటికి నూ పూరు చేరుతానో నాకే తెలీదు. అందువల్ల నీ అడ్రసు రాసివ్వు. ఇల్లుచేరాక ఉత్తరం రాస్తాను" అన్నాడు రూపర్.

టి.సీ. అడ్రసు రాసిచ్చాడు.

రైలు కదలబోయింది.

రూపర్ స్లీపర్ కంపార్టుమెంటులో కెక్కి పడు

కున్నాడు.

మంజుల డోర్ మూసి లాక్ చేసి లైటు వెలిగించింది. బెర్త్ కెదురుగా కంపార్టుమెంట్ కు బిగించివున్న పెద్ద అద్దంలో మొఖం చూచుకొంది. నల్లటి, ఎత్తైన నొక్కుల జుట్టు, విశాలమైన నుదురు, పెద్ద పెద్ద కళ్ళు, చక్కటి ముక్కు, చిన్ననోరు, గుండ్రని గడ్డం, అన్నీ అందంగానే కనుపించాయి. కాకపోతే కళ్ళకింద నల్లచారలున్నాయి. అవే తన వయసును పట్టిస్తున్నాయి.

పంటచేనులా వొంటినిండా వుంది యవ్వనం. కాని భర్త ముసలిపీనుగు. అతనికి కావలసినంత డబ్బుంది. మంజుల సుఖంకోసం వెనకా ముందూ చూడకుండా ఎంతయినా ఖర్చుపెట్టే తెగింపు వుంది. ఆమెకు కావలసింది అదిగాదు. తన అందాన్ని జుర్రుకోగల మగవీరుడు కావాలి. ఆ అనుభవం తీపి, ఆమెకు పెళ్ళికాక ముందు తెలుసు. పెళ్ళయ్యాక అంతసుకి భయపడి, ఆస్తి పోతుందన్న కలవరంతో కోరికలకు పగ్గాలు వేసుకుని బ్రతుకుతోంది.

మంజులకు అంతకుముందు తను డబ్బిచ్చి టిక్కెట్ కొనిచ్చిన కుర్రాడు గుర్తొచ్చాడు. అందంగా లేకున్నా బలంగా వున్నాడనుకుంది. అతన్ని రెండు దినాలు, అంటే భర్త మద్రాసులో దిగేదాకా హాయిగా వాడుకోవాలి. అతని పేరడగనందుకు నొచ్చుకుంది. అలాగే తన పేరూ అతనికి చెప్పలేదు. మద్రాసులో దిగాక అతను కనిపిస్తాడో లేదోనన్న అనుమానం వేధించింది.

అతన్ని తలచుకుంటుంటే నిద్ర రాలేదు. బండి ఆగగానే వెళ్ళి కూపేలోకి పిల్చుకొచ్చుకుందామా అన్నంత తపన పుట్టింది మంజులకు. ఎవరన్నా చూస్తారేమోనన్న భయంతో ఆ ప్రయత్నం విరమించుకుంది.

సూట్ కేస్ లోంచి ఒక ఇంగ్లీషు పాకెట్ బుక్ తీసి చదువసాగింది. దానిలోని వింత వింత సీన్లు తలచుకొని, వాటిల్లోవున్న అమ్మాయి తనుగానే ఊహించుకుంటూ, మెల్లగా మత్తు నిద్రలోకి కరిగిపోయింది మంజుల.

## 2

మెయిల్ మద్రాసు సెంట్రల్ లో ఆగింది.

మంజుల క్రిందకు దిగింది.

"గుడ్ మార్నింగ్!" వెనుకనుంచి ఎవరో విష్ చేశారు. తల త్రిప్పి చూసింది. అతనే! నిలబడి వున్నాడు. గుబురు గడ్డం, మాసిపోయిన పాంటు, చొక్కా, చిరిగిపోయిన కాన్వాసు బూట్లు. చొక్కా బొత్తాలు ఊడిపోయి వున్నాయి. అందులోంచి వెడల్పాటి ఛాతీ అందంగా కనిపించింది.

"మార్నింగ్!" అంది మంజుల.

"థ్యాంక్స్! మీరు ఆదుకోకుంటే నన్నతను జయిలుకు పంపేవాడు. మీరు ఇచ్చిన వంద రూపాయల్లో టిక్కెట్ పోను, మిగిలిన చిల్లరిదిగోనండి" అన్నాడు అతను.

"నువ్వేం ఖర్చు పెట్టుకోలేదా?"

"మీరు చెప్పలేదుగా?"

"సారీ! ఆ డబ్బు నీకే. ఉంచుకో!"

"నాక్కొద్దు! అలా తీసుకోవడం నాకుపడదు. మీ సామాను తెచ్చి టాక్సీలో పెడతాను. రెండు రూపాయిలివ్వండి. చాలు!" అన్నాడు అతను.

"నీ పేరు?" అడిగింది మంజుల.

"కుమార్!" చెప్పాడతను.

"ఏం చేస్తుంటావ్?"

"ఏం చేస్తానో నాకే తెలీదు. నాకు తిని తిరగడం తప్ప మరేమీ తెలీదు."

"కారు డ్రైవింగ్ తెలుసా?"

"తెలుసు. మీకు కారుందా?"

"ఒకటి కాదు! ఇక్కడే మూడు కార్లున్నాయి. ఒక డ్రైవరు వున్నాడు. అతనికీమధ్య ఒంట్లో బాగుండటం లేదు. నీకు వేరే ఎక్కడా పని దొరకదనుకుంటే వచ్చి చేరు. నెలకు నూట పాతిక రూపాయలిస్తారు జీతం. భోజనం వగైరా పెడతారు" అంది మంజుల.

"థాంక్స్! మేడమ్ మీరు అనవసరమైన శ్రమ తీసుకుంటున్నారేమో?" అడిగాడు కూపర్.

"నో! అలాంటిదేమీ లేదు. నిన్ను చూస్తే మంచి వాడిలా కనుపిస్తున్నావ్. అందుకే నేమో సాయం చెయ్యాలనిపిస్తూంది" అంది మంజుల.

"అయితే మిమ్మల్ని ఎప్పుడు ఎక్కడ కలుసుకోవాలో చెప్పండి" అడిగాడు కూపర్.

"నీకు హోటల్ ఓబ్రా తెలుసా?" అడిగింది మంజుల.

"విన్నాను."

"మౌంట్ రోడ్ లో వుంది. పదిగంటల ప్రాంతంలో రా. రిసెప్షన్ లో మిసెస్ డాక్రియా అని అడుగు. రూం నెంబరు చెపుతారు. తిన్నగా వచ్చెయ్యి. ఈలోగా కావు హోటల్ కు తెచ్చిస్తాను" అంది మంజుల.

"థాంక్స్! ఈ డబ్బు..." అంటూ అందివ్వబోయాడు కూపర్.

"నీ దగ్గరే వుంచుకో. కావాల్సింది ఖర్చుపెట్టుకో. ముందు ఒక జత మంచి బట్టలు కట్టుకో. ఎక్కడన్నా చిన్న హోటల్ లో రూం తీసుకుని స్నానం చేసి శుభ్రంగా తయారై ఆ తర్వాత రా ఓబ్రాకు" అంది మంజుల.

"అలాగే మేడమ్!" తలూపుకుని అన్నాడు కూపర్.

మంజుల టాక్సీ ఎక్కి "పోనీ" అంది.

టాక్సీ ముందుకు సాగిపోయింది. కూపర్ చూస్తూ నిలుచున్నాడు.

హోటల్ ఓబెరాయ్ లో మంజులకు మంచి పేరుంది. ఆమె ఎప్పుడు మద్రాసు వచ్చినా అక్కడే దిగుతూంటుంది. ఆ హోటల్ లో మేజర్ షేర్స్ ఆమె భర్తకున్నాయి. ఆమె బస చేసిన కొన్ని గంటలు అందరూ భయంభయంగా పని చేస్తుంటారు.

టాక్సీ రిసెప్షన్ వద్ద ఆగింది. మంజుల దిగింది. కౌంటర్ లో వున్న వ్యక్తి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

అతన్ని చూసి నవ్వి తిన్నగా వెళ్ళిపోయింది ఎలివేటర్ వైపు మంజుల. ప్రొప్రయిటర్ కోసం ఏడో అంతస్తులో ఒక ఫ్లాట్ ఎప్పుడూ ఖాళీగా వుంచి పెడతారు. రెండు బెడ్ రూంలు, ఒక హాలు, అటాచ్డ్ బాత్ రూంలు, లేవెట్రీలు, వున్నాయి. విండో దగ్గర కుర్చీ వేసుకుని కూర్చుంటే దాదాపు మద్రాసు నగరమంతా కనుపిస్తూ వుంటుంది. ఆ గదంటే మంజులకు చాలా ఇష్టం.

స్నానపానాదులు ముగించుకొని, డ్రెస్ చేసుకుంది మంజుల. బాయ్ తెచ్చిన టిఫిను తిని సోఫాలో కూర్చుంది. ప్రక్కనేవున్న వెడల్పాటి రోడ్ లో రకరకాల కార్లు పరుగెడుతున్నాయి. వాటిమీద ఎంత ప్రయత్నించినా ఆమె దృష్టి నిలబడలేదు. ఆమెకు కూపర్ గుర్తుకు వంస్తాగాడు.

అంతలోనే ఆమెకు అనేక రకాల అనుమానాలు కలగసాగాయి. ఓమాదు సమయిచ్చాక, ఇలాంటివాళ్ళు తనపై అత్యాచారం చెయ్యబోవటానికి ప్రయత్నించటవెూ, లేదా అదేపనిగా డబ్బు ఇమ్మని అడగటమో, ఇవ్వకుంటే పది మందికీ చెప్పిఅల్లరి పెడతానని భయపెట్టడమో చేస్తుంటారు. అటువంటి పరిస్థితి మాత్రం తను రానివ్వదలచుకోలేదు.

మంజుల భర్త డాల్మియాకు ఎంత డబ్బుందో, అంత తెలివిగూడా వుంది. డబ్బై సంవత్సరాల వయసులో పెళ్ళాడాడు మంజులను. ఆమెను తను శారీరకంగా సుఖ పెట్టలేనని తెలిసిగూడా ఆమె ఆకర్షణకు లొంగి, తట్టుకో లేక పెళ్ళాడాడు. ఆమె తన కోరికను తీర్చుకునేందుకు అడ్డమైన వాళ్ళకు శరీరాన్ని అప్పగించటం ఊహించి, అలా జరగకుండా వుండేందుకు ఏదైనా ఘట్టి కట్టుబాటు చెయ్యాలని, ఆలోచించసాగాడు. అతనికి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. వెంటనే వీలునామా రాశాడు. దాని ప్రకారం, మంజులకు, అతని తదనంతరం సగం ఆస్తి వస్తుంది. కానీ ఆమె మరే మగాడితోనన్నా సంబంధం పెట్టుకున్నట్లు ఋజువు అయితే, ఆమె వాటా మొత్తం దేశరక్షణ నిధికి చెందుతుంది. ఆ క్లాజు తెలుసుకొని మండి పడింది మంజుల. అతన్ని పెళ్ళాడేటప్పుడు చేసుకున్న ఊహాలన్నీ తారుమారయినందుకు విచారించింది.

అది మొదలు ఎవరైనా మగాళ్ళు మరీ దగ్గరగా వచ్చినా, చనువుగా ప్రవర్తించబోయినా బెదరిపోయేది. ఆ డబ్బూ, అది ఇచ్చే సుఖం, సెక్యూరిటీ అనుభవించడం మొదలెట్టాక, ఎలా అది లేకుండా బ్రతకాలో ఆమెకు అర్థంకాలేదు.

కూపర్ కుర్రవాడు. మంచి వయసు జోరులో వున్నాడు అతన్ని డ్రైవరుగా పెట్టుకోవాలి. రెండు దినాలు మాత్రమే. డాల్మియా వస్తాడు. అతను చూశాడంటే అను మానిస్తాడు. కలకత్తాలో బంగళా కాప్లు నడిపేవాళ్ళంతా ముసలి వెధవలే. ఈ రెండు దినాల్లో కూపర్ దగ్గర పొంద గలిగినంత శారీరక సుఖం పొందాలి. ఆ తర్వాత డబ్బిచ్చి పంపెయ్యాలి.

లేచి వెళ్ళి అద్దంలో చూసుకుంది. తనకుతనే ముద్దొచ్చే

ట్లుంది.ఇప్పుడు కూపర్ వస్తే...అనుకొని మురిసిపోయింది.

కార్నర్ స్టూల్ పైనున్న బ్లూ కలర్ ఫోన్ మ్రోగింది. మెల్లిగా వెళ్ళి రిసీవరు తీసుకుంది.

"హల్లో! నేను డాల్మియాగారి సెక్రెటరీని. ఢిల్లీనుండి మాట్లాడుతున్నాను" అంది అమ్మాయి అవతలవేపునుండి. ఆమెను మంజులకు తెలుసు. పేరు లీనా.

"యస్. లీనా నేను మంజులను. ఏమిటి విశేషాలు?" అడిగింది అక్కడే వున్న కుర్చీలో కూర్చుంటూ.

"మీరు సుఖంగా చేరారా?"

"ఆ!"

"మిస్టర్ డాల్మియా ఎల్లుండి రాత్రికి మద్రాసు వస్తామని చెప్పమన్నారు. ఆ మరుసటి దినం కార్లో ఊటీకి వెళ్తారట. మిమ్మల్నికూడా పనులన్నీ ముగించుకుని సిద్ధంగా వుండమని చెప్పమన్నారు మేడమ్!"

"ఓ. కే. ఐవిల్ బి రెడీ!" అంది మంజుల.

"థాంక్స్!" అంటూ ఫోన్ కట్ చేసింది.

మంజులకు మద్రాసులో బంగళా వుంది. మామూలుగా దాన్ని ఉపయోగించరు. వచ్చినప్పుడు హోటల్లోనే మకాం పెడుతూంటుంది.

కానీ ఈ మారు బంగళాకు వెళ్దామనిపించింది. కూపర్తో హోటల్లో గడపడం ప్రమాదం కొని తెచ్చుకోవడమవుతుందని ఆమెకు తెలుసు. ఎవరికంటనన్నా తన రాసలీలలు పడితే, వాళ్లు డాల్మియాకు ఆ సమాచారం అందిస్తారు. దాంతో అతను తనకు విడాకులిచ్చి పంపుతాడు.

బంగళాకు ఫోన్ చేసింది. పనివాడొక్కడే వుంటాడక్కడ, అతను పలికాడు. తను మరో గంటలో వస్తానని చెప్పి, రిసీవరు క్రేడిల్ పైన పడేసింది.

మనస్సులోనే కూపర్‌ను ఎలా లొంగదీసుకోవాలో, ఎలా అతని ద్వారా తన అవసరాలు తీర్చుకోవాలో ఆలోచించుకుంటూ కూర్చుంది మంజుల.

# 3

కాలింగ్ బెల్ గణగణ మంది.

మంజుల ద్వారంకేసి చూస్తూ "కమిన్" అంది.

తలుపు నెట్టుకుని లోనికొచ్చి మంజులకు దూరంగా నిలబడ్డాడు కూపర్.

చాక్‌లెట్ రంగు జీన్స్‌పాంటు, తెల్లషర్టు ఇన్ చేసుకొచ్చాడు. గడ్డం మాత్రం తీయలేదు.

మంజుల అతన్ని క్రిందినించి పైకి పరీశీలనగా చూసింది.

కూపర్ తన్నుతనే చూసుకుని తలొంచుకుని నిలబడ్డాడు.

"గుడ్! యూ ఆర్ రియలీ లాలీ!" అంది మంజుల.

"నన్ను అనవసరంగా పొగడుతున్నారు. మీ సాయానికి కృతజ్ఞుణ్ణి" అన్నాడు కూపర్.

"వద్దు! నాకు నువ్వు బుణపడ్డావ్. అది తీర్చుకునే దారి చూపిస్తాను. తీర్చుకుంటావా?" అడిగింది మంజుల.

"తప్పకుండా! చెప్పండి మేడమ్!" అన్నాడు కూపర్ ఉత్సాహంగా.

"చెప్తాను కానీ చెప్పకుండానే, త్వరలోనే తెలుసుకుంటావ్. నా కొక్క ఫ్రెండ్ బంగళా వుంది. వెళ్ళి చూసి రావాలనుకుంటున్నాను. నువ్వు క్రింద కెళ్ళి రిసెప్షనులో నా పేరు చెప్పు. ఒక కారు ఇస్తారు. దాన్ని తెచ్చి పోర్టికోలో వుంచు. నేను డ్రెస్ మార్చుకుని వస్తాను" అంది మంజుల.

"అలాగే!" అంటూ సెల్యూట్ చేసి కదిలొంచి

నిష్క్రమించాడు కూపర్.

మంజుల లేచి పసుపురంగు చీర, అదే రంగు స్లీవ్ లెస్ జాకెట్ తొడుక్కుంది. మాచ్‌గా హాండ్ బ్యాగ్, చెప్పులు వేసుకుంది. వజ్రాల నెక్లెసు మెళ్ళో వేసుకుని, అద్దంలో చూసుకుంది. తన అలంకరణ తీరు సక్రమంగా వుందా లేదాని రెండు నిముషాలు మౌనంగా ప్రశ్నించు కుంది మనస్సును. ఆ తర్వాత ఎలివేటర్ వేపు నడిచింది.

పోర్టికోలో తెల్లటి అంబాసిడర్ కారు ఆగివుంది. దాని ప్రక్కనే కూపర్ సిగరెట్ దమ్ము లాగుతూ కూర్చు న్నాడు. మంజులను చూడగానే సిగరెట్ దూరంగా విసరి పారేశాడు. గబగబ వెళ్ళి వెనుక తలుపు తీసి నిల బడ్డాడు. మంజుల మౌనంగా వెళ్ళి కూర్చుంది. తలుపు మూసి, కారు ముందువైపునుండి తిరిగొచ్చి, స్టీరింగ్ వీల్ ముందు కూర్చుని స్టార్టు చేసాడు.

కారు సర్రున ముందుకు దూసుకుపోయింది.

కూపర్ రోడ్ కేసి చూడసాగాడు.

మంజుల కూపర్‌ని గమనిస్తూ, అతని వొంట్లో ఎంత శక్తి వుంటుందో, అతనిలోంచి తనెంత సుఖం త్రవ్వుకో వచ్చు ఆలోచించసాగింది.

కారు పూనమల్లి హైరోడ్ మీదుగా పోసాగింది.

"మిస్టర్ కూపర్!" పిలిచింది మంజుల.

"యస్. మేడమ్!" వెనక్కి తిరగకుండానే పలికాడు.

"చాలా స్పీడుగా పోతున్నట్లున్నావ్!"

"ఫరవాలేదు! నాకు బాగా అనుభవమైన పనే ఇది."

"నాకు ఆనందంగానే వుంటుంది ఐ లైక్ స్పీడ్!" అంది మంజుల క్రింద పెదవిని పంటితో కొరుకుతూ. ఆమె ముఖం కూపర్‌కు అద్దంలో కనుపించింది. చూడనట్లే నటించి డ్రైవ్ చెయ్యసాగాడు.

"గేట్‌లోకి వెళ్ళు!" అంది మంజుల.

కారును సర్య్యుమని కుడివేపుకు టర్న్ చేశాడు.

"ఆగో నెంబరు ముందాపు!" అంది మంజుల.

స్లో చేసి నెంబర్లు చూసుకుంటూ పోయాడు. ఆగో నెంబర్ 'టౌన్' నెంబరునుండి 'థన్' నెంబరు దగ్గర దగ్గర రెండు ఫర్లాంగుల దూరముంది. పెద్ద పెద్ద తలుపులు అడ్డంగా బిగించి వున్నాయి. హారన్ కొట్టాడు కూపర్.

ఔట్ హవుస్‌లోంచి ముసలి నౌకరు పరుగెత్తుకుంటూ వచ్చి తలుపులు తెరిచాడు. కారు లోనికి పోనిచ్చాడు. వెనక సీట్లో వున్న మంజులకు చేతులెత్తి నమస్కరించాడు.

కారు అందమైన పూలచెట్ల మధ్యనుండి ఐదు నిముషాలు ప్రయాణించి పెద్ద పోర్టికోలో ఆగింది.

పోర్టికోకు ఎడంవేపు బంగళా వుంది. కుడివేపు స్విమ్మింగ్ పూల్ వుంది.

"ఇదే మా బంగళా!" అంది మంజుల.

"స్వర్గంలాగుంది! ఇంత పెద్ద ఇల్లు నేను చూడలేదు మేడమ్!" అన్నాడు కూపర్ ఆశ్చర్యపోతూ.

"లోపల చూచి ఎలాగుందో చెప్పు. పైమెరుగులకే మైకంలో పడుతున్నావ్" అంది దిగి పైట కొంగు సర్దుకుంటూ.

ముసలి నౌకరు వగర్చుకుంటూ వచ్చి నిలబడ్డాడు.

"ఏం రంగయ్యా! బాగున్నావా?"

"బ్రహ్మాండంగా వున్నాను తల్లీ! మీరు, అయ్యగారు కలకాలం చల్లగా వుండాలి తల్లీ!" అన్నాడు రంగయ్య.

"ఇంతకూ మీ అమ్మాయి పెళ్ళి చేసావా?"

"చేశానమ్మా! మీరు పంపిన రెండువేలు రెండుకోట్లు

తల్లీ నాకు. చచ్చి నీ కడుపున పుడతాను" అన్నాడు.

"నా కడుపున పుడతావా? ఈ జన్మకు సాధ్యంగాదు, మరో జన్మంటూ వుంటే చూద్దాం!" అంది నవ్వుతూ మంజుల.

నాఖరుతో అంత సరదాగా, మనస్సు విప్పి మంజుల మాట్లాడడం అతనికి విచిత్రంగా తోచింది. ఆమెపైన అతనికి చాలా గౌరవ భావం ఏర్పడింది.

# 4

అంతకు రెండు దినాలముందు జరిగిన సంఘటన గుర్తొచ్చింది.

రాజమండ్రి సెంట్రల్ జెయిల్ లోంచి విడుదలయినాక తనూ, రెడ్డీ, వారం రోజులు తిండికి మాడారు. చిన్నగా విజయవాడ చేరుకున్నారు. రెడ్డి ఎవరిదో పర్సు కొట్టేశాడు. దాంట్లో రెండొందలు కనుపించాయి. వెంటనే ఇద్దరూ హోటల్ ప్రశాంతిలో రూం తీసుకున్నారు. ప్రక్క రూంలో ఎవరో గోదావరిజిల్లా నాయుడు దిగాడు. ఆయనదగ్గర రెండు లక్షల రూపాయలదాకా కరెన్సీవున్న విషయం పసిగట్టాడు రెడ్డి. దాన్ని కాజెయ్యడానికి పథకం వేశారు. అతని గది రెండో అంతస్తులో వుంది.

రాత్రి రెండుగంటలప్పుడు ఇద్దరూ లేచి వెళ్ళారు. నాయుడుగారు గది తలుపులు లోపల్నుంచి మూసుకుని పడుకున్నాడు. ఆయన సాయంత్రందాకా పీకలవరకూ త్రాగి పడుకుంటాడని రూంబాయ్ చెప్పాడు. అందువల్ల ధైర్యంగా తలుపులు తెరచుకొని డబ్బు దొంగలించేందుకు పథకం వేసుకున్నారు.

ఇద్దరూ వెళ్ళి తమ దగ్గరున్న మారు తాళాల గుత్తిలోంచి, ఒక తాళం చెవితీసి తలుపు తెరిచారు. లోపలికి

అదుగట్టి చూడగానే మతులుపోయాయి. నాయుడుగారి కౌగిట్లో ఎవరో ఆడమనిషి వున్నట్లు కనుపించింది.

"ఎవరది?" పెద్దగా అరచాడు నాయుడు. అరుస్తూనే మంచం ప్రక్కనే టీపాయ్‌పైనున్న టేబుల్ లైటు వెలిగించాడు. ఏం జరుగుతుందో అర్థం చేసుకోనే లోగానే ఆయన "దొంగ! దొంగ!" అంటూ పెద్దగా కేకలు పెట్టాడు.

రెడ్డి ఉడాయించాడు. అతని వెంట తనూ పరుగెత్తాడు. మెట్ల దగ్గరకు చేరగానే రెడ్డి క్రిందివేపు దిగసాగాడు, తను పైకెక్కాడు. మూడో అంతస్తు మొదట్లో, అతను, ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం, రాతిబొమ్మలా నిలుచుని తన్ను పట్టుకున్నాడు.

"దొంగని క్రింద అరుస్తున్నారు! నువ్వేకదూ!" అడిగాడు.

అవునన్నట్లు తలూపేను.

"నా వెంట రా!" అంటూ ఆ అంతస్తులోవున్న అతని రూంకు పిల్చుకుని పోయాడు. గది తలుపులు లోపలనుండి గడియపెట్టి జరిగింది చెప్పమన్నాడు. తను చెప్పాడు. అంతా విని పోలీసులకు పట్టివ్వకుండా వుండేందుకు ప్రతిఫలంగా తనకో పని చేసిపెట్టమని అడిగాడు. అతని పేరు నాగేశ్వరరావు.

సూట్‌కేస్‌లోంచి ఒక ఫోటోలాగి అందించి, అందులో వున్న అమ్మాయితో అక్రమ సంబంధం వున్నట్లుగా ఒక్క ఫోటో సంపాదించి ఇవ్వగలిగితే ఐదువేలు డబ్బిస్తానన్నాడు. ఆమె ఎవరయిందీ, ఎక్కడ కలుసుకోవలసిందీ, ఎలా ఫోటో తీసుకోవలసిందీ అన్నీ అతనే చెప్పాడు. చిన్న ఆటోమేటిక్ కెమెరా కూడా సప్లయి చేశాడు.

ఆ పనిమీదనే బయలుదేరాడు మద్రాసుకు. కాకతాళీ

యంగా తనెవర్ని మద్రాసు వెళ్ళి కలుసుకోవాలో ఆమే విజయవాడలో ప్రత్యక్షమై తనకుతానే వచ్చి పరిచయం చేసుకుంది. తన పని సులభంగా అయిపోతుందన్న నమ్మకం ఏర్పడింది కూపర్ కు. ఆ పని పూర్తి చేసుకుని ఆ కెమెరా నాగేశ్వరరావు మొఖానకొట్టి, ఐదువేలు అందుకొని మళ్ళీ గడ్డిని వెతుక్కుంటూ వెళ్ళాలనుకున్నాడు.

నాగేశ్వరరావు మంజులను గురించి చాలా కథలు చెప్పాడు. అతను చెప్పిన దానికీ, తను చూస్తున్నదానికీ ఏ విధమైన సంబంధం కనుపించటం లేదు.

కూపర్ సందిగ్ధంలో పడ్డాడు. మంజుల తన్ను ఆదరించింది. ఆమెను మోసం చెయ్యాడానికి మనస్కరించలేదు. అలాగని నాగేశ్వరరావుకు ఎదురు తిరిగి మళ్ళీ జైలుకు పోవడం కూడా ఇష్టం లేదు.

హాల్లోకి అడుగు పెట్టింది మంజుల. ఆమె వెంటనే కూపర్ లోనికి వెళ్ళాడు. విశాలమైన హాల్లో ఖరీదైన తివాసీలు, కర్టెన్లు, సోఫా సెట్ లు కనుపించాయి. ఎటూ చూసినా లక్ష్మి తాండవం చేస్తున్నట్లు వుంది.

మంజుల బంగళా అంతా చూపించి,చివరకు బెడ్ రూం తలుపు తెరచింది.

కూపర్ వెలుపలే నిలబడ్డాడు.

మంజుల లోనికి రమ్మని పిలిచింది.

కూపర్ వెళ్ళాడు లోనికి.

గది మధ్యగా పెద్ద రౌండ్ కాట్ వుంది. దానిపైన అడుగు ఎత్తున్న ఫోమ్ బెడ్ వుంది. సీలింగు నుంచి అందంగా వ్రేలాడుతూ దాన్ని చుట్టూకుంటూ జారిన మస్కిటో కర్టెన్.

"ఎలాగుంది?" అడిగింది మంజుల.

"చాలా బాగుంది మేడమ్!" అన్నాడు కూపర్.

"అలా కూర్చొనుండు. బాత్ రూంకు వెళ్లివస్తాను" అంటూ ఫ్లష్‌డోర్ నెట్టుకుని లోనికి వెళ్లింది.

కూపర్ ఆమె వెళ్ళగానే, జేబులోంచి కెమెరా తీసి మంచం ప్రక్కనున్న టీపాయ్ పైన పెట్టాడు. దాన్ని క్లిక్ చేసేందుకున్న సన్నటి వైరును మంచం క్రిందకు నెట్టాడు. మంజుల తిరిగి రాగానే ఆమెను మంచంపైన తోసి, తను పైనపడి, కాలితో స్విచ్ నొక్కితే చాలు. ఫోటో ఎక్స్‌పోజ్ అవుతుంది. దాంతో తన పని తీరి పోతుంది.

బాత్ రూం డోర్ తెరచుకుంది. మంజుల వెలుపలి కొచ్చింది.

ఆమెకేసి చూశాడు కూపర్. జాకెట్ తీసేసింది. టవల్‌తో మెడ రొమ్ముల పైభాగం తుడుచుకుంటూ వచ్చి టవల్ దూరంగా విసిరింది. వెనుకనున్న కిటికీలోంచి పడుతున్న వెలుతురు కడ్డంగా ఆమె నిలబడి వుండడంతో, ఆమె శరీరంలోని వొంపులు అందంగా కనుపించాయి.

కూపర్ కుర్చీలోంచి లేచి రకస్యన ఆమెవైపు రెండడుగులు వేసి, రెండు చేతుల్తో బలంగా కౌగలించుకున్నాడు. ఆమె పెనుగులాడ లేదు. మంచంపైకి లాక్కొచ్చాడు. ఆమెను తోసి తను పైన పడ్డాడు. ఆమె ముఖాన్ని తన ముఖంపైకి లాక్కుని, టీపాయ్‌వైపు త్రిప్పాడు. నేలపైన ఆనుతున్న కుడికాలుతో తడుముకొని స్విచ్ నొక్కాడు.

ఆదే క్షణంలో బెడ్ రూం తలుపులు తెరచుకున్నాయి.

కూపర్ మంజులను వదిలేసి దూరంగా వచ్చాడు.

రంగయ్య గుమ్మంలోనే నిలబడ్డాడు కాఫీ కప్పులతో.

మంజులకు కోపం వచ్చింది.

"రంగయ్యా!" అరచింది.

"అమ్మా! కాఫీ తెచ్చాను" అన్నాడు.

"ఎవరు తెమ్మన్నారు?"

"నేనే తెచ్చాను" అన్నాడు.

"ఇక్కడికెందుకొచ్చావ్?"

"బుద్ధి తక్కువయిందమ్మా! క్షమించండి ఇకమీదట రాను" అంటూ కాఫీ కప్పులు టేబుల్ పైన పెట్టాడు. మంజుల లేచివెళ్లి వాష్‌బేసిన్ వైపు నడచింది.

అదే అదనుగా కూపర్, తన కెమెరా తీసి జేబులో వేసుకున్నాడు. దాన్ని రంగయ్య గమనించాడు. కూపర్ కాఫీకూడా తీసుకోకుండా క్రిందికి దిగి వెళ్ళిపోయాడు. రంగయ్యకు తన యజమానురాలు అలా ఎవరితోనో ఆనందించడం వింతగానూ, విచిత్రంగానూ వుంది. అతనికి తెలిసిన ఈ పదేళ్ళలో ఆమె ఎవరినీ బంగళాకు తీసుకు రాలేదు.

"రంగయ్యా!" పిలిచింది మంజుల.

"అమ్మా!" పలికాడు.

"నువ్వు చూసింది మర్చిపో! ఈ విషయం మూడో మనిషికి తెలియకూడదు. ముఖ్యంగా అయ్యగారికి. అర్థమయిందా?" అడిగింది కప్పు తీసుకుంటూ.

"తెలిసిందమ్మా!" భయపడుతూ అన్నాడు.

"అతనేడీ!" అడిగింది.

"దిగి క్రిందకు వెళ్లారమ్మా!" చెప్పాడు రంగయ్య.

కాఫీ త్రాగింది. మనస్సు వికలమైపోయింది. కూపర్ తన్ను అర్థం చేసుకున్నందుకూ, తన అవసరాలు గుర్తించినందుకూ ఆనందించింది. పానకంలో పుడకలా రంగయ్య రాకుంటే... ఈపాటికి తన మత్తు వదిలిపోయి వుండేది. అంత భయంగా, దూరంగా వుండే కూపర్ ఒక్కమారు అలా పెకి ఎలా దూకగలిగాడో అంతుబట్టలేదు. కావాలనే బాత్‌రూంలో తను జాకెట్ తీసిపారేసింది. తన అందం

పైన, ఆకర్షణకీ పైన తనకు క్రొత్త నమ్మకం పుట్టుకొచ్చింది.

కూపర్‌ని పైకిరమ్మని కబురుచేద్దామనుకుంది. కానీ అతను భయపడి వెళ్ళిపోయాడు. ఆ భయం చిన్నగా పోగొట్టాలి. అతనిముందు తను సిగ్గువిడిచి తన అవసరాలు చెప్పను మనసొప్పలేదు.

నీట్‌గా డ్రెస్ చేసుకుని తయారయింది. రాత్రికి తను పడుకోటానికి రావచ్చనీ, బెడ్‌రూం అంతా క్లీన్ చేసి ఉంచమనీ, పాలు, పండ్లు, విస్కీ అన్నీ తెచ్చి ఉంచమనీ రంగయ్యకు చెప్పి, డబ్బిచ్చి క్రిందకు దిగింది.

కారులో స్టీరింగుముందు కూర్చుని వున్నాడు కూపర్.

మంజులవచ్చి బ్యాక్‌డోర్ తెరచుకుని ఎక్కికూర్చుంది.

కారు స్టార్టయింది.

ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

“కూపర్!” పిలిచింది మంజుల.

“మేడమ్!” పలికాడు.

“మా రంగయ్యకు నేనంటే ప్రాణం. స్వంతకూతురిలా చూస్తాడు.”

“క్షమించండి మేడమ్! పశువులా ప్రవర్తించాను. అతనిముందు మీరు తల వొంచుకునే పరిస్థితి తెచ్చాను. నాకు తెలీకుండానే తొందరపడిపోయాను. అందుకు సిగ్గుపడుతున్నాను. మిమ్మల్ని హోటల్‌లో వదిలేసి నేను వెళ్ళిపోదలచుకున్నాను” అన్నాడు కూపర్.

“ఎక్కడికి?”

“తెలీదు!”

“నేను నిన్నేమీ అనలేదుగా?”

“అనలేదు! కానీ సాయంచేసిని వాళ్ళకు నేనుచూపించే కృతజ్ఞత ఇదని తెలిశాక నాకు మీముందు నిలబడడం

కూడా బాధగావుంది. అందుకే దూరంగా వెళ్ళిపోవాలని అనుకుంటున్నాను" అన్నాడు కూపర్.

మంజులకు అతని మనస్తత్వం ఏమిటో అర్థమయినట్లు లేదు. అతన్ని ఎలా సమాధాన పరచాలో అర్థం కాలేదు.

"నేను ఇంకా రెండు దినాలు ఉంటాను. మావారు వస్తారు. రాగానే ఊటీకి వెళ్తాం. అందాకావుండు. ఆ తర్వాత ఎక్కడన్నా ఉద్యోగం నేనే చెప్పి ఇప్పిస్తాను. జరిగిందేదో పెద్ద నేరమని ఊహించుకొని నువ్వు బాధపడకు. రంగయ్య చాలా మంచివాడు" అంది చూచాయగా తన అభిప్రాయాలు తెలుపుతూ.

కూపర్ మాట్లాడలేదు.

హోటల్ రాగానే మంజుల దిగి వెళ్ళిపోయింది.

## 5

కారు రిసెప్షనుముందు పార్క్ చేసి, ఇగ్నిషన్ కీ అందించాడు కౌంటరులో. వెనక్కి తిరిగి చూడగానే నల్ల సూట్‌లోవున్న నాగేశ్వరరావు కనుపించాడు. కూపర్‌ను చూచి నవ్వాడతను. దగ్గరకు రమ్మన్నట్లు సైగ చేశాడు.

కూపర్ మెల్లగా వెళ్ళి నాగేశ్వరరావు దగ్గరగా నిలబడ్డాడు.

"మీరా?" అన్నాడు ఆశ్చర్యంగా కూపర్.

"ఆఁ! నేనే! నీకోసం ప్రొద్దుట్నుంచి పడిగాపులు పడుతున్నాను."

"నేనిక్కడుంటానని ఎలా తెలుసు?"

"అంతమాత్రం తెలుసుకోలేని వాడ్ని, నిన్నెలా పని గట్టానంటావ్?"

"ఏమని?"

"జెయిలుపక్షివని..."

ఆమాట వినగానే కంగారుపడ్డాడు కూపర్.

"ఇక్కడొద్దు! అలా బయటికెళ్ళి మాట్లాడుకుందాం?" అన్నాడు రావుతో.

"సరే! పద!" అంటూ ముందుకు నడిచాడు రావు.

ఇద్దరూ రావు కారెక్కి "ఆరామ్ బహార్"కి చేరుకున్నారు. చిన్న రూంలో జొరబడ్డారు.

"చెప్పు ఏమయింది?" అడిగాడు రావు కూర్చోగానే.

"చెప్తాను! అంత నీచమైనపని నన్నెందుకు చెయ్యమన్నావ్. దానివల్ల నీకేంలాభం? చెప్పాలి నువ్వు. ఆ తర్వాత వివరంగా జరిగింది చెప్తాను" అన్నాడు కూపర్.

"నేను జెయిలుకు పోకుండా తప్పించుకుంటాను. నిన్ను జెయిలుకు పంపకుండా ఉంటాను. అంతే!" అన్నాడు రావు కోపంగా.

"కాస్త వివరంగా చెప్పు!" అడిగాడు కూపర్.

"చెప్పను. ఆ వివరాలతో నీకు పనిలేదు. నీకేవిధమైన ఆపదరాదు. నీ కిస్తానన్న డబ్బు తెచ్చాను. ఆ కెమెరా ఇచ్చెయ్యి. డబ్బుతీసుకో!" అన్నాడు రావు దగ్గరున్న బాండ్ కేసి తీసి టేబుల్ పైన పెడుతూ.

"నాకు డబ్బు అంత ముఖ్యంకాదు!" అన్నాడు కూపర్.

"పోనీ నీ స్వేచ్ఛ, స్వాతంత్ర్యమన్నా ముఖ్యమా?" అడిగాడు రావు.

"ముఖ్యమే!"

"అయితే నేను చెప్పినట్లు చెయ్యి" అన్నాడు రావు.

కూపర్ కు పరిస్థితి అర్థమయింది. తన్ను నాలుగువేపుల నుండి బంధించివేశాడు. తప్పుకునేదారిగానీ, ఎదురుతిరిగే అవకాశంగానీ లేవని అర్థమయింది. పాంటుజేబులోంచి కెమెరాతీసి అందించాడు.

"ఫిల్మ్ ఎక్స్‌పోజ్ చేశావా? ఇచ్చింది ఇచ్చినట్లే తిరిగిస్తున్నావా?" అడిగాడు అందుకుంటూ.

"డెవలప్ చేయించుకుని చూడు" అన్నాడు కూపర్.

"నీ డబ్బు కూడా ఆ తర్వాతే ఇస్తాను" అన్నాడు కెమెరా బాక్స్‌లో పెట్టుకుంటూ.

"అలాగే! ఆ తర్వాత పిచ్చిపిచ్చి వేషాలు వేశావంటే నిన్నేంచేస్తానో నాకే తెలీదు! జాగ్రత్త!" అన్నాడు కూపర్.

"నేనెప్పుడు జాగ్రత్తగానే ఉంటాను. ప్రస్తుతానికి వంద ఉంచుకో" అంటూ డబ్బిచ్చి, వెళ్తున్నానని చెప్పకుండానే వెళ్ళిపోయాడు రావు.

బేరరొచ్చాక బిరియానీ ఆర్డరు చేసి కూర్చున్నాడు కూపర్.

ఈ రావుకు మంజులకు అసలువున్న సంబంధమేమయి వుంటుందాని ఆలోచించాడు. అంతుబట్టలేదు. ఆమెను బ్లాక్ మెయిల్ చెయ్యటానికి ఆ ఫోటో ఉపయోగిస్తాడేమోననిపించింది. తనకామె చేసిన సాయానికి, చూపించిన సానుభూతికి, ఆమెపట్ల కృతఘ్నుడిగా మారిపోవడం అన్యాయమనిపించింది.

అలా అనిపించగానే మనస్సు తేలికపడింది. బేరరు తెచ్చిన బిరియానీ పూర్తిగాతిని, రెండుకప్పుల టీ త్రాగి గోల్డ్ ఫ్లాక్ సిగరెట్ పాకెట్ కొనుక్కుని వెలుపలికొచ్చాడు. మెల్లగా హోటల్ ఓల్గాకు నడవసాగాడు.

రెడ్డి గుర్తువచ్చాడు. అతనుంటే ఇలాంటి సందిగ్ధ సమయాల్లో తన కర్తవ్య మేమిట్లో చెప్పేవాడు. అతనికర్మ బాగుండక ఆదినం మెట్లమీదుగా క్రిందికి దిగివెళ్ళాడు. పోలీసులకు చిక్కాడు. లేకుంటే అక్కడే రావునుచితక దన్ని బయటపడేవాళ్ళు ఇద్దరూ. తను అనవసరంగా ఈ

రావుగాడి ఉచ్చులో తగులుకున్నట్లయింది.

హోటల్ ఆవరణలో అడుగుపెట్టాడు కూపర్.

అక్కడున్న కార్లలో అతనికి నల్ల ఫియట్ కారు కొట్టొచ్చినట్లు కనిపించింది. నెంబరు చూశాడు. అది రావుగాడిదే. అంతకుముందు బాంబ్లోనే షికారికి తీసుకెళ్ళాడు. అంటే అప్పుడే ఫిలిమ్ డెవలప్ చేయించుకుని వచ్చాడన్న మాట. మంజులను కలుసుకోనేందుకే అతను వచ్చివుంటాడని సులభంగానే ఊహించాడు.

రావు ఏం మాట్లాడుతున్నాడో వినాలన్న కుతూహలం కలిగింది కూపర్‌కు. వడివడిగా వెళ్లి ఎలివేటర్ ఎక్కి మంజుల ఫ్లాట్ చేరుకున్నాడు.

ఖాళీ కప్పులతో ఎదురొచ్చాడు హోటల్ బాయ్.

"ఎవరున్నారు లోపల? అమ్మగారు ఒక్కతే వుందా?" అడిగాడు కూపర్.

"ఇంకెవరో వున్నారు" అన్నాడు బాయ్.

"ఆడా? మగా?"

"మగే!"

"నువ్వెళ్ళు!" అని బాయ్‌కి చెప్పి, కూపర్ గుమ్మం వద్దకు చేరాడు. లోనికి వెళ్ళటమా, మానటమా అన్న సందిగ్ధంలో పడ్డాడు. రావు లోపలుండగా తను వెళ్ళడం అంత మంచిదికాదన్న అభిప్రాయం కలిగింది. వెలుపలే నిలుచున్నాడు.

పది నిముషాలు గడిచాయి.

కూపర్ రెండు సిగరెట్లు తగలబెట్టాడు.

తలుపులు తెరచుకున్నాయి. రావు వెలుపలికొచ్చి నిలబడ్డాడు. స్ప్రింగ్ డోర్ దానంతటదే మూసుకుంది.

"ఇక్కడున్నావేం?" అడిగాడు రావు.

"నీ కోసమే!"

"ఎందుకు?"

"ఆ ఫిలిమ్ చూశాక డబ్బిస్తానన్నావ్ గదా?" గుర్తు చేశాడు కూపర్.

"అవును" అన్నాడు రావు.

"చూశావుగా? డబ్బివ్వు."

"ఇస్తాను! కానీ ఇవాళ కాదు. రేపు ఇదే టయిమ్‌కు ఇక్కడకు రా" అన్నాడు రావు.

"ప్రింట్ బాగా వచ్చిందా?"

"ఎక్సలెంట్‌గా వుంది!" అంటూ వెనక్కి చూడకుండా వెళ్ళిపోయాడు రావు.

# 6

అతను వెళ్ళాక తలుపు తోసుకుని లోనికి వెళ్ళాడు. హాలు మధ్యగానున్న మంచంపైన బోరగింతలా పడుకుని దిండులో తల దూర్చుకుని వెక్కిళ్ళు పెట్టి ఏడుస్తున్న మంజుల కనుపించగానే అవాక్కయిపోయాడు కూపర్.

మంచందగ్గర కెళ్ళి నిలబడ్డాడు కూపర్.

"మేడమ్! మేడమ్!" పిలిచాడు కూపర్.

మంజుల తక్కున లేచి కూర్చుంది. ఎదురుగా నిలబడ్డ కూపర్‌ని చూసి "నువ్వా! గోగ్! గెటవుట్ ఫ్రం హియర్!" అరచింది పెద్దగా.

"మేడమ్!" విస్తుపోతూ వెనక్కి అడుగువేశాడు.

"వెళ్ళిపో! లేకుంటే నిన్నేం చేస్తానో నాకు తెలీదు! వెళ్ళు! అరచింది మంజుల.

"మేడమ్! జరిగింది చెప్పనివ్వండి. నన్ను అపార్థం చేసుకోకండి!" అంటూ అడుగు ముందుకు వేశాడు.

"నేనేం వినను. వెళ్ళిపో. వెళ్ళకుంటే రివాల్వరుతో కాల్చిపారేస్తాను. గెటవుట్!" సింహంలా గర్జించింది మంజుల.

కూపర్ ఆమె పరిస్థితి అర్థంచేసుకున్నాడు. ఆమె శాంతిస్తే తప్ప తను చెప్పేది వినదన్న విషయం తెలిసొచ్చాక అక్కడే నిలబడి ఆమె కోపాన్ని పెంచడం మంచిదికాదని, తలూపుకుని వెలుపలకొచ్చేశాడు.

రావుగాడ్ని పట్టుకుని చితకతంతామనుకుంటింది.

నిమ్మళంగా కూర్చున్నాడు సిగరెట్ త్రాగుతూ. అలాగే గంటసేపు కూర్చున్నాడు.

తలుపు తెరచుకుంది.

కూపర్ లేచి నిలుచున్నాడు.

మంజుల వెలుపలికొచ్చింది. కూపర్‌ని చూసి "నువ్విక్కడే వున్నావా?" అడిగింది.

బదులు చెప్పకుండా నిలుచున్నాడు కూపర్.

"క్రిందికి పద!" అంది మంజుల.

కూపర్ ముందు దిగాడు మెట్లు. మంజుల అతన్ని అనుసరించింది. ఇద్దరూ కారెక్కారు.

"మెరీనా బీచ్‌కు పోనీ!" అంది వెనక కూర్చుని.

కూపర్ కారు ఆక్సిలేటరు నొక్కాడు. పదిహేను నిముషాల్లో మెరీనా బీచ్ చేరింది. ఇద్దరూ దిగి కాంటీన్ వేపు నడిచారు.

బాయ్‌కి టీ తెమ్మని చెప్పి పంపింది.

"ఆ రావు నీకెలా తెలుసు!" అడిగింది మంజుల.

ఆ ప్రశ్నకోసమే ఎదురుచూస్తున్న కూపర్ జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. కానీ తను జెయిలు నుండి విడుదలయి వచ్చిన విషయం మాత్రం చెప్పలేదు.

"నీ ఫ్రెండు ఏమయినాడు?"

"తెలీదు మేడమ్!"

"అయితే నువ్వు నా కోసం వెతుక్కుంటూ వున్నావన్న మాట."

"లేదు! మద్రాసు వచ్చాక చూడాలనుకున్నాను. కాని విధి విచిత్రమైంది. అదే నన్ను మీ వద్దకు చేర్చింది. ఇంతకూ ఈ రావెవరు?"

"ఇతను మాకు జనరల్ మేనేజర్. ఈ ఊళ్లో మాకున్న వ్యవహారాలన్నీ చూస్తుంటాడు. నాకు డాల్మియాతో పెళ్లి ఇతనే జరిపించాడు" అంది మంజుల.

"నన్ను అలాంటి ఫోటోలో తెమ్మని ఎందుకు చెప్పాడు?"

"నన్ను బ్లాక్ మెయిల్ చెయ్యటానికి.మా పేరుపయోగించి దాదాపు పది లక్షల రూపాయలు అప్పు తెచ్చి రేసుల్లో పోశాడు. అంతా పోయింది. అప్పిచ్చిన వాళ్ళు అతన్ని ఒత్తిడి చేస్తున్నారు డబ్బుకోసం. ఇప్పుడా అప్పులన్నీ నన్ను తీర్చమంటున్నాడు. లేకుంటే ఆ ఫోటో నా భర్తకు పంపి, నన్ను అతన్నుండి విడదీస్తానని బెదిరిస్తున్నాడు" అంది మంజుల.

"మీరేం చేద్దామనుకుంటున్నారు?"

"ఏమీ తోచడంలేదు. అతను అడిగినట్లు డబ్బిస్తే నా భర్తకు జవాబు చెప్పుకోవాలి. అంత మొత్తం పాడు చేశానంటే నమ్మడు. ఇవ్వకుంటే ఆ ఫోటోలు పంపి నన్ను బజారు కీడుస్తాడు రావు" అంది మంజుల.

"సారీ! మేడమ్! ఇందులో ఇంత పెద్ద తిరకాసుందంటే అతనికి ఆ ఫోటోలు ఇచ్చేవాణ్ణి కాదు! బుద్ధి గడ్డితినింది. మీకు అతనివల్ల అన్యాయం జరగడం నేను సహించలేను. నా ప్రాణాలైనా ఇచ్చి కాపాడుతాను" అన్నాడు కూపర్.

"నన్ను కాపాడాలని ఎందుకనిపిస్తూంది?"

"ఏమో! నాకే తెలీదు. మంచి వాళ్ళకు మంచి చెయ్యడం చెడ్డవాడికి మంచిదని నా ఫ్రెండు రెడ్డి పదే పదే చెప్తుంటాడు. అతని మాటంటే నాకు చాలా గురి.

ఇలాంటి సమయంలో అతనుకూడా వుండివుంటే ఈ రావు గాడి ఎముకలు లెక్కపెట్టి ఆ సముద్రంలో పారేసేవాణ్ణి" అన్నాడు కూపర్.

"నువ్వేం తొందరపడవద్దు! నన్ను బాగా ఆలోచించు కోనీ! మోసాన్ని మోసంతోనే జయించాలి!" అంది మంజుల.

"అవును. మీరేం చెయ్యమంటే అదిచేస్తాను. నన్ను నమ్మండి" అన్నాడు కూపర్.

బాయ్ టీ తెచ్చిపెట్టాడు.

మంజులకు సంతోషంగా వుంది.

కూపర్ తనతో కోపరేట్ చెయ్యడం రెండురకాల ఉపయోగకారిగా వుంటుంది. ఆ రావును ఎదుర్కోవ డానికి తనకు సాయం వుంటుంది. రెండవది ఫోటో విషయం రాల్ఫ్‌కు తెలిసినా, కూపర్ చేత ఏదో సర్ది చెప్పించవచ్చు.

ఇద్దరూ టీ త్రాగారు.

"వెళదామా?" అడిగాడు కూపర్.

"ఆఁ!" అంది మంజుల.

వెలుపలికొచ్చి కారెక్కారు. కారును తిన్నగా కీల్పాక్‌లోవున్న బంగళాకు పోనిమ్మని చెప్పింది.

బంగళాకు చేరగానే రావుకు ఫోన్‌చేసి త్వరగా తన ఇంటికే రమ్మని ఫోన్ చేసింది మంజుల. రావు అర గంటలో వస్తానన్నాడు. ఫోన్ పెట్టేసింది.

"అతన్ని రమ్మన్నారా?" అడిగాడు కూపర్.

"ఆఁ! నువ్విక్కడే దాక్కొనుండు. పరిస్థితిని గమనిస్తు వుండు. అవసరమనిపించినప్పుడు రా!" అంది మంజుల.

కర్టెన్ క్రిందికిలాగి దానివెనుక చిన్న స్టూలు వేసుకొని కూర్చున్నాడు కూపర్.

అరగంట తర్వాత వెలుపల కారాగిన శబ్దమైంది.

"వచ్చినట్లున్నాడు!" అంది మంజుల.

"మీరు ధైర్యంగా వుండండి!" అన్నాడు కూపర్.

రావు లోపలి కొచ్చాడు.

"ఏం నిర్ణయించుకొన్నావ్?" అడిగాడు కూర్చుంటూ.

"చెప్తాను" అంటూ సర్దుకుంది సోఫాలో.

"చెప్పు!" అన్నాడు ఆతృతగా.

"నువ్వు మా డబ్బును పదిలక్షలదాకా పందికొక్కులా తినేశావ్. నీ దొంగతనం బైటపడితే నిన్ను మావారు జేలుకు పంపుతారు. అలా జరగకుండా నేను, ఆడబ్బంతా పాడు చేసినట్లు మావారితో చెప్పాలి. లేకుంటే నీదగ్గరున్న ఫొటోలు వారికి చూపించి, నన్ను ఆయన్నుంచి దూరంగా తరిమి వేసే ఏర్పాట్లు చేస్తావ్! అంతేకదూ!" అంది మంజుల.

"అంతే!"

"ఆ ఫొటోలు చూసిన వెంటనే ఆయన నీ మాటలు నమ్మి నన్నేదో చేస్తాడని భయపడిపోవడం అనవసరం. ఆయనతో పదేళ్ళనుండి కాపురం చేస్తున్నాను. వాటిలోని నిజానిజాలు తెలియకుండా నాకు విడాకులిచ్చి పంపుతా రనుకోవడం నీ అమాయకతనూ, అవివేకతనూ మాత్రమే సూచిస్తూంది.

ఒకవేళ నమ్మి నాకు విడాకు లిచ్చినా, నా పేరుతో ఇప్పటికి రెండు బంగళాలు, మూడు కార్లు, ఒక కంపెనీ వున్నాయి. వాటి మొత్తం విలువ దాదాపు ముప్ఫై లక్షలుంటుంది. అదీగాక ఇదారు లక్షల ఖరీదుచేసే నగలు కూడా దగ్గరున్నాయి. వీటిన్ని తిరిగి పొందే అవకాశం ఆయనకు లేదు. ఈ ఆస్తిపాస్తులతో మిగిలిన జీవితం అందమైన కుర్రాడితో హాయిగా గడిపేయగలను. ఒక

విధంగా నాకు నీ పథకం మేలే చేసుంది. కానీ నీ విషయం అలాకాదు. తిన్నగా జైల్ కు పోతావ్. నీ ప్లాను ప్రకారం నడచుకోనందువల్ల నాకన్నా నీకే ఎక్కువ నష్టం కలుగుతుంది'' అంది మంజుల.

రావుకు మంజుల మాటలతో తల తిరిగిపోయింది. తన దెబ్బకు హడలిపోయి, చెప్పినట్లు వినేందుకు ఒప్పుకుని, తన్ను రమ్మని ఫోన్ చేసిందని అనుకుంటూ పరుగెత్తు కొచ్చాడు.

''మంజులా! నీ భర్త డాల్మియాను నీకు పదేళ్ళనుండి తెలుసు. నాకు అంతకు ముందునుంచి తెలుసు. నీ శృంగార దృశ్యాలు దేశంలోని పేపర్లనిండా ప్రచురించాక నిన్ను ప్రాణాలతో వదిలిపెడతాడని అనుకోవద్దు. అతనికి డబ్బుంది. పలుకుబడి వుంది. ఏం ఘోరం చేసినా కప్పి పెట్టుకోగలడు'' అన్నాడు రావు ఆమెను ఎలాగైనా భయపెట్టాలని.

''మిస్టర్ రావ్! చావుకు భయపడే మనిషిని గాను నేను. ఎప్పుడో ఒకప్పుడు అందరం చావవలసిన వాళ్ళమే. నిన్ను జైలుకు పంపాక నేను ఎప్పుడు చచ్చినా ఒకటే. ఇలాంటి బెదిరింపులతో నన్ను లొంగదీసేందుకు ప్రయత్నించవద్దు!'' అంది మంజుల.

''అయితే నన్నెందుకు రమ్మన్నావ్?'' అడిగాడు రావు.

''చెప్తాను నువ్వు మాకు చేసిన మోసానికి క్షమాపణ చెప్పుకుంటూ, ఎంత డబ్బు ఏవిధంగా దొంగలించింది వివరంగా రాసివ్వాలి. నీకున్న కొంపా గోడు మాకు దత్తం చెయ్యాలి. వెంటనే నిన్ను డిస్మిస్ చేయిస్తాను. ఆ తర్వాత నీకూ, మాకూ ఏ విధమైన సంబంధం వుండదు.

ఇందుకు ఒప్పుకుంటే నీమీద పోలీసుకేసు పెట్టకుండా మావార్ని ఎలాగో ప్రాధేయపడతాను" అంది మంజుల.

"మంజులా! నువ్వేదో పెద్ద తెలివిగలదాని వనుకుంటు న్నావ్. ఇప్పుడు గంట మూడయింది. రాత్రి తొమ్మిది గంటలలోగా నీ ఆఖరి నిర్ణయం నాకు తెలియపర్చు" అంటూ లేచాడు.

"ఫొటోలు తెచ్చావా?"

"లేదు!"

"ఎందుకని?"

"వాట్ని నా బ్యాంకు లాకర్‌లో పెట్టాను. నేను చనిపోవడం జరిగితే వాట్ని బొంబాయిలోవున్న ఒక ఫ్రెండ్‌కు పంపమనికూడా చెప్పాను. అతను ప్రచురణకు తగిన అన్ని ఏర్పాట్లు చేస్తాడు!" అన్నాడు రావు.

"తొందరపడ్డావ్? తర్వాత విచారిస్తావ్?"

"ఏమో? అదేదో నీకే తెలియాలి. నేను ఎనిమిదింటి కల్లా ఫోన్ చేస్తాను. సరేనా?" అడిగాడు రావు.

"వద్దు! నువ్వేరా" అంది మంజుల.

ఆమెకేం తోచడం లేదు. మరో మూడెరెండు గంటల్లో తన భర్త మద్రాసు చేరుకుంటాడు. ఈలోగా తనీ గొడవలోంచి బయటపడాలి.

# 7

రావు వెళ్ళిపోయాడు. కర్టెన్ చాటునుంచి కూపర్ వచ్చాడు. "మా సంభాషణ విన్నావా?" అడిగింది మంజుల.

"విన్నాను. అంతా అర్థమైంది. ఆ ఫొటోలు, నెగిటివ్‌లు అతని దగ్గర లేకుంటే మీకాళ్ళపైన పడి క్షమించమని ప్రాధేయపడి వుండేవాడు. నావల్లే మీకింత అనర్థం జరిగింది" అన్నాడు కూపర్ బాధగా.

"అంతా విధి! ఇప్పుడున్న అభిప్రాయం అంతకుముందే వుండివుంటే నువ్విలా చేశావాడివి కాదుగా. అయినా పశ్చాత్తాప పడుతున్నావ్. అంతే చాలు" అంది మంజుల.

"మీరేం కంగారు పడకండి! ఆ ఫొటోలు ఎలాగైనా లాక్కొస్తాను."

"ఎలా? అవి ఇప్పుడు అతని దగ్గరకూడా లేవు. బాంక్‌లో పెట్టానని చెప్పాడు."

"నాలుగు తంతే వెళ్ళి తెస్తాడు."

"అది ప్రమాదం. తన్నులు తిన్నాక వెళ్ళాడంటే మరి తిరిగిరాడు."

"అయితే తన్ని అతని దగ్గర లెటర్ రాయించుకొని మనమే వెళ్ళి తెద్దాం. అంతదాకా ఇక్కడే ఒక గదిలో బంధించి పెడదాం!" అన్నాడు కూపర్.

"కాని రంగయ్యకు తెలుస్తే బాగుండదు."

"అతన్ని ఎక్కడికైనా పంపే ఏర్పాటు చెయ్యండి. రేపు రాత్రిలోగా ఈ వ్యవహారం ఫైసలు చేసేద్దాం!" అన్నాడు కూపర్.

"అలాగే!" అంది మంజుల.

"రంగయ్యనివచ్చి మిమ్మల్నోమారు చూడమనేదా?" అడిగాడు కూపర్.

"చెప్పు!" అంది మంజుల.

కూపర్ వెలుపలికి వెళ్ళిపోయాడు.

మంజులకు కొంత మన స్థిమితం కలిగినట్లయింది.

రంగయ్య వచ్చాడు.

"మీరు రమ్మన్నారని డ్రైవరుబాబూ చెప్పాడు తల్లీ!" అన్నాడు.

"ఆ! ఏంలేదు. నువ్వు నాకో చిన్నపని చేసిపెట్టాలి!" అంది.

"చెప్పమ్మా! ఈ చర్మం వొలిచి చెప్పులు కుట్టిచ్చినా మీ ఋణం తీర్చుకోలేనిది" అన్నాడు కృతజ్ఞతా పూర్వకంగా.

"అలాంటివి మాటలనకు. మన స్విమ్మింగ్ పూల్‌లో చేపలన్నీ చనిపోయినట్లున్నాయి. క్రొత్తవాటిని తెచ్చి వెయ్యాలి. మహాబలిపురంలో ఫిషరీస్ వాళ్ళ డిపో వుంది. అక్కడికి ఫోన్ చేసి చెప్తాను. రాత్రికి వెళ్ళి రేపు తీసుకుని రా!" అంది మంజుల.

"అలాగేనమ్మా!" అన్నాడు.

పర్సు తెరచి రెండొందలు లెఖపెట్టి ఇచ్చింది.

"సాయంత్రం బస్సులో వెళ్ళిపో!" అంది.

అలాగేనంటూ తలూపి వెళ్ళిపోయాడు.

కొంతసేపు కూపర్ కోసం ఎదురుచూసింది.

లోనికవెళ్ళి, శుభ్రంగా షవర్ క్రింద కూర్చుని స్నానం చేసింది. ఖరీదైన సెంటు వొంటికంతా పట్టించుకుంది. సన్నటి షిఫాన్ చీర కట్టుకుని స్లీవ్‌లెస్ జాకెట్ తొడుక్కుంది. తీరిగ్గా అద్దంముందు కూర్చుని, మేకప్‌లో తన అందానికి మెరుగులు దిద్దుకుంటూ అరగంటసేపు గడిపింది.

టైమ్ చూసింది. ఏడయింది. అప్పటికీ కూపర్ రాలేదు. వచ్చి బాల్కనీలో నిలుచుంది. అదే సమయానికి కాంపౌండులోకి వస్తున్న అంబాసిడర్ కారు కనుపించింది. తిరిగి గదిలోకి వచ్చి కూర్చుంది.

పది నిముషాల తర్వాత కూపర్ వచ్చాడు.

"ఎక్కడికి వెళ్ళావ్?" అడిగింది మంజుల కాస్త కోపంగా.

ఆమె అలంకరణనూ,అందాన్నీ, తదేకంగా చూస్తున్న కూపర్ ఆ ప్రశ్న వినిపించుకోలేదు. అతని చేతిలో కాకి గుంచి వుంది.

"నిన్నే అడిగింది? ఎక్కడికెళ్ళావ్?" అడిగింది మళ్ళీ.

"బజారుకి."

"ఎందుకు?"

"కొన్ని పనిముట్లు తీసుకొచ్చాను" అంటూ సంచీ బోర్లించి విప్పాడు. లోపల్నుంచి నాలుగైదు వస్తువులు టీపాసీమీద పడ్డాయి.

వాటిల్లో ఒక పెద్ద కత్తి, రూళ్ళకర్రలాంటి చేతికర్ర, పెద్ద తాళంకప్ప! నైలాన్ దారపుఉండ, వెడల్పాటి ప్లాస్టర్ రోల్ వున్నాయి.

"ఇవన్నీ ఎందుకు తెచ్చావ్?"

"రాత్రికి ఆ రావుగాడ్ని గోవలోకి తెచ్చుకునేందుకు వీటితో అవసరముంటుందని తెచ్చాను" అన్నాడు కూపర్.

"ఆ కత్తి దేనికి? చంపుతావా?"

"అవసరమైతే అంతపని చేసేందుకూ రెడీగా సిద్ధంగా ఉన్నాను" అన్నాడు కూపర్ నిర్లిప్తంగా.

"వద్దు! నాకేమైనా ఫర్వాలేదు. హత్యల్లోమాత్రం ఇరుక్కొని, జీవితాంతం జెయిలుకమ్ములు వెనుక మగ్గిపోవడం నాకు ఇష్టంలేదు!" అంది మంజుల భయంగా.

"మీరు కంగారుపడకండి మేడమ్! నాకుమాత్రం జెయిలుకుపోవడం ఇష్టమనుకున్నారా? కేవలం ఆ రావుగాడ్ని బెదరించేందుకే తెచ్చాను" అన్నాడు కూపర్.

మంజుల మనస్సు తేలికపడింది.

"రావుగాడు మళ్ళీ ఫోన్ చేశాడా?"

"లేదు! నీకన్నా అతను బలంగా ఉన్నట్లున్నాడు. అతనితో నీవు జాగ్రత్తగా ఉండాలి!" అంది మంజుల.

"వాడి మొహం! ఈ శరీరం ఉక్కుపోతది. మీరే చూస్తారుగా రాత్రికి నా తడాఖా!" అన్నాడు కూపర్.

"అవన్నీ ఎక్కడన్నా దాచివుంచుకో! నాకు ఆకలిగా

వుంది. ఎక్కడికన్నా వెళ్ళి భోజనం చేసివద్దాం!" అంది మంజుల.

"అలాగే! ఐదునిముషాల్లో దిగిరండి!" అంటూ క్రిందకు వెళ్ళిపోయాడు కూపర్.

పర్స్‌లో డబ్బు నింపుకొని దిగివచ్చింది మంజుల. కార్లో స్టీరింగు దగ్గిర సిద్ధంగా కూర్చుని కనుపించాడు కూపర్. బ్యాక్ డోర్ తెరచుకుని ఎక్కింది.

"ఏ హోటల్ కు పోనిమ్మంటారు?"

"నాగప్రకాష్‌కు పోదాం! దగ్గరగా ఉంటుంది. త్వరగా ఇంటికి రాగలుగుతాం!"

"అలాగే! మరోవిషయం చెప్పడం మరచాను మేడమ్. నా ఫ్రెండ్ రెడ్డి జెయిల్లోంచి తప్పించుకుని వచ్చాడు. ఇందాకా చైనాబజారులో కలిశాడు" అన్నాడు కూపర్.

"జెయిల్లోంచి తప్పించుకునా?" భయంగా అడిగింది.

"అవును మేడమ్! ఎందుకలా భయపడుతున్నారు?"

"నాకు జెయిలు పేరు వింటేనే హడలు పుట్టుకొస్తుంది. అతనికి నువ్వెక్కడున్నదీ చెప్పావా?"

"ఆఁ చెప్పకుంటే ఒప్పుకోడు. అతన్ని చూస్తూ అబద్ధం చెప్పలేను. అందుకే జరిగినదంతా చెప్పేశాను. జరగవలసిందాన్నిగురించి నేను చేయదలచుకున్నది కూడా చెప్పాను" అన్నాడు కూపర్.

"ఏమన్నాడు?"

"గుడ్ అన్నాడు. అవసరమైతే తనొచ్చి సాయం చెయ్యమన్నా చేస్తానన్నాడు." అన్నాడు కూపర్.

రావు, కూపర్ ఇద్దరే ననుకుంటే మరో జెయిలు పక్షి కూడా రంగంలోకి దిగుతున్నదన్న విషయం ఆమెకు కంపరమెత్తించింది.

"నువ్వేమన్నావ్?" అడిగింది మంజుల.

"అవసరం లేదన్నాను. అతను త్వరగా పని ముగించుకుని రమ్మన్నాడు. కలకత్తానుండి పిలుపు వచ్చిందట మా ఇద్దరికీ...ఏదో పెద్ద కేసట."

"అంతే!"

"దొంగతనమో, మోసమో, ఏదో వుంటుంది" అన్నాడు కూపర్.

కారు దాసప్రకాష్ లోనికి తిరిగింది.

భోజనాలు ముగించుకుని ఎనిమిదింటికల్లా తిరిగి బంగళా చేరుకున్నారు.

కూపర్, మంజుల కలసి రావును ఏ గదిలో బంధించి వుంచితే బాగుంటుందో నిర్ణయించడానికి మొత్తం గదులన్నీ తిరిగారు.

మొదటి అంతస్తులో వున్న స్టోర్ రూం ఎన్నిక చేశారు. దానికి కిటికీలు లేవు. రెండు వెంటిలేటర్సు మాత్రం వున్నాయి. సింగిల్ డోర్ వుంది. దాన్ని పగులగొట్టడం కష్టం.

"ఈ గది బాగుంటుంది!" అన్నాడు కూపర్.

"గుడ్!" అంది మంజుల.

ఇద్దరూ తిరిగి మేడమీద కొచ్చారు.

రావుతో ఎలా వ్యవహరించాలో, ఏం చెయ్యాలో అంతా ఒకమారు రిహార్సలు వేసుకున్నారు.

# 8

గంట తొమ్మిదయింది.

పోర్టికోలో కారాగిన శబ్దమైంది.

"వచ్చాడు రావు!" అన్నాడు కూపర్ లేచి కర్టెన్ చాటుకు వెళ్ళిపోతూ.

మంజుల సోఫాలో సర్దుకుని కూర్చుంది.

నాలుగు నిముషాల తర్వాత రావు గదిలోకొచ్చాడు.

"హల్లో! మంజులా" అంటూ ఎదురుగావున్న సోఫాలో కూలబడ్డాడు. ఆ తర్వాత "ఏం నిర్ణయించుకున్నావ్?"-అంటూ అడిగాడు.

"బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను!" అంది మంజుల.

"గుడ్! నువ్వు తెలివిగలదానివి. నే చెప్పినట్లు చేసేందుకే నిర్ణయించుకున్నావ్ కదూ!" అడిగాడు రావు.

"లేదు! నా ఫోటోలు నీ దగ్గరనుండి బలవంతంగా రాబట్టుకోవడమో, లేదా నిన్ను జెయిలుకు పంపి, నేను మా వారివద్ద విడాకులు పుచ్చుకోవడమో, ఏది వీలయితే అది చేద్దామనుకున్నాను" అంది మంజుల.

"బలవంతంగానా?"

"ఆఁ!"

"అంత బలముందా?"

"లేదని నీ కనుమానంగా వుందా? ఈ క్షణంనుండి నువ్వు నా బందీవి. మర్యాదగా ఫోటోలు త్రిప్పి పంపమని బ్యాంక్‌కు ఉత్తరం రాసివ్వు. లేదా తిండీ తిప్పలూ లేకుండా నీకు హీనమైన చావు చచ్చే ఏర్పాటు చేయిస్తాను" అంది మంజుల.

రావు ఆమె మాటలు విని నివ్వెరపోయాడు. ఆమె ఎవరి అండ చూసుకుని అంత తెగించి, ధైర్యంగా మాట్లాడుతోందో అర్థంగాలేదు రావుకు. చుట్టూ చూసేడు. ఎవ్వరూ కనుపించలేదు.

రావు కామె ధోరణి అర్థంకాలేదు.

"నా మాట విని మర్యాదగా నేను చెప్పినట్లు చెయ్యి. ఇద్దరం బాగుబడతాం!"

"అయితే లాభంలేదంటావ్. నీ మొండి పట్టు విడి

పెట్టనంటావ్!" అంటూ చప్పట్లు కొట్టింది.

కర్టెన్ చాటునున్న కూపర్ వెలుపలకు వచ్చాడు. అతని చేతిలో రెండడుగుల లావుపాటి రూళ్లకర్ర వుంది.

"కూపర్! నా దారికతను రానంటున్నాడు. నీ ఇష్టం. ఏమన్నా చేసుకో!" అంది మంజుల.

"వీడ్ని చూసుకునా నీ ప్రగల్భాలు. వీడి చరిత్ర నీకు తెలీదు. డబ్బుకోసం ఎంత పనయినా చేసే నీచుడు. నీ మీద నేను ప్రయోగించింది వాడ్నే. నువ్వు నాపైన ప్రయోగించేందుకు మాట్లాడుకున్నావా? అయినా అతను నా ఫ్రెండే. విశ్వాస ఘాతకం చెయ్యడు. అవునా కూపర్!" ఆశగా చూస్తూ అన్నాడు.

"నువ్వు చెప్పింది నిజమే మిస్టర్ రావ్! ఆమెకు నాపై నున్న విశ్వాసాన్ని మోసం చెయ్యడం అధర్మం అన్న విషయం తెలిసొచ్చింది. నావల్ల జరిగిన పొరపాటును సర్దు బాటుచేసే అవకాశం కలిగింది. అందుకు ఆనందంగావుంది మర్యాదగా నామాట విని బ్యాంక్ వాళ్ళకు ఉత్తరం రాసివ్వు" అన్నాడు కూపర్, రావు దగ్గరకంటూ వచ్చి.

"నా ఉప్పుతిని, నాకే ఎదురు తిరుగుతున్నావ్! జాగ్రత్త! నిన్ను జెయిలుకు పంపిస్తాను" అన్నాడు రావు.

"ఆమె ఉప్పు నువ్వు తిన్నావ్. అదే నాకు కొంత పెట్టావ్. అందువల్లే నీకు ఎదురుతిరుగుతున్నాను. హత్యలు చెయ్యటం విచిత్రంగా వుండదు నాకు. నేను చెప్పినట్లు చెయ్యి."

"చెయ్యను. నన్ను చంపు. ఆ ఫొటోలు వెనువెంటనే ఈ దేశంలోని అన్ని పేపర్లలోనూ పడతాయి. నేను చచ్చినా మిమ్మల్ని సుఖపడనివ్వను" అన్నాడు రావు.

"అయితే నీ అంతు నేను చూస్తాను" అంటూ చేతిలోని కర్రతో తలమీద బలంగా మోదాడు కూపర్.

రావు "అమ్మా!" అంటూ సోఫాలో వాలిపోయాడు.

"కూపర్! అతన్ని చంపావా?" సోఫాలోంచి క్రిందకు దూకుతూ అడిగింది మంజుల.

"లేదు మేడమ్! మీరు భయపడకండి."

"జాగ్రత్త! ఇతనికి మూర్ఛరోగం కూడావుంది. ఎక్కువగా ఎక్సైయిట్ అయితే సొమ్మసిల్లి పడిపోతాడు. అప్పుడేదో మందు మ్రింగుతాడు. అది మ్రింగకుంటే ప్రాణం పోతుందని నాకు చాలాసార్లు చెప్పాడు."

"అతని సంగతి నాకు వదిలెయ్యండి!" అంటూ కూపర్ రావుని సోఫాలోంచి నేలపైకి లాగాడు. ప్రాణంలేనట్లు కట్టెలా బిగుసుకుపోయాడు. కుడిచేయి పిడికిలి బిగించి కూపర్ పొట్టలో బలంగా గుద్దాడు. దెబ్బకు కూపర్ ఆరడుగుల దూరంలో క్రిందపడ్డాడు.

మంజులకు కళ్ళు తిరిగాయి. సోఫాలో వాలిపోయింది.

కూపర్ పైకి లంఘించి దూకాడు రావు. పొట్టపైన కూర్చున్నాడు. ఎడంచెయ్యి మెడపైన పెట్టి, కుడిచెయ్యి పిడికిలి బిగించి మొహంమీద కొట్టేందుకు పైకెత్తాడు.

అదే సమయంలో కూపర్ కాళ్ళు రెండు పైకెత్తి, రావు మెడచుట్టూ వేసి ఘట్టిగా బిగించాడు. మెడనరాలు జివ్వుమన్నాయి రావుకు. కూపర్ మెడమీదున్న చెయ్యి పట్టు వదులయింది. అదే అదనుగా ఘట్టిగాలి పీల్చి వదిలాడు కూపర్. రావు బాలన్స్ పోయింది. కూపర్ అతన్ని పల్టీకొట్టించాడు వెనక్కి. రావు క్రింద పడి పోయాడు. మెరుపుతీగలా లేచి రావుపైన కూర్చున్నాడు కూపర్. రెండు చెంపలూ తపీ, తపీమని వాయించేశాడు.

ఆ నొప్పికి రావుకళ్ళు మూతలుపడ్డాయి. కాళ్ళు జావ చచ్చాయి.

కూపర్ నైలాన్ తాడు తెచ్చి చేతులు రెండు ఘట్టిగా

కట్టాడు. అరవకుండా వుండేందుకు ప్లాస్టర్ తెరచి నాలుగు అంగుళాల ముక్క కట్ చేసి నోటికి కరిపించాడు.

మంజులను తట్టిలేపాడు. కూపర్‌ను చూడగానే "ఏమైంది?" అడిగింది.

"ఎందుకలా భయపడ్డారు?"

"నువ్వు క్రింద పడిపోవడం చూశాను. నాకు మతి పోయింది."

"మంచివాళ్ళే! నామీద నాకు నమ్మకం లేకుంటే మీకు మాటిస్తానా! అదిగో రావును చూడండి" అన్నాడు కూపర్.

మంజుల అతను చూపించిన దిక్కుకేసి చూసింది. రావు బోరగిలా పడివున్నాడు. ఇద్దరూ కలసి అతన్ని క్రింది రూంలోకి తీసుకెళ్ళారు. లోపలకుతోసి, కూపర్ ప్రత్యేకంగా కొని తెచ్చిన పెద్ద తాళంకప్ప బిగించారు. తాళంచెవి మంజుల చేతిలో పెట్టాడు.

ఇద్దరూ తిరిగి గదిలోకి వచ్చారు.

"అతనికి స్పృహ రావటానికొక గంట పడుతుంది!" అన్నాడు కూపర్.

మంజుల గది మూలగావున్న ఫ్రిజ్ తెరచి రెండు గ్లాసులతో ఐస్ వాటర్ తెచ్చి ఒక గ్లాసు కూపర్ కందించి, కొద్దికొద్దిగా త్రాగుతూ కూర్చుంది.

"అతన్ని బంధించాం! అందువల్ల మనకు జరిగిందేమిటి? ఉత్తరం రాసివ్వనంటున్నాడుగా?" అంది మంజుల.

"మన చేతి దెబ్బ ఇప్పుడు రుచిచూశాడుగా! ఈ సారు స్పృహ రాగానే మనం అడగకుండానే పిలిచి రాసిస్తాడు ఉత్తరం!" అన్నాడు కూపర్.

"అతను అలా రాసిస్తాడని నీకు ఆశ వుందా?"

"ఆఁ!"

"అయితే నన్ను వచ్చి లేపు. బహుశా నేను మేలుకొనే వుంటాను" అంది మంజుల.

కూపర్ దిగి వెళ్ళిపోయాడు.

మంజుల బెడ్ పైన పడుకుంది. కూపర్ గతం ఎటువంటిదైనా, ప్రస్తుతం తనకు సాయం చెయ్యడం తలచుకొని సంతోషించింది. తన్నేదో పెద్ద మనిషని అభిమానించడం, తలచుకొని నవ్వుకుంది. అతనిదగ్గర ఆనందం జుర్రుకోవాలనీ అలాఅతనితో మంచిగా ప్రవర్తించాననీ, సాయంచేశాననీ తెలుసే... ఏంచేస్తాడో, ఎలా మారిపోతాడో ఊహించలేకపోయింది. ఈ పాయింటుపైన రావు ఏదైనా కూపర్ కు చెప్పి నమ్మించగలిగితే తన ఆట కట్టు. మళ్ళా భయం పుట్టుకొచ్చింది.

గంటయింది. కూపర్ కోసం ఎదురుచూసింది. అతను వస్తున్న జాడలేదు.అతను రాకపోవడం ఆమెకు ఆందోళన కలిగించింది. రావుకు యింకా స్పృహ రాలేదా? కొంపదీసి గుటుక్కుమన్నాడేమోనన్న భయంతో గుండెలు దిగజారాయి.

మంజుల లేచి క్రిందికొచ్చింది.

పహరా సైనికుడిలా అటూ ఇటూ గది తలుపు ముందు పచార్లు చేస్తున్నాడు కూపర్. మంజులను చూసి ఆగిపోయాడు.

"మీరు నిద్రపోలేదా మేడమ్!" అడిగాడు.

"నిద్రా? ఎలా వస్తుంది? ఇంతకూ రావుకు స్పృహ వచ్చిందా? లేదా?"

"రాలేదు."

"ఎందుకయినా మంచిది. తలుపు తెరచి చూడు" అంది.

కూపర్ కు తాళంచెవి ఇచ్చింది. అతను తలుపు తెర

చూడు. పాత కిరోసిన్ టిన్ పైన కూర్చుని సిగరెట్ త్రాగుతున్నాడు రావు.

"ఏంటి? మళ్ళీ వచ్చావెందుకు?" అడిగాడు కోపంగా.

"నువ్వు వచ్చావని భయపడింది మేడమ్. నా దెబ్బ రుచిచూశావ్ గా. ఇప్పటికైనా మర్యాదగా రాసిస్తావా? లేక ఇంకోమారు వడ్డించమంటావా?" అడిగాడు కూపర్.

"నన్నేం చేసినా లాభంలేదు. రాసివ్వను" రావు నిష్కర్షగా తెగేసి చెప్పాడు.

"నువ్వు రాసివ్వనంత మాత్రాన ఆ ఫోటోలు మేము సంపాదించలేమని అనుకోవద్దు" అన్నాడు కూపర్.

"అయితే నన్నెందుకు బంధించారు? వదిలెయ్యండి!"

"అవి మా చేతుల్లో పడేదాకా నీకీ బంధిఖానా తప్పదు" అంటూ కూపర్ వెలుపలకొచ్చాడు. అతని వెంట మంజులగూడా వచ్చేసింది. మళ్ళీ యథాప్రకారం తాళంవేశాడు గదికి కూపర్.

ఇద్దరూ మేడపైకి వచ్చారు.

"వాడో మొండిఘటం! ఇలాంటి వాటికి భయపడే రకంకాదు!" అంది మంజుల నిరుత్సాహంగా.

"మేడమ్! అలా దిగులుపడకండి. అతని బ్యాంక్ లాకర్ ఏ బ్యాంక్ లో వుందో మీకు తెలుసా?" అడిగాడు.

"తెలుసు! మౌంట్ రోడ్ లోని ఐ. ఓ. బీలో."

"అంటే ఆ కవరుకూడా అక్కడికే పంపివుండాలి. అతని సంతకంచేసిన పేపరు మీ దగ్గరేదయినా వుందా?"

"వుంది!" అంది మంజుల.

"పట్టుకురండి" అన్నాడు కూపర్.

"ఏంచేస్తావ్?"

"నాకు తెలిసిన మనిషొకడున్నాడు. సంతకాలు ఫోర్జ్ చెయ్యడంలో దిట్ట. మీరు బ్యాంక్ వాళ్ళకు లెటర్ ఒకటి

తయారుచెయ్యండి. నేను వెళ్ళి రావుగాడి సంతకం చేయించుకొస్తాను" అన్నాడు కూపర్.

"ఎప్పుడు వెళ్తావ్?"

"ఇప్పుడే వెళ్తాను. తెల్లారేసరికి మనదగ్గర ఉత్తరం తయారుగావుంటే, తెల్లారగానే బ్యాంక్ కువెళ్ళి ఫొటోలు తెచ్చుకోవచ్చు. ఆ తర్వాత వాడిమానాన వాడ్ని పొమ్మందాం!"

"మనపైన కేసు పెడితే!"

"అదెలాగో సర్దుకోవచ్చు మీరు. ముందు ఫొటోలు చిక్కితే చాలు."

కూపర్ చెప్పింది బాగుందనిపించింది మంజులకు. వెంటనే క్రిందకువెళ్ళి లెటర్ టైపుచేసి తెచ్చింది. అంతకు పదిరోజులముందు కలకత్తాకు రావు రాసిన ఉత్తరం వెతికి ఇచ్చింది. డబ్బుకూడా అందించింది.

"మీరు జాగ్రత్తగా ఉండండి. ఏ పరిస్థితుల్లోనూ ఆ గదితలుపులు తియ్యకండి. నేను రెండు మూడు గంటల్లో వచ్చేస్తాను" అన్నాడు కూపర్.

"సరే! జాగ్రత్తగా వెళ్ళిరా!" అంది మంజుల.

కూపర్ వెళ్ళిపోయాడు.

# 9

లంకంత బంగళాలో తనూ, రావుగాడు మాత్రమే మిగిలిపోయామనీ, ఏదైనా ప్రమాదం జరిగితే, సాయం చేసేందుకు వేరే మనిషెవ్వరూ లేరన్న భావన ఆమెను భయంతో ముంచివేసింది.

కూపర్ పైని గౌరవం, అభిమానం నిండుకున్నాయి ఆమెలో. కానీ ఆమెకు అర్థంగానిదల్లా, తను ఒంటరిగానే వుంటున్నా, అతను తన్ను పొందాలని ఎందుకు తపన

పడటంలేదని మాత్రమే. బహుశా అతని కళ్ళకు ముసలి దానిలా వున్నానేమో ననుకుంది. ఇప్పటి పరిస్థితుల్లో అతనేంచేసినా తను కాదనగు. ఏంచెప్పినా వింటుంది.

ఆ రావుగాడు తలుపులు బ్రద్దలుకొట్టి, పైకొస్తాడేమో నన్న భయంతో వెళ్ళి గది తలుపులు మూసి లోపల్నుంచి తాళం వేసుకొని వచ్చి కూర్చుంది. అలా రెండు గంటలు గడిచాయి. వాచీ చూసుకుంది. గంట పన్నెండయింది.

లేచి కాసేపు పచార్లు చేసింది. తలంతా నొప్పిగా అనిపించింది. క్రింద అంతస్థులోవున్న కిచెన్ కేసి బయలు దేరింది, కాఫీ తయారుచేసుకుందామని. స్టోర్ రూం ప్రక్కనే కిచన్.

రావును బంధించి వుంచిన గదివద్దకు రాగానే దబదబ మన్న శబ్దమయింది. రూంముందు నిలబడి చూచింది. లోప ల్నుంచి రావు బలంగా తలుపును దేంతోనో కొడు తున్నాడు. అప్పటికెంత సేపట్నుంచి అతనా ప్రయత్నంలో వున్నాడోగానీ, తలుపులు వదులుగా ఊగుతున్నాయి. అవి వూడాయంటే... మంజుల వొణికిపోయింది. సమ యానికి కూపర్ గూడా ఇంట్లోలేడు. ఆ తలుపులు కాస్తా విరిగి, రావు బయటపడ్డాడంటే, తన గతి అధోగతే ననుకుంది.

కిచెన్ లోకి వెళ్ళి కాఫీ కూడా పెట్టుకోవాలన్న ధ్యాసలేకుండా పోయింది. రావు తలుపుల్ని లోపల్నుంచి దేంతోనో బలంగా కొడుతున్నాడు. ఆ తలుపుముందు నాలుగడుగుల కారిడార్ వుంది. ఆ తలుపు రాకుండా ఏదైనా అడ్డం పెడదామని అనుకుంది. కిచెన్ లోకి వెళ్ళి చూసింది. ఏమీ కనుపించలేదు. కొయ్యషెల్ఫ్ వుంది. దాన్ని అడ్డంగా పెడితే తలుపురాదు.

కానీ ఆ షెల్ఫ్ ను కదలించడం వల్లకాని పని. కూపర్

వస్తున్న జాడలేదు. భయం ఎక్కువయిపోయింది. పోర్టికో పక్కనే పూలచెట్ల వద్దకొచ్చి అక్కడ్నుంచి రోడ్ కేసి చూసింది, తెల్లకారు వస్తూందేమోనని. కారు కనుపించలేదు. కానీ కాలికి ఏదో ఘట్టిగా తగిలింది. వంగిచూసింది. అది గడ్డపార. నాలుగడుగుల పొడవుంది.

తళుక్కుమని ఓ ఆలోచన మెరిసింది. అది తీసుకుని లోనికి వెళ్లింది. బాగా బరువనిపించింది. రొప్పుకుంటూనే మోసుకుపోయింది. రావుని బంధించివున్న గది తలుపుకూ, కారిడార్ గోడకు ఆ నేట్లు, అడ్డంగా పెట్టింది. అతను తలుపు తెరిచే ప్రయత్నం విరమించుకోలేదు. గడ్డపార అడ్డంగా పెట్టగానే, లోపల్నుంచి అతను నెట్టినా తలుపు కదలలేదు. మంజులకు ధైర్యం వచ్చింది.

మెల్లగా తలుపు తట్టింది.

"ఎవరది? కూపరా?" అడిగాడు రావు లోనుండి.

"కాదు! నేను!" అంది మంజుల.

"తలుపు తెరువు. నీతో మాట్లాడాలి!" అన్నాడు రావు.

"తియ్యను. నాకు వినాలని కుతూహలంగాలేదు. రేపు మధ్యాహ్నందాకా నువ్వా గదిలో వుండాల్సిందే! ఆలోగా నా ఫొటోలు నాకు చేరుతాయి" అంది మంజుల.

"ఇంతకు ఇంత అనుభవిస్తావ్" అన్నాడు రావు.

"అదంతా తర్వాత సంగతి. నువ్వు అల్లరిచెయ్యకుండా కూర్చో!" అంది మంజుల.

"నాకు దాహంగా వుంది. కాసిని మంచినీళ్ళన్నా ఇవ్వు."

"ఇస్తాను. ఇప్పుడుకాదు. కూపర్ను రానీ" అంటూ అక్కడనుంచి కదలి వెళ్ళిపోయింది. తన ధైర్యానికీ, తెలివికీ, తనే ఆశ్చర్యపోయింది.

గంట మూడవుతుండగా కారొచ్చి ఆగిన శబ్దమైంది. కూపర్ పైకొచ్చాడు.

"ఇంత సేపయిందేం?" అడిగింది మంజుల.

"ఈ రావుగాడి సంతకం ఫోర్జరీ చెయ్యడం చాలా కష్టమైంది. అతను నాలాసార్లు తంటాలుపడ్డాడు. ప్రతిసారీ అతనికి ఏదో అనుమానం కలగడం, దాన్ని కొట్టెయ్యడం. అలానే చాలా సేపు తంటాలుపడ్డాడు."

"చివరికేమయింది. సంతకం చెయ్యగలిగాడా?"

"ఆఁ!" అంటూ ఆమె ఇచ్చిన కాగితాలు తిరిగి ఇచ్చాడు. వాట్ని తీసుకుని బ్యాంక్‌కు రాసిన ఉత్తరం లోని సంతకాన్నీ, రావువద్దనుండి వచ్చిన ఉత్తరంలోని సంతకాన్నీ మార్చిమార్చి చూసింది. ఆమెకు ఆశ్చర్య మేసింది. రెండు ఒక్కలాగే వున్నాయి. ఫోర్జరీ సంతకమని ఎవ్వరూ కనిపెట్టలేరు.

"మార్వెలెక్. చాలా బాగుంది. అతనికి నా గురించి చెప్పావా?" అడిగింది మంజుల.

"అవసరం లేకపోయింది. ఐదొందలిచ్చాను. ముందు వెయ్యిదాకా అడిగాడు. నయాన చెప్పి, భయపెట్టి పని చేయించుకొచ్చాను" అన్నాడు కూపర్.

రావు చెయ్యబోయిన ఘనకార్యం, తను తెలివిగా చేసిన పని విశదంగా చెప్పింది. కూపర్ మెచ్చుకొన్నాడు మంజులను.

"ఓమారు చూసొస్తాను" అంటూ క్రిందికి వెళ్ళాడు కూపర్.

ఉత్తరాలు రెండుతీసి తలగడక్రింద దాచింది. గుండెల మీద వున్న ఒక పెద్ద బరువు దించినట్లయింది.

కూపర్ తిరిగివచ్చాక సిగ్గువిడిచి అతనిపై తనకున్న

కోరిక చెప్పేందుకు తీర్మానించుకుంది. ఆ రోజు విజయవాడ స్టేషనులో అతనికి సాయంచేసిందా వుద్దేశ్యంతోనే. ఎంత మరుద్దామన్నా వీలుకావటంలేదా కోరికలు ఆమెకు.

కూపర్ తిరిగి వచ్చాడు గదిలోకి.

"ఏమంటున్నాడు రావ్?"

"సుభ్రంగా నిద్రపోతున్నట్టున్నాడు!"

"తలుపులు తెరచి చూశావా?"

"లేదు!" అన్నాడు కూపర్.

"పాపం నిన్న పొద్దుట్నుంచి రెస్ట్ లేకుండా తిరుగుతున్నట్టున్నావ్. కాసేపు పడుకుంటావా? పదింటికిగాని బ్యాంక్ తీయరు. ఈలోగా నిద్రపోయి లేవచ్చు" అంది గోముగా.

"నాకూ కూడా కళ్ళు కూరుకుపోతున్నాయి మేడమ్. వెళ్ళి క్రిందపడుకుంటాను" అన్నాడు కూపర్.

"వద్దు. ఒంటరిగా పడుకోవాలంటే నాకు భయం. నువ్వుకూడా ఇక్కడే పడుకో, ధైర్యంగా వుంటుంది. నువ్వా మంచంమీద పడుకో. నేను సోఫాలో సర్దుకుంటాను" అంది మంజుల.

"నో! నో! మీరే మంచంపైన పడుకోండి" అంటూ కూపర్ లేచి సోఫావైపు నడిచాడు.

"కూపర్!" పిలిచింది పడుకునే మంజుల.

"ఏమిటి మేడమ్!"

"లైటు తీసేస్తే త్వరగా నిద్రవస్తుంది. తీసేసేదా?"

"మీయిష్టం!" అన్నాడు కూపర్.

మంజుల లేచి లైటార్పింది. తిరిగొచ్చి ప్రక్కపైన పడుకుంది. కూపర్ లేచి తనకోసం వస్తాడేమోనని ఆశగా చూస్తూ మేలుకునేవుంది. అతనిలో కదలిక లేదు. కాలం

వృధా కావడం ఆమెకు బాధగా వుంది. మెల్లగా మంచం దిగింది.

అడుగులో అడుగు వేసుకుంటూ కూపర్ పడుకున్న సోఫా వైపు నడిచింది. వెల్లకిలా పడుకుని వున్నాడు. సోఫా అంచున కూచుని రెండు చేతులతో అతని పెంపవైపున్న వెంట్రుకల్ని నిమిరింది. అతను కళ్ళు తెరిచాడు. అంత దగ్గరలో కనుపించిన మంజుల్ని చూసి ఉలిక్కిపడ్డాడు. చక్కున లేచి కూర్చున్నాడు.

"మేడమ్!" అన్నాడు దీనంగా.

"ఐ ఆమ్ మేడ్ నౌ!" అంది దీనంగా.

"నాకు తెలుసు. కానీ నేను నపుంసకుణ్ణి. మీ కుపయోగ పడను," అన్నాడు తల వంచుకుని కూపర్ సిగ్గుతో.

"నిజంగా నా?"

"అవును!"

ఆమె నెత్తిన అగ్నిపర్వతం బ్రద్దలయినట్లయింది. వెతికి వెతికి చివరకు తను ఏరుకొని తెచ్చుకుంది ఒక అప్రయోజకుణ్ణని తెలిశాక, కూపర్ ముహం చూడలేకపోయింది. మనుషుల్లో అలాంటివాళ్ళుకూడా ఉంటారన్న నగ్నసత్యం ఆమెకు అర్థమయిందా క్షణంలోనే. శరీరంలో కోరికలు చల్లబడ్డాయి. తిరిగొచ్చి మంచంపైన పడుకుంది.

టెలిఫోన్ మ్రోగింది.

కూపర్ ఫోన్ అందుకునే ప్రయత్నం చెయ్యలేదు. అలాగే సోఫాలో కూర్చున్నాడు.

మంజుల వెళ్ళి రసీవరు అందుకుని మాట్లాడింది. ఫోన్ పెట్టేసింది.

హోటల్ ఓల్గానుంచి వచ్చింది ఫోన్. ఆమె భర్తయిన డాల్మియా ఉదయం ఎనిమిదిన్నరకల్లా వచ్చే విమానంలో దిగుతున్నట్లు చెప్పారు.

మూలిగే నక్కపైన తాటికాయ పడ్డట్లయింది ఆవార్త వినగానే. "కూపర్!" పిలిచింది.

"మేడమ్!" అంటూ వచ్చి నిలబడ్డాడు.

అతన్ని చూస్తే ఇప్పుడా మొహంలో ఉద్రేకంగానీ, ఉత్సాహంగానీ లేవు.

"మావారు రేపుదయం వస్తున్నారు. నేను హోటల్ ఓబ్రాయ్ వెళ్ళిపోతున్నాను. ఆ ఉత్తరాలు నీ దగ్గర ఇస్తాను. నువ్వు బ్యాంక్ కు వెళ్ళి ఫొటోలు తీసుకుని నాకు హోటల్ లో ఇచ్చెయ్యి. ఆ తర్వాత రావును వదిలి పెట్టెయ్యి. ఆయన సామాన్యంగా వెంటనే ఇంటికి వెళ్ళమంటారు. పన్నెండుదాకా వార్ని ఎలాగో ఒకలా అక్కడే ఉంచే ప్రయత్నం చేస్తాను. ఈలోగా నువ్వు పని పూర్తి చెయ్యాలి. ఇందుకు నీకు ప్రతిఫలంగా పదివేలు ఇవ్వదలచుకున్నాను," అంది మంజుల.

"నాకు డబ్బు అవసరంలేదు. నావల్ల మీకు జరిగిన అపకారానికి ప్రతిగా చేస్తున్నా నీ సాయం. అంతే!" అన్నాడు కూపర్.

"నీయిష్టం. నేను చెప్పవలసింది చెప్పాను" అంటూ గబగబ డ్రెస్ చేసుకోవడం మొదలెట్టింది.

"మిమ్మల్ని హోటల్ లో డ్రాప్ చెయ్యమంటారా?"

"నీకు కారు కావాలిగా! నన్ను వదిలేసి తిరిగొచ్చెయ్యి" అంది మంజుల.

పదిహేనునిముషాల తర్వాత కారు హోటల్ ఓబ్రాయ్ వైపు ప్రయాణం సాగించింది.

## 10

తొమ్మిదింటికల్లా డాల్ఫిన్ కారు హోటల్ కొచ్చింది. మంజుల ఏర్ పోర్ట్ కి వెళ్దామనుకుని, నిద్రలేకపోవటంవల్ల నీరసంగా ఉండటంతో రెండు పెగ్గులు విస్కీ త్రాగి పడు

కుంది. మత్తుగా నిద్రపట్టేసింది.

డాల్మియా వస్తూనే మంజులను ముద్దుపెట్టుకుని "ఇంకా నిద్రపోతున్నావేం?" అడిగాడు.

"రాత్రి సరిగా నిద్రలేదు. వేకువ ఝామున పట్టింది" అంది మంజుల.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు డాల్మియా.

"ఏమీ లేవు! అంతా మామూలే! మీరు రేపు వస్తానన్నారుగా. ఇవాళే వచ్చేశారేం?"

"నిన్ను చూడందే వుండలేక. పైగా ఇక్కడ రెండు మూడు అర్జంటు పనులుకూడా చూచుకోవలసి వచ్చింది. అంతే ప్రయాణం మార్చుకుని వచ్చేశాను. త్వరగా డ్రెస్ వేసుకో. ఇంటికి వెళ్ళిపోదాం!" అన్నాడు డాల్మియా.

"వెళ్దాం లెండి! తొందరేముంది. గంగయ్యకూడా లేడు. చేపలు తెమ్మని మహాబలిపురం పంపాను. ఈ వేళ సాయంత్రం వస్తాడనుకుంటాను. భోజనం చేసి వెళ్దాం లెండి" అంది మంజుల.

"అలాగే!" అన్నాడు డాల్మియా.

మంజుల లేచి బాత్ రూంలోకి వెళ్ళింది.

గంట పదకొండయింది.

టెలిఫోన్ మ్రోగింది.

డాల్మియా రిసీవరు అందుకున్నాడు. తను హల్లో అనక ముందే అవతలి వ్యక్తి "మేడమ్! వాడు మనల్ని బోల్తా కొట్టించాడు!" అన్నాడు.

డాల్మియా "ఎవరోయ్ నువ్వు! ఎవరు కావాలి!" అడిగాడు అది రాంగ్ నెంబరేమో ననుకుని.

"మంజులగారు లేరా?"

"ఉంది."

"ఆమెతో మాట్లాడాలి!"

"నువ్వెవరు?"

"నీ కనవసరం. అమ్మగార్ని ఫోన్ దగ్గరకు పిలువు" అన్నా డతను.

"ఉండు పిలుస్తాను" అన్నాడు డాల్మియా. బాత్ రూం దగ్గరకెళ్ళి తలుపుతట్టి మంజులను పిలిచి, ఎవరో ఫోన్ చేశారని చెప్పాడు.

మంజుల టవల్ రొమ్ముల పైదాకా కట్టుకొని, తడి శరీరంతోనే వచ్చి రిసీవరు తీసుకుని "హల్లో!" అంది.

"నేను మేడమ్ కూపర్‌ని. రావుగాడు బోలా కొట్టించాడు. అసలా ఫోటోలు బ్యాంక్‌కు పంపనేలేదట. ఆ ఏజంటు ఉత్తరం చూచి చాలా చికాకుపడ్డాడు. అతన్ని చీవాట్లు పెట్టేందుకు ఫోన్ చేశాడుగూడా" అన్నాడు కూపర్.

"సారీ! మీరెవరో నాకు తెలీదు. రాంగ్ నెంబరయి ఉంటుంది" అంటూ ఫోన్ పెట్టేసింది.

"ఎవరు డియర్!" అడిగాడు డాల్మియా.

"ఏమో? అర్థంగాలేదు!" అంటూ బాత్ రూంకు వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయాక నవ్వుకున్నాడు డాల్మియా. సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు.

మంజుల స్నానం పూర్తిచేసుకుని వచ్చి డ్రెస్ చేసుకోసాగింది.

"మంజూ!" పిలిచాడు డాల్మియా.

"ఏమిటండీ!" అడిగింది.

"మన రావు కలిశాడా?"

"లేదండీ!"

"నువ్వొచ్చి రెండ్రోజులయింది. అతన్ని కలిసి లెఖ

లన్నీ అవక తవకలుగా ఎందుకున్నాయో పరీక్షించమని చెప్పాను. మరి నువ్వొచ్చి ఏం చేసినట్లు'' అడిగాడు డాల్మియా.

''ఫోన్ చేస్తూనే వున్నాను అతనికి. ఊళ్లో లేడని చెప్పారు'' అంది మంజుల.

''అతని కారు మన బంగళా దగ్గర వుండింది. ఎందుకని?'' అడిగాడు డాల్మియా.

కుప్పలా కూలిపోయింది మంజుల. వెంటనే స్పృహ కూడా తప్పిపోయింది. డాల్మియా లేచి చల్లటి నీళ్లు మంజుల మొహంపైన చల్లాడు. ఆమె కళ్లు తెరిచింది.

''ఏమిటలా మారిపోయావ్?'' అడిగాడు డాల్మియా.

మంజుల మాట్లాడలేదు.

''మంజూ! డబ్బుండగానే మనిషికి సరిపోదు! అది తెచ్చే సమస్యల్ని తెలివిగా ఎదుర్కోగలగాలి. అంతు లేని ధైర్యం, అసమాన్యమైన యుక్తి కావాలి. మన లాంటి వాళ్ళచుట్టూ ఎప్పుడూ ఎవరో ఒకరు వలలు వేస్తారు'' అన్నాడు డాల్మియా.

మంజులకు డాల్మియా ఎందుకలా మాట్లాడుతున్నాడో అర్థంకాలేదు.

''డ్రెస్ చేసుకుని నా వెంటరా!''అన్నాడు డాల్మియా.

మంజుల చకచక తయారయింది. ఇద్దరూ కలిసి కారెక్కారు. కారు వాళ్ళ స్వంత బంగళాకు పోవాలని డ్రైవరుతో చెప్పాడు.

పోర్టికోలో రావు కారు, దాని వెనుక అంబాసిడర్ రెండూ వున్నాయి.

మంజులకు మెదడు పనిచెయ్యడం మాని చాలా సేపయింది. అతనితో పాటు దిగి లోనికి నడచింది.

హాల్లోనే ఎదురయినాడు కూపర్.

అతన్ని చూడగానే గుండెలు దిగజారాయి మంజులకు.

"రావేం చేస్తున్నాడు?" అడిగాడు డాల్మియా.

"గదిలో వున్నాడు" చెప్పాడు కూపర్.

"గెడ్డేడి?"

"ఇప్పుడే వచ్చాడు."

"రావును పైకి తీసుకొని రండి!" అన్నాడు డాల్మియా.

మంజులకు అర్థంగాలేదు. కూపర్‌కు డాల్మియాను తెలుసో, లేదో. వాళ్ళ సంభాషణల్నిబట్టి అర్థంగాలేదు. గెడ్డి అనే ఫ్రెండ్ ఒకడున్నాడని కూపర్ చెప్పాడు తప్ప, అతన్ని తను చూడలేదు. మరి అతన్ని గురించి డాల్మియా అడగడం విచిత్రంగా తోచింది.

డాల్మియా వెంట మేడపైకి వెళ్ళింది.

"కూర్చో మంజూ!" అన్నాడు డాల్మియా.

మంజుల అతనివైపు చూడకుండానే మౌనంగా కూర్చుంది.

రావును వెంటబెట్టుకొచ్చారు, కూపర్, గెడ్డీ ఇద్దరూ.

"కూర్చో మిస్టర్ రావ్!" అన్నాడు డాల్మియా.

రావుకు ధైర్యం వచ్చింది. కుర్చీలో కూర్చున్నాడు.

"నాతో నీ కెన్నేళ్ళ పరిచయముంది?" అడిగాడు డాల్మియా రావును.

"పాతిక సంవత్సరాలు!"

"ఇన్నేళ్ళనుండీ నా వ్యవహారాలన్నీ నువ్వే చూస్తూ న్నావ్. నన్ను ఎన్నోసార్లు మోసంచేశావ్. తెలుసుకొని గూడా నిన్నేమీ చెయ్యలేదు. కానీ ఈ మధ్య నువ్వు చాలా వెధవపనులు చేశావ్. దొంగ సంతకాలు చేసి, నా షేర్లు చాలా అమ్మావ్. ఆ డబ్బంతా రేసుల్లో పెట్టావ్. నీ సెక్రెటరీ ఎప్పటికప్పుడు నీ ఎత్తులు నాకు తెలుపుతూండింది. ఆమే నువ్వు మంజులను బ్లాక్ మెయిల్

చేసేందుకు పథకం వేస్తున్నావని తెలిపింది. ఆ విషయం తెలియగానే, నా అనుచరులయిన కూపర్‌ను, రెడ్డినీ నీకు బాడీగార్డుల్లా నియమించాను. నే నూహించినట్లే నువ్వు పథకం వేశావ్. కానీ దురదృష్టం నా మనుషుల్నే నియమించుకున్నావ్'' అన్నాడు డాల్మియా.

''నా కంతా అర్థమయింది! కానీ ఒకటిమాత్రం మీరు తెలుసుకోలేదు. నేను ఏమైనా, మీ పరువు బజారునపడే ఏర్పాట్లు పకడ్బందీగా చేశాను'' అన్నాడు రావు.

''ఏం చేశావ్?''

''ఆ ఫొటోలు నా స్నేహితుడి కిచ్చాను నాకు ప్రమాదం జరిగిన పక్షంలో వందలకొద్దీ కాపీలు తీసి వాటిని పేపర్లకు పంపమన్నాను'' అన్నాడు రావు.

''ఆ ఫొటోలు బ్యాంక్‌లో కూడా లేవు సార్ నే వెళ్ళివచ్చాను'' అన్నాడు కూపర్.

''నేను ఎయిర్ పోర్టునుంచి తిన్నగా ఇక్కడికొచ్చాను. మీ రెవ్వరూ లేరు. కానీ రెడ్డి ట్రంక్‌లో చెప్పాడు రావును బంధించి వుంచామని. అతని కారు పోర్టుకోలో కనుపించింది. అందులో బ్రాండ్ కేస్ వుంది. దాన్ని తీసి చూశాను'' అన్నాడు డాల్మియా.

''ఆ ఫొటోలు చూశారా?'' అడిగాడు రావు ఆత్రంగా.

''ఇవేనా?'' అంటూ జేబులోంచి పసుపుపచ్చని కవరు తీసి చూపించాడు.

''అవే! అవే!'' అంటూ స్పృహతప్పి పడిపోయాడు. కూపర్ గ్లాసులో నీళ్ళు తెచ్చి అతని ముఖాన చల్లాడు. రావు కళ్ళు తెరిచాడు.

''నువ్వెళ్ళిపోవచ్చు. రెండు దినాల్లో నిన్ను పోలీసులు అరెస్టుచేసే ఏర్పాటు చేస్తాను'' అన్నాడు డాల్మియా.

రావు తలవంచుకొని వెలుపలికి వెళ్ళిపోయాడు.

కూపర్ రెడ్డి ఇద్దరూ డాల్మియా దగ్గర శెలవు పుచ్చుకొని వెళ్ళిపోయారు.

"మంజూ! నా పవిత్రమైన ప్రేమకు చిహ్నంగా నీ కిదిగో కానుక!" అంటూ ఫొటోలున్న కవరు అందించాడు. ఆమె కృతజ్ఞతతో అందుకుంది.

"మంజూ! మనలాంటి డబ్బున్న వాళ్ళకు అడుగడుగునా ఆపదలే కాచుకొని వుంటాయ్! ఇంకపైనన్నా జాగ్రత్తగా వుండు" అన్నాడు డాల్మియా, ఆమెను ప్రేమగా చూస్తూ.

"సారీ! ఇకపైన నా వల్ల ఎటువంటి పొరపాటు జరగకుండా చూచుకుంటాను" అంది మంజుల సిగ్గుతో తల వంచుకొంటూ.

—: ఐ పో యిం ది :—

# అగ్ని గుండాలు

## కంచర్ల రమణ

తలుపుమీద ఎవరో టకటకమని శబ్దం చేయడం వినగానే, వీధి ద్వారం వైపు చూశాడు సీతాపతి.

వెలుపల ద్వారంవద్ద యాభైయేళ్ళ వ్యక్తి నించుని వున్నాడు. రాజకీయ నాయకుడిలా, తెల్లని పంచె, తెల్లని చొక్కా ధరించి వున్నాడు. కాళ్ళకు అకు చెప్పులు.

సీతాపతి తనవైపు తిరగ్గానే, చిరునవ్వు నవ్వి "లోపలికి రావచ్చా?" అని అడిగాడా వ్యక్తి.

"రండి! రండి!" అంటూ ఆ వ్యక్తిని లోనికి ఆహ్వానించి సాదరంగా ఓ కుర్చీలో కూచోబెట్టాడు సీతాపతి.

"చెప్పండి ఏమిటిలా వచ్చారు?" అన్నాడు అతనికి కాస్త దూరంలో ఠీవిగా నిలుచొంటూ సీతాపతి.

"నేను 'ఆంధ్ర యువత' పత్రిక విలేఖర్ని. నన్ను నాగరాజు అంటారు" అంటూ ఆ వ్యక్తి తనను తాను పరిచయం చేసుకోగానే "నమస్కారం. నా పేరు సీతాపతి. ఎమ్. ఏ. ఫిలాసఫీ చదువుతున్నాను" అంటూ తన గురించి చెప్పుకొన్నాడు సీతాపతి.

" 'నేటి యువత' అనే కొత్త శీర్షిక ప్రారంభించింది మా పత్రిక యీ మధ్య. ఆ శీర్షిక కోసం విశాఖపట్నం లోని యువకుల్ని కొందర్ని ఇంటర్వ్యూ చేసి, ఫోటోలతో సహా భోగట్టా పంపమని సంపాదకుల ఆదేశం. మీ కభ్యంతరం లేకపోతే మిమ్మల్ని ఇంటర్వ్యూ చెయ్యాలను కుంటున్నాను" తను వచ్చిన పని చెప్పుకొన్నాడు నాగరాజు.

సీతాపతి వెంటనే జవాబియ్యలేదు.

ఈ మధ్య కొన్ని పత్రికలు కొంతమంది యువకులతో ఇంటర్వ్యూ జరిపి, వాటిని ఆ వ్యక్తుల ఫోటోలతో సహా ఘనంగా వేసుకుంటున్నాయి.

సీతాపతికి అలాంటి వాటిమీద సదభిప్రాయం లేదు. పత్రికలు తమ సర్క్యులేషన్ పెంచుకోవడంకోసం వేసిన యెత్తు అని అతని అభిప్రాయం.

"అబ్బే! నేను చాలా సామాన్యుడ్నండీ. మీ పత్రిక వాళ్లు ఇంటర్వ్యూ చేసి వేసుకోదగ్గ గణనీయమైన వ్యక్తిని కాను" అన్నాడు సీతాపతి, రెండు నిముషాలు పోయాక.

"అవునో, కాదో ముందు నన్ను ఇంటర్వ్యూ చెయ్యనీండి. మీ భావాలు పత్రికలో వేసుకో దగ్గవి కాకపోతే, నేనే పంపను లెండి."

నాగరాజు అలా అనడంతో సీతాపతి మరి మాట్లాడలేకపోయాడు.

"చూడండీ! నేను కనీసం గంటసేపయినా

ఇంటర్వ్యూ చేస్తాను, అంచేత మీరుకూడా కూచుంటే బావుంటుంది" అన్నాడు నాగరాజు.

సీతాపతి తనుకూడా ఓ కుర్చీలో కూచున్నాడు.

"సీతాపతిగారూ! మీకు దేని గురించయినా నిశ్చితాభిప్రాయం లేకపోతే లేదని చెప్పండి. ఉంటే, అది ఎలాంటిదయినా నలుగురూ ఆమోదించరన్న అనుమానం ఉన్నా, అది మీ మనస్సుకు నచ్చింది కాబట్టి ధైర్యంగా స్థిరంగా చెప్పండి. ఫరవాలేదు" అన్నాడు నాగరాజు.

అతను పెట్టిన షరతులకు తన అంగీకారం తెలియజేస్తున్నట్టుగా సీతాపతి తలూపాడు.

ఇంటర్వ్యూ ఆరంభించాడు నాగరాజు.

"ఫ్యాషన్ల గురించి మీ అభిప్రాయ మేమిటి?"

"ఫ్యాషన్లు వుండాలి."

"అంటే, వెర్రి మొర్రి రకాలు ఎన్ని వచ్చినా అవి అంగీకరించి తీరాలి అంటారు."

"అది ఫ్యాషను కాబట్టి, కొత్తది కాబట్టి అది ప్రతి ఒక్కరూ అంగీకరించి తీరాలని నేననడంలేదు. ఏదైనా ఫ్యాషను మీకు నచ్చితే అది మీరు అవలంబించండి.అంతే గాని 'ఫ్యాషన్లు మా కొద్దు' అంటూ అదే నియమంగా పాటించడం నా కిష్టంలేదు."

"ఇక్కడ నాదో సందేహం. ప్రతిదానికీ ఓ అర్థం వుండాలి. బట్టలు కట్టుకోవడంలో మన ఉద్దేశం. మన నగ్నత్వం కప్పుకోవడం. అలాంటప్పుడు. జల్ బాటం అనీ, నేరోకట్ అనీ, పారలల్స్ అనీ ఏమిటీ వెర్రితనం? టైలర్లను పోషించడానికా?"

క్షణంసేపు ఆలోచించి సీతాపతి అన్నాడు.

"మీ వాదనలో ఉన్న ప్రమాదం మీరు గుర్తించినట్లు లేదు."

"అంటే?"

"బట్టల ఉద్దేశం నగ్నత్వం కప్పుకోవడం అయినప్పుడు పాంటుగానో, పంచెగానో, చొక్కాగానో ఎందుకీ ఏర్పాటు?"

"మీ ఫిలాసఫీ ఈ విషయంలో స్పష్టం చెయ్యండి."

"సంప్రదాయం మంచిదేగాని, నవ్యత్వానికి గొడ్డలి పెట్టే. మేడల్లో వున్న మనం, మన పెద్దల సంప్రదాయం పట్టుకుని వేలాడి వుంటే, పూరిపాకల్లో నివసించి వుండే వాళ్ళం. అలాగే, పూరిళ్ళల్లో నివసించిన మన పూర్వులు రాతి గుహల్లో ఉండాల్సి వచ్చేది. కొత్తదనం సృజనాత్మక శక్తికి చిహ్నం. కొత్తదనం వద్దంటున్నామంటే సృజనాత్మకశక్తిని చంపుతున్నామన్న మాట."

"బావుంది. ఇహ యీనాటి మన ఆర్థిక దుస్థితికి కారణమేమిటి?"

"ఎవరి బాధ్యతలు వారు నిర్వహించక పోవడం."

"కాస్త విశదీకరించండి."

"మేష్టార్లు కుర్రాళ్ళు సరిగా చదవడం లేదంటారు. కుర్రాళ్ళు మేష్టార్లు సరిగ్గా చెప్పడం లేదంటారు. రెండూ నిజమే కొంతవరకు. అయితే, చాలామట్టుకు తన తప్పు ప్రక్కవాడిమీదకు నెట్టేసి తప్పించుకు తిరిగే వ్యవహారమే సాగుతోంది."

"మీరనేదేమంటే, దేశంలో వున్న అనర్థాలన్నింటికీ కారణం, మనలో ఆత్మ విమర్శ లేకపోవడం."

"అవును."

"కాని, తరుణోపాయం కన్పడడంలేదు. మీరు చెప్పే పరిష్కార మార్గాలేమిటి?"

"చెప్తాను. మనిషి ఎంత కష్టపడి సంపాయించాలని పూనుకుంటే, అంత సంపాయించుకో గలిగే ఆర్థిక పద్ధతి

కావాలి. ఏనాడయినా పని చెయ్యకుండా బ్రదికేస్తే, ఆ రోజు తాను పస్తుండాల్సి వస్తుందేమో అన్న భయం ఉండాలి."

"అంటే మీరు సోషలిజానికి వ్యతిరేకులన్నమాట?"

"మీ రా మాట అనే తీరు ఎలాగుందంటే నేనో దొంగనని చెప్తున్నట్టుగా ఉంది. నేను చెప్పిందే జాగ్రత్తగా విని ఆలోచించండి. ప్రభుత్వం జీతాలు పెంచుతోంది. కాని ఉత్పత్తి తరుగుతోంది. ఇదే కొన్నాళ్ళపాటు సాగితే, మనందరం పంచుకోవడానికి పేదరికం, ఆకలి, అప్పులు మిగుల్తాయి తప్ప ఇంకోటి ఉండదు."

"ఇంగ్లీషు రాజభాషగా, బోధనా భాషగా ఉంచడంలో మీ అభిప్రాయం యేమిటి?"

"ఇంగ్లీషును మనం అంతర్జాతీయ భాషగా గౌరవించి నేర్చుకుందాం. దాంతో సరి. మన వంటింటి లెక్కలతో సహా అన్నీ ఇంగ్లీషులో ఉండాలంటే, మరి మన భాషలెందుకు? మన భాషలు ఆఖరుకు, దైనందిన పరిపాలనా వ్యవహారాలు సాగించడానికి కూడా పనికిరావంటే, మన భాషలను ఈ రోజే మర్చిపోవడానికి కృషి చెయ్యడం మంచిది."

నాగరాజు కుర్చీలోంచి లేచాడు, సీతాపతి అనుమతి పొంది, గదిలోని వస్తువుల్ని పరిశీలించసాగాడు. సీతాపతి పుస్తకాలున్న అలమరలో మూలగా బుల్‌వర్కర్ అగుపించింది.

"మీకు బుల్‌వర్కర్ వాడే అలవాటుందన్న మాట?" ఆశ్చర్యంగా కళ్ళు పెట్టి, సీతాపతివైపు తిరిగి అన్నాడు నాగరాజు.

"అవునండీ! అంతేకాదు. 'మార్నింగ్ వాక్' కూడా అలవాటుంది. వైజాగ్ బాక్సింగ్ క్లబ్బులో మెంబర్ని."

"ఓహో! అలాగా" తల పంకించి, మళ్ళా గదిలోని వస్తువుల పరిశీలనలో పడ్డాడు నాగరాజు.

కొంచెం వాడిన మందారాలతో అలంకరించిన వెంకటేశ్వరస్వామి పటం అల్మయిరా మొదటి అరలో ఉంది.

"మీరు దేవుడన్నా, ప్రార్థనలు జరపడమన్నా నమ్ముతారన్న మాట?"

"అవును. నమ్ముతాను. మానవుడికి సంక్రమించిన సకల విద్యలూ అతడు తన మనస్సు కేంద్రీకరించ గలిగే శక్తి వల్లనే పొందాడు. ప్రార్థనలు, పూజలు ఆశక్తిని పెంచుతాయి. మనస్సుని నిశ్చలం చేయటంవల్ల మనోశక్తిని కేంద్రీకరించడం, ఆ శక్తిని కావలసిన దోవలో ప్రసరింప జెయ్యడం సాధ్యమవుతుంది" చెప్పాడు సీతాపతి.

అలా ఇంకో అరగంట అనేక విషయాలమీద సీతాపతి అభిప్రాయాల్ని పొందాడు నాగరాజు.

ఆ తర్వాత వెళ్ళిపోయాడు, సీతాపతికి "గుడ్ లక్" చెప్పి.

## 2

'మీ ఇంటర్వ్యూపడ్డ పత్రిక పంపిస్తాను. చూద్దురుగాని' అన్నాడు నాగరాజు, వెళ్ళిపోయే ముందు.

రెండు నెలలయినా సీతాపతి తోటి జరిగిన ఇంటర్వ్యూ పడ్డ పత్రిక సీతాపతికి రాలేదు.

గ్రంథాలయానికి పోయి ఆంధ్ర యువతి పత్రిక పాత కాపీలు తెప్పించి తిరగేసి చూశాడు. ఎక్కడా తనతోటి జరిపిన ఇంటర్వ్యూ పడలేదు.

బహుశా, తన అభిప్రాయాలు సంపాదకుడికి నచ్చక పోయుండవచ్చు. సమాధాన పడ్డాడు సీతాపతి.

అయితే, వారంరోజులు తిరగకుండానే, ఇంకో విచిత్ర

మైన సంఘటన జరిగింది.

ఆ రోజు ఉదయం అయిదున్నర గంటల ప్రాంతంలో 'మార్నింగ్ వాక్' కోసం రామకృష్ణా మిషన్ బీచివరకూ వెళ్ళాడు సీతాపతి.

తిరిగి వస్తుండగా అతనికి కాస్త దూరంలో ఓ కారు వేగంగా వచ్చి ఆగింది. అందులోంచి నలుగురు యువకులు గబగబా దిగారు.

సీతాపతి వారిని ముసుపెప్పుడూ చూళ్ళేదు ఊళ్లో. పొడుగ్గా జులపాలు, గుబురుగా గెడ్డాలు. మీసాలు పెంచుకుని ఉన్నారు. కళ్ళకు నల్లకళ్ళద్దాలున్నాయి. తల మీద క్రికెట్ కేప్స్ ఉన్నాయి.

వారు తిన్నగా సీతాపతిని సమీపించారు. సీతాపతికి అటూ ఇటూ ఇద్దరూ నిలుచుంటే, మూడో వ్యక్తి సీతాపతి వెనుక నిలుచున్నాడు.

నాలుగో వ్యక్తి తిన్నగా వచ్చి సీతాపతి కాలరు అందుకుని, దవడమీద టపీటపీమని రెండు గుద్దులు గుద్దాడు.

సీతాపతి దిగ్భ్రాంతుడయ్యాడు.

ఎవరు వీళ్ళు? ఎందుకు కొడుతున్నారు తనను? తనేం చేసాడని యీ దండ ప్రయోగం?

సమ్మెట పోట్లలాంటి దెబ్బల బాధను ఓర్చుకుంటూ "ఆపండి మీ దౌర్జన్యం. ఎవర్ని చూసి ఎవరనుకుంటున్నారో?" అరిచాడు సీతాపతి.

దెబ్బలు కొట్టిన వ్యక్తి సీతాపతి మాటలు వినిపించుకోలేదు.

మరి రెండు గుద్దులు వెంటవెంటనే సీతాపతి దవడమీద కొట్టాడు.

సీతాపతికి కోపం పొడుచుకు వచ్చింది. కాని తమా యించుకున్నాడు.

"చెప్తుంటే మీకు కాదూ. ఎందుకు నన్ను కొడ్తున్నారు?" మళ్ళా అరిచాడు.

ఆ వ్యక్తి యింకోసారి చెయ్యి విసరబోయాడు.

దాంతో సీతాపతి కోపం నసాళానికి అంటింది.

ఇదేదో రౌడీగుంపు అనుకొన్నాడు.

గత మూడేళ్ళుగా తను బాక్సింగ్ ఛాంపియన్‌గా విశాఖ క్లబ్‌లో పేరు తెచ్చుకున్నట్టు వాళ్ళకు తెలీదు.

అంతే!

సీతాపతి ఏనుగుల గుంపులో సింహపు పిల్ల అయిపోయాడు.

తనను అంతవరకూ కొడ్తున్న వ్యక్తిని అమాంతంగా రెండుచేతుల్లో ఎత్తి నేలకు కుదేసాడు.

అతడు లేవడానికి అయిదునిముషాలైనా పడుతుంది. ఈలోపున మిగతావారు అతనిమీద ఒక్కుమ్మడిగా పడ్డారు.

మెరపుల్లాంటి ముష్టిఘాతాలతో వార్ని తగురీతిగా సత్కరించాడు.

పావుగంట నడిచింది ముష్టియుద్ధం. సీతాపతి ఒంటిమీద ఒక్కసారంటే ఒక్కసారి చెయ్యి వెయ్యలేకపోయారు ఆ నలుగురూ.

ఇహ, తమ పస ఐపోయిందనుకున్నారు కాబోలు.

తాము వచ్చిన కాల్లోకి దూకి, ఎలా వచ్చారో అలాగే తుర్రుమన్నారు రెండు నిముషాల్లో.

ఆ దుర్మార్గులకు గట్టిగానే బుద్ధి చెప్పినందుకు తృప్తిగా నిట్టూర్చి ఇంటిత్రోవ పట్టాడు సీతాపతి.

తన గదికి తిరిగి వస్తున్నాడన్న మాటేగాని, సీతాపతి

మనస్సులో లెక్కలేనన్ని ఆలోచనలు ముసురుకున్నాయి.

కనీసం చెప్పుకోవడానికైనా తనకు శత్రువులు లేరు.

తనది రాజులవంశం. తాతతండ్రులవైపు ఏవైనా పాత కక్షలు మిగిలిపోయాయా అనికూడా ఆలోచించాడు.

ఇంతకూ ఎవరు తనమీద కత్తిగట్టారు?

సీతాపతి గదికి చేరుకొన్నాడు. జేబులోంచి తాళాలు తీసి తలుపులు తెరవబోయాడు.

కాని, ఆ అవసరం లేకపోయింది. అంతకుముందే తన గది యెవరో తెరిచారు దొంగతాళాల్తో. తలుపులు దగ్గరగా చేరవేసివున్నాయి.

తన కాలేజీ చదువు మొదలైన దగ్గర్నుండీ, ఆ గదిలోనే ఉంటూవచ్చాడు. ఎప్పుడూ తనగదిలో దొంగతనం జరగలేదు.

'ఇవాళంతా తమాషాగా ఉంది' అనుకుంటూ గది తలుపులు తోసి లోనిక ప్రవేశించాడు సీతాపతి.

గదంతా చిందరవందరగా ఉంది. తను ఉంచిన ఏ వస్తువూ దాని స్థానంలో లేదు.

అల్మైరాలోని పుస్తకాలన్నీ నేలమీద గిరవాటేసి ఉన్నాయి.

దొంగలు డబ్బుకోసం వెదుకుతూ వాటిని అలా తల క్రిందులుచేసి ఉంటారు.

అల్మైరాలో తను ఉంచిన డబ్బు వినిగాపోయిఉండా లని అనుకున్నాడు సీతాపతి.

ఆశ్చర్యం!

తన డబ్బువుంది అక్కడ. లెక్కపెట్టి చూసాడు. నయాపైసా పోలేదు.

ఐతే, వాళ్లెవరో తన గదిలో ఎందుకు చొరబడినట్టు?

లేకపోతే, వాళ్ళు డబ్బుతీసుకుని పారిపోయేలోపల,

తను వచ్చేసాడా?

అలా కావడానికి వీల్లేదు!

డబ్బుకోసం వచ్చిన వాళ్ళకు, అది కనిపించకపోతే అది వేరే విషయం. తీరా డబ్బు వాళ్ళ కళ్ళబడ్డాక, తీసి జేబులో పెట్టుకోవడం యెంత సేపు?

ఐతే, వాళ్ళెవరో తనగదికి యెందుకు వచ్చినట్టు?

ఆలోచిస్తూ తన మంచంవద్దకుపోయి కూర్చున్నాడు. గత ఆరేళ్ళుగా తను రాస్తున్న డైరీలు మంచంమీద పడి వున్నాయి.

వాటిలో ఒకటిరెండు తెరవబడి మంచంమీద బోర్లించి వున్నాయి.

వాళ్ళెవరోగాని తన డైరీలు చదివారన్న విషయం అర్థమయింది సీతాపతికి.

దేశంలో నేటి ఆర్థిక పరిస్థితుల్ని చర్చిస్తూ, తనకు తోచిన పరిష్కారమార్గాలు వివరించిన పేజీలు ఉన్నచోట డైరీలు తెరవబడి ఉన్నాయి.

తను సామ్యవాద సిద్ధాంతాలకు వ్యతిరేకి. అనేక విద్యార్థి సంఘాల సమావేశాల్లో సామ్యవాదం దేశానికి ఒనగూర్చబోయే నష్టంగురించి ఎన్నోసార్లు మాట్లాడేడు.

ఈనాడు చాలా విద్యార్థి సంస్థలు నాగ్జలిజమ్ చేతిలో ఉన్నాయి.

వాళ్ళెవరికో తన అభిప్రాయాలంటే ఒళ్లు మంటగా ఉండి వుంటుంది. తనమీద కత్తిగట్టి సాధించాలని అందుకే పూనుకుని ఉంటారు.

తనని మాటలతో గెలవలేక చేతలకు దిగివుంటారు. పైగా, తనలాంటి వాళ్ళను తుదిముట్టిస్తేగాని నవసమాజం ఆవిర్భవించదని కదా వారి సిద్ధాంతాలు చెపుతున్నాయి.

తను బహుజాగ్రత్తగా ఉండాలి, అనుకున్నాడు.

# 3

సీతాపతి పార్కు బెంచీమీద కూర్చున్నాడు. మెల్లగా చల్లగా, హాయిగా వీస్తున్న సాయంపవనాన్ని ఆనందిస్తున్నాడు.

పావుతక్కువ ఏడుగంటలయి వుంటుంది. అప్పుడే దీపాలు వెలిగాయి.

ప్రకృతి సౌందర్యారాధనలో లీనమైన అతని మనస్సుకు అంతరాయం కలిగింది.

సీతాపతి దృష్టి మళ్ళించి చూసాడు.

చిన్న కాయితంవుండ అతనికి తగిలి, నేలమీదపడింది అతని కాళ్ళకు అడుగు దూరంలో.

ఆ ఉండను విసిరిన వ్యక్తి తలవంచుకుని గబగబా వెళ్ళిపోసాగాడు.

ఆ కాగితం వుండ ప్రమాదకరమైనది కాదుకదా?

ఆ వుండవైపు నిశితంగా చూసాడు కాసేపు. బూటు కాలితో గట్టిగా తన్నాడు. అది ఎగిరి, అతనికి మరికాస్త దూరంలో పడింది.

యథాలాపంగా ఆ ఉండ విసిరేసి వెళ్ళిన వ్యక్తి దిక్కుకు చూసాడు.

ఆ వ్యక్తి వెళ్ళిపోలేదు.

చెట్లనీడలో తన మొహం దాచుకుని, ఆ ఉండనుతీసి చూడమన్నట్లుగా సైగ చేస్తున్నాడు ఆ వ్యక్తి.

తను కూచున్న బెంచీమీంచి ఒక్క దూకు దూకాడు. ఆ వ్యక్తి నిలుచున్న చెట్లవైపుకు.

సీతాపతి ఊహలు అంతకుముందే పసిగట్టేసినట్లుగా సీతాపతిలో కదలిక అవుపించగానే ఆ వ్యక్తి రోడ్డుమీదకు దూకి, జనంలో కలిసిపోయాడు.

కాస్సంత నిరాశ చెందాడు సీతాపతి. మళ్ళీ పార్కు

లోకి వచ్చి కూర్చున్నాడు.

ఆ కాయితం వుండ ఇంకా అక్కడే వుంది. మెల్లగా వంగి, వేళ్ళతో అందుకున్నాడు. ఉండ మెత్తగా తెరిచింది. విప్పాడు. అదొక ఉత్తరం, తన పేర్న వుంది.

సీతాపతి చదవనారంభించాడు.

"అన్నయ్యా!"

అలా పిలిచేవారు తన కెవరున్నారు? సీతాపతి అచ్చెరువొందాడు.

"నువ్వు నాకెలా తెలుసని ఆశ్చర్యపోతున్నావు కదూ? ఆపదలో వున్న వాళ్ళను ఆదుకునే నీ సుగుణం గురించి నాకు తెలుసు.

ఓసారి కొందరు రోమియోలు ఓ అమ్మాయిని వెంబడించి అసహ్యంగా మాట్లాడుతూ ఏడ్పిస్తుంటే అది చూసి వాళ్ళకు తగురీతిగా దేహశుద్ధి చేసి బుద్ధి చెప్పావు. అలాగే యింకోసారి, ఊతకొలనులో దిగి చేతులూ కాళ్లూ ఆడించలేక నిస్సహాయంగా మునిగిపోతూ ఉన్న ఓ కుర్రాడ్ని బయటికి లాగి రక్షించావు.

ఈనాడు నేను పెద్ద ఆపదలో వున్నాను. నన్ను కొంత మంది దుర్మార్గులు ఎత్తుకుపోయారు. నేను సీతమ్మధార శ్మశానానికి దగ్గరగా ఉన్న పాడుబడ్డ దెయ్యాల మేడలో బందీని అయి వున్నాను.

నన్ను ఆ దుండగులు తమ సుఖాల కీలుబొమ్మగా వాడుకుంటున్నారు. అన్నయ్యా! నా భర్తనో, నా తండ్రినో లేదా పోలీసు వాళ్ళనో సహాయం అర్థించక నిన్నే ఎందుకడిగానో అని అనుకోవచ్చు.

పోలీసు డిపార్టుమెంటు సంగతి నేను వేరుగా చెప్పనక్కరలేదు. నీకు తెలుసు. ఇహ నా తండ్రిగాని, నా భర్తగాని నన్ను రక్షించ పూనుకోరు. చెడినదాన్ని

వెనక్కి తెచ్చుకుని, తమ గౌరవమర్యాదలు ఎలా పోగొట్టుకుంటారు వారు?

ఈ ఉత్తరం అందించే వ్యక్తి ఆ ముఠాలో వాడే. కాని, వాడేమీ అనకు. నా మీద యెలాగో జాలికలిగి, యీ మాత్రం సాయం చెయ్యడానికి అంగీకరించాడు.

అన్నయ్యా! వస్తావుకదూ! యీ సోదరిని రక్షిస్తావుకదూ! క్షణాలు యుగాలుగా, రోజులు మన్వంతరాలుగా గడుపుతున్నాను. ఎంత త్వరగా వస్తావో!"

ఇట్లు సోదరి
అనసూయ.

ఉత్తరం చదువుతుంటే సీతాపతి గుండెలు ఆవేశంతో ఊగిపోయాయి. ఆ క్షణంలోనే బయలుదేరి, ఆ అమ్మాయిని బంధించిన ముష్కరుల్ని ముక్కలు ముక్కలుగా నరికి పారేయాలన్నంత ఆగ్రహం వచ్చిందతడికి.

నిగ్రహించుకున్నాడు.

ఆ ఉత్తరం యింకొకరి చేతిలో పడిందంటే చాలా ప్రమాదం. దాన్ని చిన్న చిన్న ముక్కలుగా చేసి, రోడ్డు మీదకు వచ్చి, పైడు కాలవలోకి గిరవాటేసాడు. బరువుగా నిట్టూర్చి గదికి బయలుదేరాడు.

ఆపదలో చిక్కుకున్న అమ్మాయిని ఎలాగయినా రక్షించి తీరాలన్న ఆవేశపు ఉప్పెనతో కొట్టుకుపోయాడు సీతాపతి చాలాసేపు.

ఆమెను యెలా రక్షించాలో పథకాలు వేస్తుంటే, సీతాపతి ఆవేశం కాస్త తగ్గుముఖం పట్టింది. ఆలోచన నిదానంగా సాగింది.

కొంపదీసి, తనను ఉత్తరం మిషతో ఏకాంత ప్రదేశానికి లాక్కొచ్చి, తన్నేందుకు జరుపుతున్న పన్నాగం కాదుకదా ఇది?

దీర్ఘంగా ఆలోచించాడు కాసేపు.

ఒక్కసారి ఉత్తరంలోని విషయాలన్నీ గుర్తుకు తెచ్చుకున్నాడు.

ఆ ఉత్తరం యధార్థమైనదిలాగే కనిపిస్తోంది.

ఒకవేళ, ఆ ఉత్తరం నిజమైనది కాకపోయినా, తన ప్రత్యర్థుల్ని ప్రత్యక్షంగా చూసే అవకాశం అయినా కలుగుతుంది.

అంచేత, ఆ ఉత్తరం నిజమని నమ్మి వెళ్ళడంలోనే లాభం ఉంది, అనుకున్నాడు.

# 4

శ్మశానానికి యెడంగా, గుబురుగా, అల్లిబిల్లిగా ఎదిగిన రావి, వేప, మర్రి, పనస, టేకు చెట్లమధ్య ఉంది పెద్యాల మేడ.

గాలికి విసురుగా ఊగుతున్న చెట్ల కొమ్మల రాపిడి, ఆకుల గలగల శబ్దంతప్ప ఇంకో శబ్దం వినిపించడంలేదు.

"పట్టపగలే ఇంత చీకటిగా ఉంది. రాత్రయితే ఎవరూ అడుగుపెట్టలేరేమో!" అనుకుంటూ మేడలోకి ప్రవేశించాడు సీతాపతి.

నేలంతా దుమ్ము, మట్టి, ఎండిన ఆకులు వగైరా చెత్త పడి అసహ్యంగా, చీదరగా ఉంది. ఎక్కడపడితే అక్కడ విస్తారంగా దట్టంగా సాలెగూళ్ళు అల్లుకుని ఉన్నాయి. గబ్బిలాలు ఎగురుతున్నాయి అటు ఇటూ.

'ఇందులో ఎవరూ ఉంటున్న జాడలేదే!' అనుకుంటూ, ముఖానికి, ఒంటికి చుట్టుకుపోతున్న సాలెగూళ్ళను చేతులతో చుట్టి విదిలించుకుంటూ హాలుదాటి, మేడమెట్లు యెక్కసాగాడు సీతాపతి.

అదే సమయంలో పెద్ద శబ్దం అయింది, అతని వెనుగ్గా.

కంగారుగా వెనుదిరిగి చూసాడు.

మేడమీది గోడ కొంత మేర విరిగి నేలకూలింది.

మళ్ళా మరుక్షణంలో భరించలేని నిశ్శబ్దం అలుము కుంది అంతటా.

పాడుబడిన గోడ దానంతటదే విరిగి కూలిందా? లేక ఎవరయినా కూలదోసారా?

ఆలోచిస్తూ మళ్ళా మేడ మెట్లు యెక్కసాగాడు సీతాపతి.

ఇలా మేడమీది వరండాలో అడుగు పెట్టాడో లేదో, రెండు మూడు గదుల తలుపులు ఒకేసారి ఫెళ్ళున కొట్టు కున్నాయి ధనధనామంటూ.

సీతాపతి గుండెలు అదిరిపడ్డాయి.

ఇదంతా దెయ్యాలపని అనుకోవచ్చునా? లేక అన సూయను తను రక్షించడానికి వచ్చినట్టు వాళ్ళకు తెలిసి పోయిందా?

ఏది ఏమైనా తను మరింత జాగ్రత్తగా ఉండాలను కున్నాడు సీతాపతి.

తనతో తెచ్చుకున్న సైకిలు చైను జేబులోంచి తీసి పట్టుకుని, ముందుకు నడిచాడు.

గది తరువాత గది, మేడమీది గదులన్నీ పరిశీలిం చాడు.

ఎక్కడా పిట్ట మనిషి లేడు.

తనను యెవరో ఫూలుని చెయ్యాలనుకున్నారు. సఫలీ కృతులయ్యారు.

చకచకా మేడ మెట్లు దిగి బయటకు వచ్చేసాడు.

తల వంచుకుని, చెట్లక్రిందన నడుస్తుంటే, ఏదో విరిగి పడుతున్నట్టు ఫెళ్లున శబ్దం అయింది.

మెరుపులా ప్రక్కకు తప్పుకున్నాడు నేర్పుగా.

లేకపోయుంటే, పెద్ద చెట్టుకొమ్మ తిన్నగా వచ్చి అతని తలకాయ బద్దలు చేసేది.

తలెత్తి చెట్లకొమ్మల్లోకి చూసాడు ధైర్యంగా.

కాని, అక్కడ గుబురుగా పెరిగిన చెట్లకొమ్మలు తప్ప మనుషులు కనిపించలేదు అతడికి.

ఏమిటీ విచిత్రం?

తొందరగా నడుచుకుంటూ చెట్లతోపు లోంచి బయట కొచ్చాడు సీతాపతి.

# 5

తన ప్రత్యర్థుల ఉద్దేశం తనను ఫూల్ చెయ్యడమా? లేక తనని తన్ని వదిలెయ్యడమా?

అంతు తెలీని అయోమయావస్థలో కొట్టుకోసాగాడు సీతాపతి.

మనస్సంతా చికాకుగా తయారయింది. కొద్దిరోజులు విశాఖపట్నం వదలి వెళ్ళిపోవాలనిపించింది అతడికి.

వెంటనే తన బ్రీఫ్ కేసులోకి రెండు జతల బట్టలు, ఒక తువ్వాలు, స్లీపింగ్ డ్రెస్ సర్దుకుని, విజయవాడలో ఉన్న తన మేనమామ గారింటికి బయలుదేరాడు మద్రాసు మెయిలులో.

అవాళ మద్రాస్ మెయిల్ చాలా రద్దీగా ఉంది. అన్ రిజర్వ్‌డు థర్డుక్లాసు కంపార్టుమెంటులో ఎలాగో నిలుచోవడానికి జాగా దొరికింది.

'అదే పదివేలు దేవుడా!' అనుకుంటూ, లగేజీ రేక్ లో తన బ్రీఫ్ కేసు ఉంచి నిట్టూర్చాడు హాయిగా.

రాత్రి పదిగంటలకు విజయవాడ చేరుకునేంతవరకూ ఆ ఆలోచనలతోనే వేగిపోయాడు సీతాపతి.

స్టేషనుకు సమీపంలోనే, అతని మేనమామ యిల్లు

వుంది. బ్రీఫ్ కేసు చేత బుచ్చుకుని, కులాసాగా నడచి వెళ్లిపోయాడు.

"ఏమిట్రోయ్? ఇంత హఠాత్తుగా ఊడిపడ్డావ్?" అడిగాడు సీతాపతి మేనమామ, సీతాపతిని చూసి.

"ఊరికినే మామయ్యా! నాలుగు రోజులు మీ ఇంటిలో ఉండి వెళదామనిపించింది. ఇలా వచ్చాను" చెప్పాడు సీతాపతి.

రాత్రికి తను వాడుకోవాల్సిన బట్టలు పెట్టెలోంచి బయటకు తీయాలని సీతాపతి బ్రీఫ్ కేసు తెరిచాడు.

సీతాపతి కళ్ళు జిగేల్ మన్నాయి.

ఆ పెట్టెలో మొత్తం యెంతుందో గాని, పెట్టెనిండుగా సరికొత్త నూరు రూపాయల నోట్లకట్టలు పేర్చి ఉన్నాయి.

కాని, తన బట్టలు లేవు.

తన పెట్టెలోకి ఆ డబ్బెలా వచ్చింది?

పెట్టెను అతిజాగ్రత్తగా పరిశీలించాడు.

అది తనదికాదు. అంటే, తన పెట్టె మారిపోయింది.

అయినా, మారడానికి, తన పెట్టెలాంటిది యెక్కడా ఇంకో పెట్టె అవుపించలేదు తనున్న కంపార్టుమెంటులో.

కాని, ఇదెలా సంభవం? ఆలోచించాడు సీతాపతి దీర్ఘంగా.

ఏదో స్టేషనులో పోలీసులు ఎందుకో ప్లాట్ ఫారం మీద తిరుగుతూ ఎవరికోసమో వెదుకుతున్నట్టు ప్రతీ కంపార్టుమెంటులోకి చూసుకుంటూ వెళ్ళారు. అది గుర్తుకు వచ్చింది సీతాపతికి.

ఆఁ... అదీ సంగతి! అవి దొంగనోట్లు.

వేట కుక్కల్లాగు తన వెంటబడ్డ పోలీసుల్ని చూసి, ఏ క్షణాన్నైనా ప్రేలడానికి సిద్ధంగా ఉన్న టైం బాంబులాంటి నోట్లకట్టల బ్రీఫ్ కేసు తక్షణం తన చేతి

లోంచి వదిలించుకోవడం తప్ప వేరే గత్యంతరం లేదను కుని ఉంటాడు ఆ వ్యక్తి.

అదే సమయంలో తన బ్రీఫ్ కేసు అవుపించింది. రెండూ ఒకేలా ఉండటం అతని అదృష్టం. మాయ మాటాడ కుండా, పెట్టెలు మార్చేసాడు.

అతను తీసుకువెళ్ళిన తన పెట్టెలో తన ఎడ్రసు ఉంది. తన కందించిన డబ్బుకోసం అతను తనని వెదుక్కుంటూ వస్తాడు తప్పకుండా.

ఈలోపున తనే పోలీసులకు హుషారిచ్చి, ఆ వ్యక్తి తనవద్దకు వచ్చేటప్పటికి ఘనమైన అరదండాల స్వాగతం పోలీసుల చేత అందించాలి.

తనకు టైంలేదు. వెంటనే తను విశాఖపట్నం వెళ్ళి పోవాలి మళ్ళా.

"మామయ్యా! నేను ఇప్పుడే విశాఖపట్నం వెళ్తున్నాను. అంతా తరువాత వివరంగా చెప్తాను. నాకు అడ్డు చెప్పకు. వస్తాను" అని చెప్పి హఠాత్తుగా మెయిలుకు తిరిగి విశాఖపట్నం బయలుదేరాడు.

విశాఖపట్నం చేరుకోగానే, తిన్నగా డి. యస్. పి. ఆఫీసుకు వెళ్ళాడు సీతాపతి.

డి. యస్. పి. ని పెర్సనల్ గా కలుసుకుని అర్జంటుగా మాట్లాడి తీరాలని కోరగానే అనుమతి వెంటనే లభిం చింది.

డి. యస్. పి. సమక్షానికి వెళ్ళాడు సీతాపతి.

బ్రీఫ్ కేసు తెరచి నోట్లకట్టలు చూపిస్తూ, తనకెలా ఆ పెట్టె దొరికిందీ సవిస్తరంగా చెప్పాడు డి. యస్. పి. తో.

"అయితే ఇవి దొంగ నోట్లంటారు?" అన్నాడు డి. యస్. పి. సీతాపతి చెప్పిందంతా విని.

"అనే నా అనుమానం. లేకపోతే, ఇంత డబ్బు నాకు

వదలిపెట్టి, అయిదు వందలయినా చెయ్యని నా బ్రీఫ్ కేసు ఎత్తుకుపోయే మూర్ఖుడుంటాడా? చెప్పండి."

సీతాపతి వాదనలోని బలం గుర్తించాడు డి. యస్. పి.

ఇద్దరూ కలసి పోలీసు కార్లో మహారాణీపేట స్టేట్ బేంక్ కు వెళ్ళారు.

మేనేజరుకు నోట్లు చూపించి "ఇవి మంచివో కావో చూసి చెప్పండి" అని అడిగాడు డి. యస్. పి.

బాంక్ మేనేజరు ఆ నోట్లను అటూ ఇటూ చాలా సేపు చూసి, హెడ్ కాషియర్ ను పిలిపించాడు. "చూడండి. నిన్న ఇంత మొత్తం ఎవరయినా మన బేంక్ లోంచి డ్రా చేసారా?" అని అడిగాడు.

"ఉండండి. చూసి వస్తాను" అంటూ హెడ్ కాషియర్ వెళ్ళిపోయి, అరగంట పోయాక తిరిగి వచ్చాడు.

"నిన్న కాదుగాని మూడు రోజుల క్రితం ఎక్సో ఎంటర్ ప్రైజస్ ప్రొప్రయిటర్ శంకర్రావుగారు పది లక్షలు డ్రా చేసారు. వాటి నంబర్లు నావద్ద ఉన్నాయి ఇంకా" చెప్పాడు హెడ్ కాషియర్. ఆ నోట్లమీది నెంబర్లు, కాషియర్ ఇచ్చిన నెంబర్లు చెక్ చేశారు. ఒక్కటే!

"అంటే, ఇవి మంచి నోట్లన్నమాట!" ఆశ్చర్యపోతూ అన్నాడు డి. యస్. పి.

అవన్నీ మంచి నోట్లన్న విషయం సీతాపతిని కూడా ఆశ్చర్యంలో ముంచేసింది.

అవన్నీ మంచినోట్లయితే, నోట్లపెట్టెపై బదులు తన పెట్టెను ఆ వ్యక్తి యెవరో తీసుకెళ్ళడానికి కారణ మేమిటి? ఆలోచిస్తున్నాడు.

"ఆల్ రైట్ మిస్టర్ సీతాపతి. ఆ డబ్బు యజమాని యెవరో తేలింది. పదండి. అతనికి ఆ డబ్బు ఇచ్చి వచ్చేద్దాం," అంటూ డి. యస్. పి, లేవగానే సీతాపతి

కూడా లేచాడు.

ఇద్దరూ బేంక్ మానేజరుదగ్గర శెలవుతీసుకుని బయటకు వచ్చి పోలీసు కారెక్కారు.

వాల్తేరు అప్‌లాండ్స్‌లో ఉన్న శంకర్రావు బంగళాని పోలీసు కారు సమీపించగానే, కారును ఆపి ఇద్దరూ దిగారు.

శంకర్రావు ఇంటివద్దనే ఉన్నాడు. డి. యస్. పీని, సీతాపతిని సాదరంగా లోనికి ఆహ్వానించాడు.

సీతాపతి సోఫాలో కూర్చుంటూ, బ్రీఫ్ కేసు తన ఒడిలో ఉంచుకుంటున్న సమయంలో, శంకర్రావు ఆ పెట్టెను చూసినట్టున్నాడు. "అరే! యీ పెట్టె మీకు దొరికిందన్న మాట!" అన్నాడు ఆశ్చర్యంగా; వెంటనే సీతాపతి చేతిలోంచి పెట్టెను లాక్కుని తెరచి చూసాడు.

"అమ్మయ్య! ఎలా పెట్టినవి అలాగే ఉన్నాయి" అని దీర్ఘంగా నిట్టూర్చి, సీతాపతివైపు తిరిగి "మీ బ్రీఫ్ కేస్ తీసుకొస్తానుండండి" అంటూ లేచి లోనికిపోయి సీతాపతి బ్రీఫ్ కేసు తెచ్చి అందించాడు.

సీతాపతి తన పెట్టె అందుకుని తన వస్తువులు సరి చూసుకున్నాడు.

"మావాడు మహానిర్లక్ష్యంగా తయారయ్యాడండి. బాంక్‌లోంచి డబ్బు డ్రాచేసి యింటికిచ్చి వెళ్ళిపోక, అలా తుని వరకు వెళ్ళి వచ్చాడట. ట్రైన్‌లో యీ గల్లంతు జరిగింది" అన్నాడు శంకర్రావు సంజాయిషీ చెప్పుకుంటున్నట్టుగా.

సీతాపతి జ్ఞాపకం తెచ్చుకోసాగాడు. తన పెట్టె లాంటి పెట్టె పట్టుకుని ఎవరయినా తన కంపార్ట్‌మెంటు ఎక్కారా అని!

ఎవరూ ఎక్కినట్టు తనకు గుర్తులేదు. ఆ వ్యక్తి ఎవ

రయినా, తన పెట్టె ప్రక్కన అతని పెట్టె పెట్టివుంటే, తనకు గుర్తు వుండివుండేది. అలాంటిదేమీ జరగలేదు.

అంటే శంకర్రావు అబద్ధం చెబుతున్నాడా? చెబితే ఎందుకు చెబుతున్నట్టు?

ఏమో, ఏం జరిగిందో, అంతా అయోమయంగా వుంది తనకు.

"వస్తానండి" అంటూ లేచాడు సీతాపతి. చేతులు జోడించి శంకర్రావుకు నమస్కరించాడు.

డి. యస్. పి. కూడా లేచాడు.

ఇద్దరూ పోలీసుకారు యెక్కారు.

# 6

రెండు నెలలపాటు యూనివర్సిటీకి శెలవులు ఇచ్చారు.

రెండు రోజులపాటు స్వగ్రామం శృంగవరపుకోటలో ఉండి వద్దామనుకున్నాడు సీతాపతి.

చిన్న సూటుకేసులోకి బట్టలు సర్దుకుని, శృంగవరపుకోట వెళ్ళాడు.

ఊరికి దూరంగా శివాలయం. గెడ్డ ఒడ్డు. పుణ్యగిరి అడవులు. శృంగవరపుకోటలో ఉన్ననాళ్లు రోజూ సాయంకాలం పుణ్యగిరి కొండల వైపుకు షికారుకు పోవడం సీతాపతికి అలవాటు. చాలా యిష్టం కూడా.

ఆ రోజు సాయంకాలం నాలుగు గంటలవుతుండగానే పుణ్యగిరి వైపుకు బయలుదేరాడు సీతాపతి.

ఆకాశం అంతటా నల్లని మబ్బులతో దట్టంగా మూసుకుని ఉంది. ఏ క్షణాన్నైనా వర్షం కురవవచ్చు.

సీతాపతి శివాలయం దాటుతుంటే చిన్న తుంపర పడసాగింది.

అయినా అతను వెనుదిరగ దల్చుకోలేదు. తను

వెనక్కి మళ్ళగానే వర్షం తేలిపోవడం మామూలు.

అందుకే, ముందుకు నడిచిపోసాగాడు.

పాతిక గజాల దూరం వెళ్ళాడో లేదో, వర్షం యెక్కువయ్యింది. ఇంకో అయిదు నిముషాలు తను అలా నడిచాడంటే తడిసి ముద్దవడం ఖాయం.

కాసేపు ఎక్కడయినా, తలదాచుకుంటే, వర్షం తగ్గాక తిరిగి తన షికారు కొనసాగించవచ్చు.

నలువైపులా చూశాడు సీతాపతి. ఫర్లాంగు దూరంలో వున్న దిబ్బమీద ఓ పూరిపాక కన్పించింది.

ఒక్క పరుగులో అక్కడకు చేరుకున్నాడు క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా.

వర్షం ఉధృతమైంది. హోరున కురుస్తోంది. పది నిముషాలు గడిచాయి.

'దీని తీరుచూస్తుంటే అరగంటలోకూడా తగ్గేటట్టు లేదు' సీతాపతి అనుకుంటుంటే, పాక అవతల ఎవరివో తడిసిన పాదాలు అవుపించాయి.

'ఎవరు చెప్మా?' అని అనుకుంటుంటే, నెత్తిన గడ్డి గంప పెట్టుకొన్న ఒకామె వర్షంలో తడిసి ముద్దయిపోయి లోనికి వచ్చింది.

వస్తూనే, "ఏటి బాబూ! మీరున్నారా యిక్కడ?" అంటూ పలకరించింది సీతాపతిని.

సీతాపతి ఆశ్చర్యపోయాడు.

ఆమె ఎవరో తనకు తెలీదు. ఆమెను తను ఎన్నడూ చూసినట్టు గుర్తులేదు.

సీతాపతి బదులివ్వలేదు.

ఆమె నెత్తిమీద గడ్డిగంపను ఓ మూలగా పడేసి, చేతిలోని కొడవలిని విసురుగా అందులో తోసింది.

ఓ క్షణం పోయాక, కాలక్షేపం కోసం అడిగాడు:

"నేను మీ కెలా తెలుసు?"

"అదేటి బాబూ! మీరు నాకు తెలేటి? మీరు వెంకట పతి రాజుగోరి అబ్బాయిగోరు కాదేటి?" అంది.

అవును! ఆమె చెప్పింది నిజమే! అయినా ఆమె తనకు తెలీదు.

ఆ మాటే మృదువుగా అన్నాడు, ఆమె యెక్కడ బాధపడిపోతుందో అని.

"మీరు సదువుకుంతె న్నుగందా! మాలాటోల్లు గేపకం ఉండరు. నాను పోకిరి సింహాచలం కూతుర్నండి. గడ్డి బరకలకొత్తే, వోన ఒట్టుకుంది" చెప్పింది ఆమె.

పోకిరి సింహాచలం యెవరో సీతాపతికి తెలుసు. అతను తాలూకాఫీసులో బంట్రోతుగా పనిచేస్తున్నాడు.

కాని, అతని కో అమ్మాయి వున్నట్టు, అందునా, చంద్రవంకలా అందాలు చిందే కూతురున్నట్టు తనకు తెలీదు.

"ఓహో! అలాగా!" అన్నాడు బయటికి, మనస్సులో ఎలాంటి భావాలు మెదులుతున్నా.

"అదేటి బాబూ! నిలుచుండిపోన్నేటి? కూకోండి" అంటూ పాకలో ఎక్కడో మూలనున్న ఓ చింకిగోనె బయటకు లాగిపడేసింది.

సీతాపతి అయిష్టంగా దానిమీద కూచున్నాడు. అప్పుడు చూసాడు ఆమెను నిశితంగా.

ఆమెకు యిరవై యేళ్లుంటాయి. చామనచాయలో వున్నా ఆకర్షణీయంగా ఉందామె.

తడిసిన బట్టల్లోని ఆమె శరీరం నిగారింపులు అతని మగతనాన్ని అల్లరిపెట్టసాగాయి. అయినా నిగ్రహించు కున్నాడు. ధ్యాస వర్షం మీదకి మళ్ళించుకున్నాడు.

కాని, ఆమె అతని నిశ్చలతను భగ్నం చేసింది.

భుజంమీది పైటను చేతిలోకి తీసుకుని, నడుంవరకూ ఉన్న చీరను వుండగా చుట్టి, నీళ్ళు పిండుతూన్న నెపం మీద ఏపుగా ఎదిగిన తన గుండెలమీది కండల్ని అతనికి ప్రదర్శింపసాగింది.

వేరే దిక్కుకు తన మొహం త్రిప్పుకుని, ఆమెను గమనించనట్లు నటించసాగాడు సీతాపతి.

"మాట!" ఆమె పలికింది.

ఆమె బట్టలు పిండుకునే కార్యక్రమం కానిచ్చిందనుకున్నాడు సీతాపతి. ఆమె వైపు తిరిగాడు.

ఆమె యింకా నడుంవరకూ పూర్తిగా నగ్నంగావుంది.

షాకు తిన్నవాడిలా మళ్లా మొహం త్రిప్పుకున్నాడు సీతాపతి.

ఆమె పగలబడి నవ్వింది. అసలే ఎత్తయిన ఆమె గుండెలు యింకా ఎగిరిపడ్డాయి.

"ఏటలా సూట్టుకుపోతున్రు. సిగ్గు నాకుండాలి మీకు కాదు" అంది ఆమె ఇంకా నవ్వుతూనే.

సీతాపతికి ఒళ్ళు మండిపోయింది. అయినా ఆమె ఆడది! ఏం చెయ్యగలడు?

వర్షాన్ని తిట్టుకుంటూ కూచున్నాడు.

"బయిట మా పెద్ద వోన. లోపల సలిసలిగా వుంది. ఎచ్చగా తొంగుందాం. రారామూ?" అడిగింది ఆమె అతనికి చేరువగా వస్తూ.

పిండి విడిలించిన చీర ఒంటిమీద కప్పుకున్నా, ఆమె ఇంకా నగ్నంగానే అవుపిస్తోంది, బట్ట ఆమె ఒంటిని అతుక్కుపోయి.

సీతాపతి మాటాడలేదు. రాయిలా కదలకుండా కూచున్నాడు.

"ఏటి? పలకవేటి? నా నేటంతన్నానో ఇన్పించనే దేటి?" అంటూ ఆమె గోంగోని అతని చుబుకం పట్టుకుని మొహాన్ని తన వైపుకు త్రిప్పుకోవాలని ప్రయత్నించింది.

సీతాపతి సహనం కోల్పోయాడు. చివాలున లేచి నించున్నాడు.

ఆమెను వదిలించుకోవాలన్న అతని వుద్దేశం ఆమె ఊహించిందేమో, అదనుకనిపెట్టి అతని గుండెలమీద వాలిపోయి, బలంగా అతన్ని కౌగిలిలో బిగించింది.

రాబోతున్న ఉప్పెన ఊహించాడు సీతాపతి. తనను చుట్టివేసిన ఆమె చేతుల్ని కర్కశంగా లాగేసి "ఛీ! ఛీ! ఆడదానివి ఇంత తెగింపా?" అంటూ ఆమెను ప్రక్కకు నెట్టేసి, భోరున కురుస్తున్న వర్షంలో బయటకు వచ్చేసి, ఇంటిత్రోవ పట్టాడు.

## 7

అవాళ రాత్రి ఎనిమిది గంటల సమయమప్పుడు ఏదో అవసరమొచ్చి తన పాంటుజేబులో చెయ్యి పెట్టుకున్నాడు.

అతడిచేతికో కాయితం తగిలింది.

బయటకు తీసి విప్పి చదివాడు ఆశ్చర్యంతో.

"ఒరేయ్ ఫూల్!

'కోరివచ్చిన ఆడదంటే అతిచులకన మగవాడికి' అన్న మాట పాతపాట. అయినా నాకు తెలీక అడుగుతాను- బత్తాయిలాంటి అమ్మాయి ఎదురుగా నిలుచుని 'రా! రా!' అంటూ మీద పడుతున్నా వదిలించుకుపోయావంటే, నీకేదైనా శారీరక లోపం ఉందా? నా మాట విను. పెళ్ళిచేసుకోకు. ఒక ఆడదాని ఉసురు పోసుకోకు.

ఇట్లు

భగ్నప్రణయిని."

సీతాపతి తల తిరిగిపోయింది.

క్షణికోద్రేకంతో ఆమె నీతి తప్పుతుంటే తను మెల కువగా ప్రవర్తించి, ఆమెను నైతిక పతనంనుంచి రక్షిం చాడు. అందుకు ఫలితం ఆమె తన మగతనాన్నే సందే హిస్తోంది.

సీతాపతికి కోపం పొంగుకొచ్చింది.

వెంటనే వెళ్ళి ఆమెను చీవాట్లు పెట్టివస్తేనేగాని, అతని కోపం చల్లారేటట్టు లేదు!

ఉన్నపళంగా సింహాచలం ఇంటికి బయలుదేరి వెళ్లాడు.

"మీ అమ్మాయి వుందా ఇంట్లో?" కోపంగా అడి గాడు సీతాపతి.

"ఎవరు బాబూ!...మీరా!...ఎవరు?...అమ్మాయా! నాకు కూతుళ్ళు లేరు బాబూ! అందరూ కొడుకులే" చెప్పాడు సింహాచలం ఇంట్లోంచి బయటకు వచ్చి.

"మరి...ఇంటాక...పాకలో..." ఇంకా ఏదో అన బోయాడు సీతాపతి. కాని ఆగిపోయాడు.

అప్పుడు గుర్తొచ్చింది సీతాపతికి, తనకు జరిగిందంతా ఓ భూలింగు అని.

ఆమె తనతో ఒక పల్లెటూరి అమ్మాయిలా మాట్లా డింది. కాని, ఆమె వుత్తరం? బాగా చదువుకున్న అమ్మాయి రాసినట్టుగా వుంది.

రంగులు మారుతున్న సీతాపతి మొహం చూసి "ఏమిటి బాబూ! ఏంటి జరిగింది?" అంటూ ఏదో అనుగు తున్నాడు సింహాచలం.

కాని, సీతాపతి అక్కడ లేడు. ఇంటికొచ్చిపడ్డాడు.

ఆమె రాసిన ఉత్తరం మళ్లీ చదివాడు. ఆ ఉత్తరం బట్టి చూస్తే, ఎవరో అమ్మాయి తనను కోరి, పల్లెటూరి అమ్మాయి వేషంలో వచ్చి ఆకర్షించబోయింది. కాని,

తను లొంగలేదు.

వేషం వేసుకొనివచ్చి ఆమె తనను ఆకర్షించడంలో ఆమె ఉద్దేశం యేమిటి? తన్ను నేరుగా వచ్చి అడిగెయ్య వచ్చునే!

అప్రయత్నంగా సీతాపతి చూపులు ఉత్తరంలో ఒక చోట పడ్డాయి.

'భగ్న ప్రణయిని' ఆమె సంతకం చేసిన చోట లేత నీలం రంగులో ఓ ముద్ర ఉంది.

ఒక అగ్నిగుండం. అందులో ఓ హస్తం పాముల్ని పడేస్తోంది.

ఏమిటి దీని అర్థం? ఎవరి దీ చిహ్నం? సీతాపతి దీర్ఘంగా ఆలోచించాడు.

తనమీద ఏదో ముద్రా నిషూ వేసింది. దానిదే ఆ చిహ్నం! ఐతే ఎందుకు? తను వాళ్ళకు చేసిన ద్రోహం గాని అన్యాయంగాని యేమిటి?

ఆ ప్రశ్నలకు సమాధానం కనుక్కుంటేగాని, తను శాంతంగా ఉండలేడు.

మర్నాడు ఉదయం బస్సుకే విశాఖపట్నం బయలు దేరాడు సీతాపతి.

తనకు అత్యంత సన్నిహితంగా ఉన్న తన బాక్సింగ్ క్లబ్ మెంబర్లకు, యూనివర్సిటీలో తనకు బాగా తెలిసిన ప్రొఫెసర్లకూ, తన తోటి విద్యార్థులకూ ఆ ముద్రను చూపించాడు.

ఎవరూ కూడా ఏ సంగతీ చెప్పలేకపోయారు.

సీతాపతి నిరాశ చెందలేదు.

శృంగవరపు కోటలో తనను హిప్నాటైస్ చెయ్య బోయిన ఆ అమ్మాయి కనిపిస్తే తను గుర్తుపట్టగలడు. కాని, ఆ అమ్మాయి మళ్లా అవుపిస్తుందా అన్నదే పెద్ద ప్రశ్న.

ఏది ఏమైనా తనకు జరిగిన విచిత్రమైన సంఘటన లన్నింటిలోనూ, తనకు తెలియవచ్చిన పేరు శంకర్రావు ఒక్కటే.

తన వెంటబడిన ముఠాకీ, అతనికీ ఏదో సంబంధ ముండాలి.

తిన్నగాపోయి శంకర్రావునే అడిగాడు. "ఈ ముద్ర ఏ పార్టీకి సంబంధించిందో చెప్పండి" అంటూ.

"ఏమో నాకేం తెలుసు. అయినా, తిన్నగా వచ్చి నన్నే అడిగే ధైర్యం నీ కెలావచ్చింది?" కళ్ళు పెద్దవిచేసి కోపంగా చూస్తూ అన్నాడు శంకర్రావు.

సీతాపతి అవాక్కయిపోయాడు.

మంచిగా, మర్యాదగా అడిగితే శంకర్రావునుంచి సమాధానం పొందడం కష్టం అన్నది సీతాపతికి అర్థమైంది.

అంతేకాదు!

శంకర్రావు మాట్లాడేతీరు చూస్తుంటే, అతనికీ, ఆ యొక్క ముఠాకూ సంబంధం వున్నదన్నది స్పష్టమైంది.

అప్పటిమట్టుకు మాట్లాడకుండా శంకర్రావు ఇంటి నుంచి వచ్చేసాడు సీతాపతి.

# 8

రాత్రి ఒంటిగంట దాటింది.

రోడ్డుప్రక్కనున్న చెట్లనీడల్లోంచి, శంకర్రావు ఇంటిని జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు సీతాపతి.

అప్పటికి గంటనుంచి ఆ ఇంటి ముందు బీటువేసి వున్నాడు. శంకర్రావు ఇంటిలోని ఆఖరిదీపం ఆరిపోయి అరగంటపైగా అయింది.

రోడ్డుకు అటూ ఇటూ చూసాడు. ఎక్కడా జన సంచారం లేదు.

శంకర్రావు ఇంటి ప్రహారీదాటి అవతలకు చేరుకున్నాడు.

లైట్లు ఆర్పేసినా, ఇంటికి వెలుపలవున్న తోటలో ఎవరయినా ఉన్నారేమోనని కాసేపు చెవులు రిక్కించి విన్నాడు.

గాలికి ఊగుతున్న చెట్ల ఆకుల గలగలలుతప్ప ఇంకో శబ్దం వినరావడంలేదు.

శంకర్రావు ఇంటికి రెండు పర్యాయములు వచ్చాడు సీతాపతి. చూచాయగా ఆ ఇంటి తీరు తెలుసు.

నీటిపైపు నాధారంగా చేసుకుని, మేడమీదకు ఎగ బ్రాకాడు.

మేడమీద బాల్కనీలో నిలబడి లోనికి చూసాడు. బాల్కనీకి ఆనుకున్న గదిలో మందంగా దీపం వెల్గుతోంది.

గది మధ్యలోవున్న మంచంమీది పరుపుమీదఎవరో నిద్రపోతున్నారు.

వరండావైపు తెరచి వున్నాయి ఆ గది తలుపులు.

లోనికిపోవడం సీతాపతికి అందుకే కష్టంకాలేదు.

గదిలోవున్న బీరువాల్లోను, టేబిలు సొరుగుల్లోను తనకు కావాల్సిన విషయం గురించి వెదకసాగాడు.

ఏవేవో పుస్తకాలు, ఆఫీసు కాయితాలు, ఫైళ్ళు అవుపించాయిగాని, వాటిమీద ఎక్కడా, తను చూసిన ముద్ర కనిపించలేదు.

అతనిలో నిరాశ తొంగిచూసింది. అయినా, పట్టు వదలలేదు.

ఆ గదిలో మరికొన్ని రేక్సు, అల్మైరాలు ఉన్నాయి. వాటివైపుకు కదిలాడు సీతాపతి.

ఒకొక్క పుస్తకం, ఫైలు తెరచి చూడసాగాడు.

విసుగొస్తోంది. ఐనా తెచ్చిపెట్టుకుంటున్నాడు ఉత్సాహం.

చివరకు అతని ప్రయత్నం ఫలించింది. ఉత్తరం మీదున్న ముద్రవంటి ముద్రలుగల ఓ ఫైలు కనిపించింది.

ఆ ఫైలు సంకకెరికించుకుని, తన అదృష్టానికి పొంగి పోతూ, అక్కడనుంచి వెళ్ళిపోవడానికి వెనుదిరిగాడు.

అంతే!

అతని తలమీద ఏదో బరువుగా, బలంగా పడి ఫట్ మంది.

సీతాపతి కళ్ళముందు పచ్చని వెలుతురు ముద్ద ముద్దలుగా అవుపించి, మరుక్షణంలో పుంజెడు చుక్కలుగా మారిపోయి అదృశ్యమయ్యాయి.

అతని కళ్ళముందు చిక్కని నల్లని చీకటి తెర నిలిచింది.

సీతాపతి స్పృహకోల్పోయాడు.

# 9

సీతాపతికి స్పృహవచ్చింది. కళ్ళు తెరచి చూసాడు. ఎదురుగా సోఫాలో శంకర్రావు కూచునివున్నాడు. అతని ప్రక్కన అతని వయస్సువాడే ఒక అపరిచిత వ్యక్తి ఉన్నాడు.

"ఏమిటిది శంకర్రావుగారూ! ఎందుకు నన్ను కొట్టించారు?" అడిగాడు సీతాపతి ఆవేశంగా.

"ఆవేశపడకు మిస్టర్ సీతాపతీ! అంతా చెప్తాను. ఉన్నచోటున విశ్రాంతిగా కూచుని అంతా విను" చెప్పాడు శంకర్రావు.

"అలాగే! చెప్పండి. నావెంట ఎందుకిలా పడుతోంది మీముఠా? నాకు డబ్బులేదు. నాకు ప్రభుత్వ రహస్యాలు తెలియవు..." ఇంకా ఏదేదో చెప్పబోయాడు.

ఉద్రేకం తగ్గించుకోమంటూ, శంకర్రావు చెయ్యి ఊపగానే సీతాపతి ఆగిపోయాడు.

"ఈయన పేరు ఈశ్వరరావు. నాకు ప్రాణస్నేహితుడే గాకుండా, నా వ్యాపారా లన్నింటిలోనూ ఇతడు భాగస్థుడు. మే మిద్దరం కలిసి చెయ్యని వ్యాపారం లేదు. చూడని ఊరులేదు. అనుభవించని ఆనందంలేదు. అదంతా గతం. ఇప్పుడు వ్యాపారాన్ని మా కుర్రాళ్ళకు అప్పజెప్పి విశ్రాంతి తీసుకుంటున్నాం.

వాటర్లు ఆవ్ లాండ్స్‌లో మాలాంటి ధనికవృద్ధులకు ఓ క్లబ్బు వుంది.

ఓరోజు కబుర్లలో మా ఈశ్వర్రావు ఏమన్నాడంటే మన నిఘంటువుల్లోంచి నీతి, నిజాయితీ, మంచితనం, న్యాయం మొదలైన పదాలు తీసెయ్యాలి అని. ఏం? అని నేను ప్రశ్నించాను.

ఈ రోజుల్లో నీతిపరుడు ఎవడన్నా వుంటే వాడు అసమర్ధుడైనా అయివుండాలి, లేదా వాడికి అవకాశాలు దొరక్కపోయేనా ఉండాలి, అన్నాడు.

అంటే, నీ ఉద్దేశంలో యీనాడు అందరూ దగుల్బాజీలు, దోపిడీదొంగలు, ఘండాకోర్లు అంటావు, అని అడిగాను.

అవును! మనందరం పెద్దమనుషుల బురఖాలు వేసుకొన్న బందిపోటు దొంగలం, అన్నాడు ఈశ్వరరావు.

నాఒళ్ళు మండిపోయింది. ఈ లోకంలో కొంతమంది అవినీతిగా బ్రతుకుతున్నారంటే, నాకు బాధ కలగక పోను. పోనీ, చాలామట్టుకు అని అన్నా ఏదో సర్దిపుచ్చుకునేవాడ్ని. అందరూ అంటున్నాడు. అలా వాడు అందరికీ ఒకే లేబిలు తగిలించడం భరించలేకపోయాను.

ఈ లోకంలో కొంతమందైనా మంచివాళ్ళు, నిజాయితీపరులు, న్యాయంకోసం పడిచచ్చేవారు లేకపోలేదు అని గట్టిగా వాదించాను. ఒప్పుకోను! ఒప్పుకోను!

అంటూ మొండిగా వాదించాడు ఈశ్వర్రావు.

మాకు రుజువు కావాలి!

అందుకు మేమిద్దరం ఒక పథకం వేసాం. మా క్లబ్బులో ఉన్న మిగతా సభ్యుల సహాయం కోరాం. వారుకూడా మా పథకంలో ఆసక్తి చూపారు.

ఈ పథకం చివరకంటూ అయ్యేఖర్చు నేను భరిస్తాను. ఒకవేళ, ఈశ్వరరావు ఓడిన పక్షంలో, ఆ ఖర్చంతా వాడు ఇచ్చుకోవాలి. ఈశ్వర్రావు 'ఓకే' అన్నాడు.

పాత భావాలు, పాతకాలపు ఛాదస్తాలకు బానిసలు ముసలివాళ్ళు. అందువల్ల మేం కుర్రవాళ్ళనే ఎన్ను కున్నాం.

ముందుగా విశాఖపట్నంలోని కుర్రవాళ్ళతో మొదలు పెట్టదల్చుకున్నాం.

ముందు ఆ యూ కుర్రవాళ్ళల్లో మంచితనం, నీతీ నిజాయి తీలమీద నమ్మకం ఉందో, లేదో తెలుసుకోవాలిగా. రక రకాల పత్రికా విలేఖర్ల పేరున కొంతమందిని పంపించి కొంతమంది కుర్రాళ్ళను ఎన్నుకొన్నాం మా పరీక్షకు.

కొంతమందికి నాలికమీద మాత్రం విశాల భావాలు ఉంటాయి. కడుపులో అన్నీ సంకుచిత భావాలే.

వారివారి ఇళ్ళల్లోకి పంపి వాళ్ళ డైరీలు చదివించాం.

తనకు నష్టం కలగనంతవరకూ ప్రతివాడు మంచివాడు, శాంత స్వభావుడు, దుడుకుతనం లేనివాడు.

అమాంతం నలుగురు దుండగులు మీదపడి అన్యాయంగా కొట్టబోతే, ఎలా వుంటుందో అందుకే చేయించిచూసాం.

కొంతమంది, తమ ఒంటిమీద మొదటిదెబ్బ పడగానే ఉగ్రులైపోయారు. ఐతే, దుండగులు బలవంతులని తెలియ గానే కాళ్ళబేరానికి దిగారు. సూక్ష్మంగా వారిస్వభావం తెలియపర్చిందేమంటే తమ మంచితనం తాలూకు ప్రదర్శన

తమకన్నా బలవంతులైన వాళ్ళవద్దే.

ఆపదల్లో వున్నవాళ్ళను ఆదుకోవడం అన్నది సుగుణమే. రైల్వేకంపార్ట్మెంటులో కూచుని అందరూ చూస్తుండగా అడుక్కున్న వాళ్ళను డబ్బులు వేసే వాళ్ళల్లా, కొంతమందికి మెప్పుకావాలి. నలుగురూ చూసి తమని "ఓహో!" అనాలి.

అదే గుప్తసహాయం చెయ్యమన్నా, ఒకవేళ సహాయం చెయ్యడంవల్ల తమకు కష్టాలొస్తాయి అని తెలిసినా, వారి కరుణాహృదయం మరి కరగదు.

అనసూయ ఉత్తరం, దయ్యాలకొంప వగైరా పరీక్ష అది రుజువు కావడానికే చెయ్యబడింది.

ఇక, కాంతా కనకాలంటే, ఈ రోజుల్లో వెర్రివాళ్లు కానివాళ్ళు లేరు.

అమాంతంగా పదిలక్షలు తమకు దొరికితే ఎలా ఉంటుంది? అకస్మాత్తుగా, అప్సరసలాంటి అమ్మాయి అనువైన ప్రదేశంలో ఒంటరిగా కనిపించి ఊరించి రమ్మంటే ఎలా ఉంటుంది?

ఆ పరీక్షల్లోనూ నువ్వు నెగ్గావు. మేము సృష్టించిన అగ్నిగుండాలన్నింటినీ జయప్రదంగా దాటావు. మిస్టర్ సీతాపతీ! నాపందెం గెలవడానికి నువ్వే కారణం. నీతో పాటుగ మేం పరీక్షకు తీసుకొన్న వాళ్ళందరూ, ఒక సంఘటనలో కాకపోయినా, రెండో సంఘటనలో లొంగిపోయారు.

నీలాంటివాళ్ళు ఇంకా ఈ భూమ్మీద ఉండబట్టే, ఇంకా దయ, జాలి, కరుణ, న్యాయం ఉన్నాయి బ్రతికి."

అంటూ శంకర్రావు తన సోఫాలోంచి లేచివచ్చి, సీతాపతిని గాఢంగా కవుగిలించుకున్నాడు.

సీతాపతికి నోటమాటలేదు. కొయ్యబొమ్మలా ఉండి పోయాడు.

ఈశ్వర్రావుకూడా లేచివచ్చి, సీతాపతిని అభినందించాడు.

# 10

"మిస్టర్ సీతాపతీ! నాదో ప్రపోజల్ వుంది. ఆలోచించి చెప్పండి" అన్నాడు ఈశ్వర్రావు.

"చెప్పండి" అన్నాడు సీతాపతి.

"మా శంకర్రావు ధర్మమా అని మిమ్మల్ని కనుగొన్నాం. త్వరలో కాకినాడలో మా కంపెనీ తాలూకు బ్రాంచి ఒకటి తెరవబోతున్నాం. దానికి మిమ్మల్ని మేనేజరుగా నియమించదల్చుకున్నాం. ఏమంటారు?" అన్నాడు ఈశ్వర్రావు.

"వెరీగుడ్ ఐడియాగా నీది" అంటూ మెచ్చుకున్నాడు శంకర్రావు.

నిదానంగా కాసేపు ఆలోచించి, "ముందుగా నన్ను అసిస్టెంటు మానేజరుగా తీసుకోండి. అనుభవం గడించుకుంటాను. రెండుమూడు సంవత్సరాలు నా పనితనం చూశాక, ఆమీదట మీకు నచ్చితే నన్ను మానేజర్ని చెయ్యండి" అన్నాడు సీతాపతి నెమ్మదిగా.

సీతాపతి సమాధానం వింటూనే "సెభాష్! ఆఖరి పరీక్షలోకూడా విజయుడయ్యావు"! అంటూ చప్పట్లు చరిచాడు ఈశ్వర్రావు.

"అదేంరా?" నివ్వెరపోతూ అన్నాడు శంకర్రావు.

"ఒరేయ్! నువ్వు అన్ని పరీక్షలూ పెట్టావు. స్త్రీవ్యామోహం ధనాకాంక్ష ఉన్నాయో, లేదో చూసావు. కాని, మనవాడికి అధికారవాంఛ ఉందో లేదో పరీక్ష

చెయ్యలేదు. నీకు మానేజరు పదవి ఇస్తాను అంటే అతని రియాక్షన్సు ఎలా ఉంటాయో చూసాను. నాకు బాగా నచ్చాడు ఈ వ్యక్తి. అతనికి అసిస్టెంటు మేనేజరు ఉద్యోగం ఇచ్చేద్దాం," అన్నాడు ఈశ్వర్రావు.

సీతాపతి కృతజ్ఞతాపూర్వకంగా వాళ్ళిద్దరికీ నమస్కరించి, ఆనందంతో ఇంటికి బయలుదేరాడు.

—:ఐపోయింది:—

# సప్లిమెంట్ పోటీ

ABCDG అక్షరాలను తీసుకొని, మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళలో పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, దానితో 75 పైసల పోస్టలు స్టాంపులు జత పరచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేర్చాలి.

మా ఆఫీసులో సీలు వేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఒక ఏడాది పత్రిక లేదా సప్లిమెంట్ ఉచితంగా పంపుతాం. ఈ పోటీలో అందరూ పాల్గొనవచ్చు.

ఒక్కొక్కరు 3 కూపన్లకు మించి పంపకూడదు. ప్రతి కూపనుకు 75 పైసల పోస్టలు స్టాంపులు పంపాలి. ఫలితాలు డిసెంబర్ '74 నెల సప్లిమెంట్ లో చూడండి.



# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికీ సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చును.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖకు రు. 20-/లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్ డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులు కానివారు తమ సభ్యత్వ రుసుము పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో ప్రకటించబడతాయి.—ఎడిటర్.

"అందులో ఎవరయినా వుండొచ్చు" అన్నాను.

"అక్కడికే వెళ్దాం!" అంది డెల్లా.

ఇద్దరం ముందుకు నడిచాం.

కొయ్యతో తయారుచేసిన ఇంటిముందుకు వెళ్ళాం. పహారా తిరుగుతున్న సైనికుడు కనిపించాడు.

మమ్మల్ని చూడగానే తుపాకీ పైకెత్తాడు.

మారు మాట చెప్పకుండా ఇద్దరం చేతులు పైకెత్తాం.

"ఎవరు మీరు?" ఇంగ్లీషులో అడిగాడు అతను.

మేము ఇండియన్స్మనీ, సముద్రంలో తుఫానులో చిక్కుకుని మా నౌక మునిగిపోయిందనీ, మేము ఈదుకుంటూ ఈ దీవికి చేరుకున్నామనీ చెప్పాము.

అతను దగ్గరకు రమ్మన్నాడు.

మాట్లాడకుండా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళాం.

విజిల్ తీసి ఊదాడు. లోపల్నుండి నలుగురు సిపాయిలు వచ్చి మమ్మల్ని చూసి బిక్కమొహం వేశారు. పహారా కాస్తున్న జవానేదో భాషలో చెప్పాడు వాళ్ళకు. అతను ఏం చెప్పిందీ మా కర్థం కాలేదు.

నలుగురు మా దగ్గరకొచ్చి, మమ్మల్ని పెడరెక్కలు విరిచి పట్టుకొని లోనికి తీసుకెళ్ళారు.

లావుపాటి కర్ర తలుపు తెరచి, గదిలాంటి చీకటి గుయ్యారంలోకి మమ్మల్ని దర్శి త్రోసి తలుపుమూశారు.

"బ్రతికాం!" అంది డెల్లా తలుపు మూయగానే.

"కాదు! చచ్చాం!!" అన్నాను నేను.

"ఏం? ఎందుకలాగంటున్నావ్?"

"ఇంకేమనాలి. మన మాటలు వాళ్ళకు అర్థమయినట్లు లేదు. మనల్ని ఎవరో విరోధులనుకుని తెచ్చి బంధించారు. వాళ్ళ భాష నా కర్థంకాలేదు" అన్నాను నేను.

"అది ఏ భాషో నాకర్థంకాలేదు. కానీ వాళ్ళకు ఇంగ్లీషు తెలుసు. నువ్వు చెప్పింది వాళ్ళకు అర్థమయింది" అంది డెల్లా.

"అని నీకెలా తెలుసు."

"పహరా జవాను చెప్పాడుగా."

తలుపు తెరచుకుంది. ఒక జవాను లోనికొచ్చి మమ్మల్నిద్దరినీ వెంట రమ్మన్నట్లు సైగ జేశాడు.

ఇద్దరం లేచి అతని వెంట వెళ్ళాం. హాలులాంటి ముందరి గదిలోంచి పైకి కర్ర మెట్లున్నాయి. అతను ముందు ఎక్కాడు, వెనుక మేము వెళ్ళాం. మెట్లు చివర్నవున్న విశాలమైన గదిలో ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం అటూ ఇటూ పచార్లుచేస్తూ కనుపించింది.

అతని కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రగా మండుతున్నాయి. నడుంకున్న తోలుబెల్టుకు రెండు రివాల్వరు కేస్‌లున్నాయి. చేతిలో చిన్న పేము బెత్తం వుంది. దాని తలవేపు లావుపాటి ఉక్కుగుండు బిగించి వుంది. రెండో వేపు సూదిలా, కూచిగా వుంది.

"కమ్ ఇన్!" సింహంలా గర్జించాడతను.

ఇద్దరం లోనికివెళ్ళి నిలబడ్డాం.

"హౌడిడ్ యు కమ్ టు దిస్ ఐలండ్!" అడిగాడు కోపంగా అతను ఇంగ్లీషులో.

జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాను.

డెల్లాను చూసి దగ్గర కొచ్చాడు. ఆమెను ఆపాదమస్తకం పరిశీలనగా చూశాడు. "నువ్వు అమెరికన్ వా?" అడిగాడు.

"కాదు! ఆస్ట్రియన్ నేను. మా అమ్మ ఆస్ట్రియాలోనే పుట్టిపెరిగింది. కానీ మా నాన్న అమెరికన్ అని అమ్మ

చెప్పేది. వార్ సర్వీస్‌లో మా దేశం వచ్చారట. నేను పుట్టగానే యుద్ధం ముగిసింది. ఆయన వెళ్ళిపోయారట. అంతే! ఆయన్ని నేను చూడలేదు" అంది డెల్లా.

"మీ షిప్ లో రాలేదు. అరేబియన్ సీలో వున్న మా జలాంతర్గామి, సముద్రంలో ఏ షిప్ కూడా తుఫానులో చిక్కుకున్నట్లు మాకు వార్త పంపలేదు. మీరు గూఢచారులు. ఇక్కడ మేము రహస్యంగా దాచివుంచిన అణ్వస్త్రాలకు సంబంధించిన రహస్యాలను తెలుసుకోనివీలైతే ఈ సీక్రెట్ బేస్‌ను తగులబెట్టేందుకు వచ్చారు. అవునా?" అడిగాడు అతను.

బార్బ్‌డ్ వైర్ ఫెన్సింగ్, అందులో కరెంటు వుండటం, అన్నీ గుర్తొచ్చాయి నాకు. అప్పటి నా ప్రశ్నలకు ఇప్పటి ఈ సైనికాధికారి ప్రశ్నలే జవాబు చెప్పాయి.

ప్రపంచంలోనే వున్న రెండు అగ్రరాజ్యాల కూటమిలో ఒక కూటమికి సంబంధించినదీ స్థావరం. నన్ను తన ప్రత్యర్థి పంపిన గూఢచారిగా అతను అనుమానించడాన్నిబట్టి, నాకు కాస్త భయం పుట్టింది.

డెల్లా మాట్లాడకుండా నిలుచుంది.

మరో ఇద్దరు జవాన్లను పిలిపించి మా బట్టలు ఊడదీయించాడు. టార్చిలైటు పెట్టి దేనికోసమో మా వొళ్ళంతా వెతకసాగాడు. ఆపరిస్థితిలో డెల్లాను వివస్త్రగా చూడటం కష్టంగా వుంది. అయినా చెయ్యగలిగిందేమీ లేక నోరు మూసుకున్నాను.

"ఏమిటి వెతుకుతున్నారు?" అడిగాను నేను.

"మీ కూటమిలోని గూఢచారులకు శరీరంమీద ఐడింటిఫికేషన్ తెలిపే ముద్రలుంటాయి. వాటికోసం వెతికాను" అన్నాడతను.

"కనుపించాయా?" డెల్లా అడిగింది. అండర్ వేర్

తోడుక్కొని, 'జి' స్ట్రింగ్ లాక్కుంటూ.

"లేదు!"

"మేముకాదు మొగ్రో అంటే మీరు అనుమానిస్తున్నారు. మాకు రాజ్యాలతోనూ, రాజ్య కూటాలతోనూ, రాజకీయాలతోనూ సంబంధంలేదు" అన్నాను విసుగ్గా.

"ఈ దీవి ఉనికి ఒక్క మా దేశపు అధ్యక్షుడికి తప్ప మరెవ్వరికీ తెలీదు. ప్రపంచపటంలో దీన్ని చూపించరు. దీన్ని మేమే కనిపెట్టాం. ఇక్కడ్నుంచి ప్రపంచంలోని ఏ మూలనైనా అణుబాంబు పంపగలం. ఈ స్థావరాన్ని కాపాడేందుకు చుట్టూ వున్న సముద్రాల్లో ఆరు సబ్ మెరైన్లు వున్నాయి. రెండు నౌకాదళాలున్నాయి."

"అంత రక్షణ ఏర్పాట్లువుండి మామూలు బాటసారులం మమ్మల్నెందుకు వేధిస్తారు. ఆకలితో ఛస్తున్నాం. వదిలేస్తే ఎలాగో వెళ్ళిపోతాం" అన్నాను.

"వెళ్తారా?" వ్యంగ్యంగా అడిగాడా అధికారి.

"ఏం? వెళ్ళనివ్వరా?" అడిగింది డెల్లా.

"ఇక్కడికొచ్చారు. మా రహస్యాలు తెలుసుకొన్నారు. మిమ్మల్ని ప్రాణాలతో ఈ దీవి దాటనీయము. మీ గురించి వాకబు చేయిస్తాను. అందాకా ఖైదులో వేస్తాను. మీరు గూఢచారులుకాదని తెలిస్తే, ఏదైనా పని ఇస్తాను. చేసుకుంటూ ఇక్కడే మాతో వుండండి."

శనిని తప్పించుకుని యముడి పాలబడ్డట్లయింది నా గతి. ఖైదీగా బ్రతకడం ఇష్టంలేక ప్రాణాలకు తెగించి, సముద్రంలో పడి, ఎలాగో తప్పించుకొచ్చి, తీరా ఈ దుర్మార్గుడికి మళ్ళీ ఖైదీగా చిక్కిపోవడం నా దురదృష్టమనుకున్నాను. డెల్లా నాకేసి చూసింది.

పహరా జవాను పైకొచ్చాడు. మమ్మల్నిద్దరినీ తీసుకెళ్ళి గదిలోకి నెట్టి తలుపులు బిగించారు.

డెల్లా అమాంతం వచ్చి నన్ను కౌగలించుకుంది. ఆమెకు పిచ్చి పట్టిందేమోననుకున్నాను.

ముద్దుపెట్టుకుని ఓదారుస్తూ "ఏమయింది?" అడిగాను మెల్లగా.

"ఇంకా ఏంలేదు. ఇంకవుతుంది?" అంది ఏడుస్తూనే.

"డెల్లా! ఏమిటీ బేలతనం ఇంతదాకా నాకు ధైర్యం చెప్పావ్. అంత పెద్ద మృత్యుగహ్వరంలాంటి సముద్రం లోంచి నన్ను తప్పించావ్. నువ్విలా బెంబేలు పడుతున్నా వెందుకు?" అడిగాడు ఓదారుస్తూ దగ్గరకు తీసుకుని.

"నువ్వతని కళ్ళు చూశావా?" అడిగింది డెల్లా.

"చూశాను."

"ఏం తెలిసింది?"

"నాకు ఏమీ తెలీలేదు."

"ఈ దీవిలో అణుబాంబులు, వాటిని కాపలాకాసే సైనికులు తప్ప మరెవ్వరూలేరు. అంతా మొగవాళ్ళే వున్నారు. నేను ఒక్కతెనే ఆడదాన్ని. నన్ను చూసి అతను ఉద్రేకపడటం గమనించాడు. వీళ్ళకు నీతి నియమాలుండవని విన్నాను. నన్ను వీళ్ళంతా బలిపశువును చేసి అనుభవిస్తారని భయంగావుంది" అంది డెల్లా.

నేనుకూడా మిలిట్రీ కాంప్స్‌లో జరిగే కొన్ని దురాగతాలు వినివుండటంవల్ల ఆమె అనుమానాలు, భయాలు అర్థంలేనివని సరిపెట్టుకోలేకపోయాను.

"అలా బెంబేలు పడకు. చావుకు మనం భయపడం. నీవనుకున్నటువంటి పరిస్థితివస్తే ఇద్దర్ని చంపైనా చద్దాం. ధైర్యంగా వుండు" అన్నాను.

డెల్లాను అతికష్టంమీద మామూలు స్థితికి తీసుకొచ్చాను.

తలుపు తెరచుకుంది. డెల్లా పరుగెత్తుకుని వెళ్ళి మూల దాక్కుంది.

ట్రేలో బిస్కెట్లు, బ్రెడ్, బట్టర్, పాలు, సిగరెట్లు పట్టుకొచ్చి పెట్టాడు జవాన్.

"థాంక్స్!" అన్నాను.

"మీ గరల్ ఫ్రెండేది?" అడిగాడు.

"ఎందుకు?"

"ఊరికే! ఆమెక్కూడా పెట్టు. మొత్తం నువ్వే తింటావేమో?" ఆమెమీద వాడు ప్రేమ కనపరచడం నాకు కంపరమెత్తింది. అయినా వాడితో తగువుపెట్టుకోవడం క్షేమంకాదని "అలాగే!" అన్నాను.

వాడు మళ్ళీ తలుపుమూశాడు. డెల్లా పరుగెత్తుకొని వచ్చి కూర్చుంది. ఇద్దరం మెల్లగా కబుర్లు చెప్పుకుంటూ తిన్నాం. బ్రాందీబాటిల్ ఓపెన్ చేసుకుని చెరిసగం త్రాగాం. చెరో రెండు సిగరెట్లు పీల్చాం. ఒళ్ళంతా మత్తెక్కింది.

"కాసేపు పడుకుందామా?" అడిగాను.

"అలాగే! లోపలే ఒక ట్లే ఉక్కపెడుతోంది! నువ్వెళ్ళి తలుపుకు లోపలున్న గొళ్ళెం పెట్టిరా. మనం మంచి నిద్రలో వుండగా ఎవరన్నా వచ్చినా రావచ్చు" అంది.

ఆమె చెప్పినట్లే చేశాను. తిరిగి చూసేసరికి ఆమె వెల్లకిలా పడుకునివుంది. నేను మాట్లాడకుండావెళ్ళి ఆమె ప్రక్కగా పడుకున్నాను. డెల్లా ఏమీ అనలేదు.

కుడిచెయ్యి ఆమె నడుంపైన వేశాను.

ఆమె నా దగ్గరకు జరిగింది. ఆమె రెండుకాళ్ళూ నా కాళ్ళపైన పడ్డాయి. వెచ్చని కౌగిలి ఏదో మత్తుని కలిగించింది. ఆమె యౌవ్వన కుచాలు నా గుండెలకు తగిలి రాపిడి పెట్టాయి. నాలో వేడి పుట్టింది. నడుంపైనున్న

చెయ్యితీసి, తలపైన వేసి, నావైపుకు తక్కున లాక్కు న్నాను.

అరగంటసేపు ఆకాశవీథుల్లో తేలిపోయాం.

ఆనంద సంద్రంలో మునిగిపోయాం.

మత్తుగా నిద్రపట్టింది. చెరోవేపు చనిపోయిన శవాల్లో జీవితంలో నిద్రసుఖం చవిచూడనట్లు మృత్యువులాంటి నిద్రలోకి దొర్లిపోయాం.

దబదబమన్న శబ్దమైంది. చెవులకు వినిపించినా కళ్ళు తెరిపిడి పడకపోవటంతో కదలకుండా పడుకున్నాము.

శబ్దం ఆపలేదు. రెండోమారు మరీ పెద్దగా వినిపించింది.

నా వొంటిపైన డెల్లా చెయ్యి తీసేశాను. కళ్ళు నులుము కొని లేచి కూర్చున్నాను.

"ఎవరో తలుపు తడుతున్నారు! వినిపించిందా?" నా చెవులో నోరుపెట్టి మెల్లిగా అడిగింది డెల్లా.

"ఆఁ!" అన్నాను.

"ఆ మిలిట్రీ ఆఫీసరై వుండాలి!" అంది డెల్లా అనుమానంగా.

"ఏం చేద్దాం?" అడిగాను నేను తలుపువేపు చూస్తూ.

"మనం తలుపుకు లోపలవేపు గడియబెట్టాం. వాళ్లు కొట్టినా సరే మనం తియ్యకుండా కూర్చుందాం. విసుగుపుట్టి వెళ్ళిపోతారు" అంది డెల్లా.

"అలాపోకుండా, తలుపులు బ్రద్దలుగొట్టి లోనికొస్తే" నా అనుమానం వ్యక్తపరచాను.

"రానుకుంటాను. మనల్ని భయపెడితే వాళ్ళ కోరిక తీరదన్న అనుమానంతో అంత సాహసానికి పూనుకోరు. అంతగా లోనికొస్తే మనం ఏమైనా చేద్దాం" అంది డెల్లా.

అప్పుడు నాకు జెయిల్లో ఇచ్చిన మాత్ర గుర్తు

కొచ్చింది. జేబులు తడుముకున్నాను. ప్లాస్టిక్ పర్స్ వెలుపలకు లాగాను. అందులో జాగ్రత్తగా దాచాను మాత్రను. దాన్ని తీసి డెల్లాకు చూపించాను.

ఆ మాత్రవల్ల ఏం ప్రయోజనమో చెప్పాను.

డెల్లా విని సంతోషించింది.

మిలిట్రీవాళ్ళు బలవంతంగా లోనికొస్తే చేరి సగం పుచ్చుకొని చచ్చిపోవాలని తీర్మానించుకున్నాం.

మా మనసులు తేలికపడ్డాయి. తలుపులు తట్టి తట్టి విసుగుపుట్టింది కాబోలు వాళ్లు వెళ్ళిపోయారు.

చీకట్లోనే నేనున్న గదిని పరిశీలించాను. అంతా చెక్కలతో తయారు చేశారీగది. లావుపాటి శీలలు కొట్టి వున్నారు. దాంట్లోంచి బయటకు వెళ్ళాలంటే రెండుమూడు చెక్కలు వూడదీస్తే చాలు. వెనుక వేపంతా ఇసుక దిబ్బలున్నాయి.

ఆలోచిస్తూ కూర్చున్నాను.

"ఏంటా దీర్ఘాలోచన?" డెల్లా నా వొళ్ళో తల పెట్టుకుని అడిగింది.

"ఈ గదిలోంచి తప్పించుకొనే మార్గం గురించి ఆలోచిస్తున్నాను" అన్నాను.

"తప్పించుకుని మాత్రం మనం ఎంత దూరం పోగలుగుతాం. వాళ్ళ కాపలా మనుషులు చుట్టూ వుంటారు. వాళ్ళను తప్పించుకుని వెళ్ళినా, సముద్రంలో పడాల్సిందే. అక్కడినుండి మళ్ళీ మనం బ్రతుకుచావులతో పోరాడడమవుతుంది" అంది డెల్లా.

"అలాగని ఇక్కడే వుంటే వాళ్లు నీ యవ్వనాన్ని దోసుకోవడమో, మనం దాన్నుండి తప్పించుకునేందుకు ఆత్మహత్య చేసుకోవడమో జరుగుతుంది. చావు తప్పదని తెలిశాక, ఇక్కడెందుకూ కూర్చోవడం?"

డెల్లా నవ్వింది.

"ఏదన్నా మార్గం ఆలోచించావా?"

"ఆఁ!"

"ఏమిటి?"

"ఆ వెనుక వేపు రెండు చెక్కల్ని తొలగిస్తే మనం బయటకు వెళ్ళగలం. కానీ అవి తీసేందుకు రావు. కాల్చి వెయ్యాలి. దానికి నాకు ప్లాను తోచింది. రేపు వాళ్లు మనకు ఆహారంతోపాటు బ్రాందీ ఇస్తారు. దాన్ని తాగకుండా ఆ చెక్కలపై చల్లి, అగ్గిపుల్ల గీచి పెడదాం. మెల్లగా కాలడం మొదలెడతాయి. ఆ తర్వాత మనం తప్పించుకోవచ్చు. ఎలా వుంది నా ప్లాను?" అడిగాను.

"చాలా బావుంది!" అంది డెల్లా.

"ఇంకా చాలా టైమ్ వున్నట్లుంది తెల్లవారేందుకు. హాయిగా పడుకొని నిద్రపోదాం" అన్నాను.

"అలాగే!" అంది.

మళ్లా ఇద్దరం సర్దుకుని పడుకున్నాం. అతి కష్టంమీద నిద్రపోయాం.

నాకు మెలకువ వచ్చింది. లేచి కూర్చున్నాను. డెల్లా ఇంకా నిద్రపోతూనే వుంది. ఆమెను తట్టి లేపాను.

మాకు కాలకృత్యాలు తీర్చుకోవాలనిపించింది. నేను వెళ్లి గొళ్ళెం తీసి తలుపు తట్టాను.

తలుపులు తెరుచుకున్నాయి.

పహారా జవాన్ అడిగాడు ఏం కావాలని. చెప్పాను.

నన్ను లోపలే వుండమని సైగజేసి వెళ్ళాడు. ఆ తర్వాత రెండు నిముషాలకు ఇద్దరు సైనికుల్ని వెంటబెట్టుకొని వచ్చాడు.

మమ్మల్ని వెలుపలకు రమ్మన్నారు. వాళ్ళ వెంట నడిచాం. కర్రలతోనే తయారుచేసిన లెట్రిన్, బాత్ రూం

చూపించారు. వాళ్ళు తుపాకులు పట్టుకుని అక్కడే నిలబడ్డారు. ఇద్దరం పదినిముషాల్లో అన్నిపనులూ ముగించుకున్నాం.

అప్పుడే చూశాను కొంచెం దూరంగా ఇసుకలో ప్రత్యేకంగా తయారుచేసిన 'హెలిపాడ్' పై నిర్మలంగా నిద్రబోతున్నట్లు నిలుచివున్న హెలికాప్టర్‌ను.

వీళ్ళు రాకపోకలకు వాడే వాహనం అదన్న విషయం అర్థమయింది. దాంట్లో వెళ్ళగలిగితే బాగుండుననిపించింది. నాకు హెలికాప్టర్ డ్రైవ్ చెయ్యడం తెలుసు. మా ముతాకూడా ఒక చిన్న హెలికాప్టర్ వుంది. దాన్ని రెండుసార్లు నేనే నడిపాను.

ఇద్దరం తిరిగి గదిలో కొచ్చాం.

మేమనుకొన్నట్లే మాకు మళ్ళా ఆహారం సిగరెట్లు, బ్రాందీ, పంపారు. హాయిగా తిన్నాం. బ్రాందీ బాటిల్ మాత్రం తీసి జాగ్రత్త చేశాం.

అరగంట తర్వాత ఒక సైనికుడు వచ్చి నన్ను వెలుపలకు పిల్చుకుపోయాడు. ఆ స్థావరం అధికారి ముందు నిలబెట్టాడు.

"నువ్వు ఇండియన్‌వి కదూ!" అడిగాడు.

"అవును!" అన్నాను.

"ఆమె నీకెలా కలిసింది."

ఈమారు అబద్ధం చెప్పకుండా ముత్తెం నిజం కక్కేశాను.

"సో! యు ఆర్ ఎ స్మగ్లర్!" అన్నాడు తలపంకిస్తూ.

"అవును" అన్నాను.

"నీ వెంటవున్న అమ్మాయి చాలా అందంగా వుంది. ఆమెను ఒప్పించి మాతో వుండేట్లు చేస్తావా. నీకు

ఉద్యోగ మిస్తాను. తిండికీ గుడ్డకూ లోటు లేకుండా చేస్తాను.''

అతని మాటలు నా కర్థమవుతున్నా, అర్థంకానట్లు చూశాను.

''ఐ వాంట్ టు ఎంజాయ్ హెర్!'' అన్నాడు.

''ఆవిడ ప్రాస్టిట్యూట్ కాదు! నా గరల్ ఫ్రెండ్! ఆమె ఇలాంటి వాటికి ఒప్పుకోదు'' అన్నాను.

''ఆమె అంగీకారం లేకుండా నేను ఆమెను అనుభవించగలను. కానీ అది నా కిష్టంలేదు, మీకిక్కడ దిక్కెవ్వరూ లేరు. నా కోరిక తీరుస్తానంటే మిమ్మల్ని ఏ ఇబ్బంది లేకుండా చూసుకో మంటాను. నా మాట కాదంటే అన్నం, నీళ్లు లేకుండా మలమల్లాడి ఛస్తారు,'' అన్నాడు ఆఫీసరు.

''రెండు దినాలు టయిమ్ ఇవ్వండి. ఆమెకు మెల్లగా నచ్చచెపుతాను. ఎలాగోలా ఒప్పిస్తాను'' అన్నాను.

''నో! రెండు దినాలు కాదు. ఒక్క దినం టయిమ్ ఇస్తాను. రేపు రాత్రికి ఆమె నా దగ్గరకు రావాలి!''

''ఆల్ రైట్! అలాగే!'' అన్నాను.

నాకు కావలసింది ఈ రాత్రి మాత్రమే. నా ప్రయత్నం ఫలిస్తే రేపటికి మళ్లా ఎక్కడుంటామో తెలీదు. కానీ ఈ నీచుడికి దూరంగా మాత్రం వుండగలుగుతాం.

''నువ్వెళ్లవచ్చు. నీకేమన్నా కావలిస్తే అతన్నడుగు వెంటనే ఇస్తాడు'' అన్నాడు.

''థాంక్స్!'' అన్నాను.

మళ్లా గదిలోకి వచ్చాను.

రాగానే డెల్లా ఏంజరిగిందో చెప్పమంది.

ఆ మిలిట్రి అధికారి కోరిక గురించి చెప్పాను.

తన అనుమానం నిజమయినందుకు నన్ను చూచి విస్తు పోయింది.

"అయితే నువ్వు అతని దగ్గరకు పంపుతావా నన్ను!" అనుమానంగా చూస్తూ, భయపడుతూ అడిగింది.

"నెవర్! ప్రాణాలతో పంపను. తప్పనిసరయితే నిన్ను చంపి, నేను ఛస్తాను. ఏదిఏమైనా మనం రాత్రికి ఎలాగైనా తప్పించుకు వెళ్లాలి. మన ప్లాన్ పారిందంటే, హెలికాప్టర్‌లో వెళ్లిపోదాం!" అన్నాను.

"నీకు దాన్ని నడపటం తెలుసా?"

"తెలుసు" అన్నాను.

"అందులో గాస్, వుందో లేదో నీకేం తెలుసు?"

"మామూలుగా వుంచి పెడతారు. ఎక్కువగా లేకున్నా కొద్దిగానన్నా వుంటుంది. వీలయినంత దూరం వెళ్దాం. ఎక్కడయిపోతుందని అనుమానముస్తే అక్కడే లాండ్ చేద్దాం! మనల్ని పట్టుకునేందుకు వాళ్ళు రావడం అసాధ్యం. వాళ్ళకున్న దొక్కటే హెలికాఫ్టర్ లాగుంది" అన్నాను.

"ఇంత పెద్ద సావరంలో ప్రపంచాన్ని దగ్ధం చెయ్యగల ఆటంబాంబులు దాచిపెట్టుకొని ఒక్క హెలికాప్టర్ మాత్రమే వుంచుకుంటారని నేననుకోను. విమానాలుకూడా వుంటాయి" అంది డెల్లా.

"వాళ్ళు విమానాల్లో వచ్చినా సరే మనం హెలికాఫ్టర్‌లో వెళ్ళిపోదాం. చావు తప్పనిసరయితే అప్పుడే చద్దాం. ప్రాణాలతో వాళ్ళకు మనం దొరకూడదు" అన్నాను దృఢంగా.

"ఆల్‌రైట్! అలానే!" అంది డెల్లా.

చీకటి పడిందాకా కబుర్లు చెప్పుకుంటూ, గడిపేశాం.

రాత్రి ఎనిమిదింటికి మళ్ళీ భోజనం తెచ్చిపెట్టారు. మా ఇద్దరికీ అంత ఆకలిగా లేదు. బ్రెడ్ లు, బిస్కట్లుతీసి

దాచుకున్నాం. కాఫీమాత్రం ఆరగించాం. ట్రేని దూరంగా పెట్టాం.

పదకొండైంది. తలుపుదగ్గర చెవిపెట్టి రిక్కించి విన్నాను. ఏవిధమైన శబ్దం రావటంలేదు. క్యాంప్ అంతా నిశ్శబ్దంగావుంది. ఇక మా ప్రయత్నం మొదలుపెట్టడానికి ఇదే సరైన అదనుగా వుందనిపించింది.

బ్రాందీబాటిల్ తీశాను. కార్క్ ఓపెన్ చేసిదూరంగా పారేశాను. కుడిచేతిలోకి వంచుకొని మెల్లగా వెనుక వేపు గోడలావున్న కొయ్యల్లో రెంటిని సెలెక్టుచేసి వాటిపైన మెల్లగా దట్టించడం మొదలెట్టాను. డెల్లా విచిత్రంగా చూస్తూ కూర్చుంది.

పదినిముషాల్లో నా పని పూర్తయింది.

అగ్గిపెట్టితీసి, పుల్లవొకటి వెలుపలికి లాగాను. భగవంతుణ్ణి ప్రార్థించి వెలిగించి, కొయ్యకు అంటించాను.

తప్పున అంటుకుని మంట మొదలైంది. మెల్లగా క్రింది నుంచి పైకి ప్రాకింది మంట. కొయ్య కాలిపోవడం ఆరంభమయింది.

ఇద్దరం ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని చూస్తున్నాం.

సగందాకా కాలినిచ్చాను. మూలనున్న ట్రే తెచ్చి దాన్ని మంటలపైన పెట్టాను. రెండు క్షణాలలో ఆరిపోయాయి మంటలు. ట్రే బాగా వేడెక్కి నా చేతులు మండాయి. దాన్ని దూరంగా పారేశాను.

మంటలు ఆరిపోయి ఎర్రగా నిప్పులు గ్రక్కుతూంది నేను కాల్చిన భాగం.

నా కాలికి బూట్లున్నాయి. లేచి నిలబడి కాలినచోట బూటతో బలంగా తన్నాను. ఆ రెండుకొయ్యలు వెనక్కి విరిగిపడ్డాయి. మనిషి వెలుపలికి వెళ్ళిపోయేందుకు అవసరమైనంత జాగా ఏర్పడింది. నేను వెలుపలికివెళ్ళి, కాస్త

ఇసుక చేతుల్లో తీసుకుని నిప్పులపైన చల్లాను. డేల్లా మేము పాక్ చేసిన ఫుడ్ పార్సిల్ తీసుకుని వెలుపలికొచ్చింది.

ఇద్దరం ఒకరి చేతుల్లో ఇంకొకరి చేతులు పెట్టుకుని హెలిపాడ్ వైపు పరుగెత్తాం.

అక్కడ ఎవ్వరూ లేరు. దీవంతా నిర్మానుష్యంగావుంది.

ఇద్దరం హెలికాప్టర్ ఎక్కి కూర్చున్నాం. దానికి కాళ్ళదగ్గర నాలుగైదు మెషిన్ గన్‌లు కూడా బిగించి ఉన్నాయి.

ఇంజన్ ఆన్ చేశాను. ప్రొపెల్లర్ తిరిగింది. జుయ్‌మని చెవులు హోరెత్తిస్తున్న శబ్దం చెయ్యసాగింది. గేర్ వేశాను. హెలికాప్టర్ గాల్లోకి లేచింది.

ఆలోగా నలుగురైదుగురు సైనికులు హెలికాప్టర్ వైపు తుపాకులు పేల్చుకుంటూ, రావటం గమనించాను. స్పీడ్ హెచ్చించాను. ప్రొపెల్లర్ మరీ వేగంగా తిరగటంతో రయ్‌మని తిన్నగా పైకిలేచిపోయింది హెలికాప్టర్.

(ఇంకా వుంది)

## 38

సుజాత వ్యాధిగ్రస్తురాలు. ఏవేవో జబ్బులతో తీసుకుంటోంది.

డాక్టర్ ప్రేమావతికి ఒక రోజు టెలిఫోన్ చేసింది. డాక్టర్ డిస్పెన్సరీలో లేదు. ఆమె సెక్రటరీ సరళ ఫోన్ అందుకుంది. తన వ్యాధి లక్షణాలను గురించి సుజాత, సరళకి వివరించింది.

ఇలా చాలాసార్లు సుజాత ఫోన్ చేయడమూ, సరళే ఫోన్ అందుకోవడమూ జరుగుతూ వచ్చింది. ఎట్టకేలకు ఒకనాడు డాక్టర్ స్వయంగా ఫోన్ అందుకుంది.

సుజాత, డాక్టరుతో ఇలా అంది. "నన్ను మీ సెక్రటరీతోనే మాట్లాడనివ్వండి డాక్టర్! నా వ్యాధి గురించి మీకంటే ఆమెకే బాగా తెలుసుననుకుంటాను!!"

* * *

ఇల్లా కొనాలని నా భార్య మోజుపడుతూంటే, అమ్మకానికి వచ్చిన ఒక ఇల్లును చూడ్డానికి వెళ్లాం.

ఒక సేల్స్‌మన్ మాకు ఇల్లు చూపించి దాంట్లో విశేషాలు వర్ణిస్తున్నాడు.

నా భార్య అవేవీ వినటంలేదు. రోడ్డుకి ఆవల ఒక ఎలక్ట్రిక్ సబ్‌స్టేషన్ వుండటం ఆమె దృష్టిని ఆకర్షించింది. అంత దగ్గరలో అది వుండటం ఆమెకు నచ్చలేదు.

సేల్స్‌మన్ ముందు గాభరా పడిపోయాడు. కాని ఒక క్షణంలో సర్దుకుని ఇలా చెప్పాడు.

"అమ్మా, ఎలక్ట్రిక్ సరఫరా కేంద్రం ఇంత దగ్గరలో వుండటం మీ అదృష్టం. మీకు సప్లయి అయ్యే కరెంటు తాజాగా వుంటుంది!"

* * *

తన స్కూలు వార్షికోత్సవంనాడు ఎలాగైనా వచ్చి అక్కడ జరిగే వేడుకలు చూడాలని, ఏడేళ్ళ రమేష్ తన బామ్మను వేధించసాగాడు.

ఆమెకు అలాంటివి సుతరామూ ఇష్టంలేదు. ఇక వాడి పోరు పడలేక, ఎట్టకేలకు అంగీకరించి వాడివెంట వెళ్ళింది.

రమేష్ సరదా పడిపోయాడు. తన స్నేహితుడు సురేష్‌కి బామ్మను పరిచయం చేస్తూ ఇలా చెప్పాడు.

"ఈమె మా బామ్మ. 70 ఏళ్లు దాటాయిరా. ఇంకా బతికే వుంది!"

—పి. గోపాలరావు, నెల్లూరు.

## 39

కొంచెం పరిచయమున్న ఇద్దరు సైంటిస్టులు ఒకచోట కలిసారు. ఇద్దరు కోతలరాయుళ్లే కావటం వలన ఒకరి కంటె ఒకరు గొప్పలు చెప్పుకోసాగారు.

మొ. సైం:- నేను ఒక పరిశోధన చేయుచున్నాను. ఆ పరిశోధన ఫలించితే దేశంలో ఆహారానికి లోటు వుండదు!

రెం. సైం:- ఏం పరిశోధన?

మొ. సైం:- ఏ విత్తనాలైనా సరే! భూమిపై వేసిన వెంటనే మొలకెత్తి, పెద్దదై ఒకే రోజులో పంట పండుతుంది!

రెం. సైం:- వెరీగుడ్! నేను కూడ ఓ పరిశోధన చేశాను. ఫలించింది కూడ. ఇక దానిని ప్రభుత్వానికి సమర్పించాలి!

మొ. సైం:- ఏమి కనిపెట్టావు!

రెం. సైం:- నేను కనిపెట్టిన పదార్థం తింటే చచ్చేదాకా మళ్లీ ఆహారం తీసుకోనవసరం లేదు!!

మొ. సైం:- —?.—?—??

* * *

ఓ వ్యక్తి రోడ్డు వెంట వెళ్తూ కనపడ్డ ఓ మనిషిని "ఎమ్, మిస్టర్! ఈ రోడ్డు ఎటు వెళ్తుంది" అని అడిగాడు.

మొదటి వ్యక్తి త్రాగి వున్నాడు!

నీ యవ్వ! ఏ రోడ్డు భే??

మొదటి వ్యక్తి దిమ్మెర పోయాడు. "ఎమ్, మిస్టర్! మాటలు జాగ్రత్తగా రానీ! నిన్నేమన్నానని తిడుతున్నావు" అన్నాడు కోపంగా.

"అరె నీ యవ్వ! నన్ను తంతానంటావు భే???"

మొదటి వ్యక్తి ఆశ్చర్యపోయాడు, 'డామిట్! వీడి కేమన్నా పిచ్చా?' అనుకున్నాడు.

"ఏమిటి! నన్ను పోలీస్ స్టేషన్‌కు పట్టుకెళ్తావా? ఆగు నీ యవ్వా! మెక్కలిరగ తంతాను" అన్నాడు.

అంతే! తిరిగి చూడకుండా పరుగెత్తాడు మొదటి వ్యక్తి.

—హవంతీ రఘువిమల్ ప్రసాద్, భోగ్గాం.

